# జూన్ 1975

సచిత్ర మాసపత్రిక సంపుటి. 13. సంచిక: 5


## విషయసూచిక


16. మిస్టర్ సంపత్ ఎం. ఏ. (సీరియల్)—మాదిరెడ్డి సులోచన

27. బెంగ—ఎల్బి. శ్రీరామ్

33. కబుర్లు—చలసాని ప్రసాదరావు

37. బొమ్మా బొరుసు—పర్వతనేని గంగాధరరావు

40. ఎవర్నిచేసుకోను (సీరియల్)—అబ్బూరి ఛాయాదేవి

54. మధుమానం (కవిత)—తురగా జానకీరాణి

58. రిలీఫ్—వి. మధుసూదనరావు

59. సోషలిస్టు—సి. వి. ఆర్. శివకుమార్

64. ఎదురింటి కిటికీ (మినీకథ) జ్యోతి

65. వేపచెట్టు—వెంకటలక్ష్మి—జి. ఎస్. సూరి

84. సినిమా


నవలానుబంధం

మహారాణి — చిట్టారెడ్డి సూర్యకుమారి

ముఖచిత్రం : లలితా మూవీస్‌వారి 'చల్లని తల్లి'లో

సుమిత్ర, విజయకాంత్


సంస్థాపకులు:
కీ. శే. వి. వి. రాఘవయ్య

మేనేజింగ్ ఎడిటర్:
శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

[illegible] 40/1 [illegible] స్ట్రీటు, టి. నగరం, మద్రాసు-600017.

ఫోన్: 440548; సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో) రు. 42/-

చేసుకోలేకపోయాను. ఇప్పటికయినా మనం పెళ్ళి చేసుకుందాం లలితా!"

రాజు ముఖంలో సిన్సియారిటీ చూసి లలిత తడబడింది.

రాజు ఎప్పటిలా సెల్ఫిష్‌గా మాట్లాడితేనే బాగుండేది. "వద్దు రాజూ! నా మాట విని హాయిగా ఎవరైనా గొప్పింటి అమ్మాయిని చేసుకో! సుఖపడు!"

"ఇంకా నామీద కోపం పోలేదా లలితా! చెప్పుతున్నావా?"

"నో! నో! నిజం! నీమీద నాకే కోపమూ లేదు. నువ్వు సుఖపడాలనే చెప్తున్నాను నాకు తెలుసు. నువ్వు సుఖపడగలవు..."

"సరేలే! నీకంత అహంకారమయితే, నేనేం చెయ్యగలను?"

కోపంగా వెళ్ళిపోయాడు రాజు. ఆ కోపం చూసి 'హమ్మయ్య.' అనుకుంది లలిత పరవాలేదు. రాజు తప్పకుండా త్వరలోనే ఏదో "మంచి" సంబంధం చూసి పెళ్ళి చేసుకుంటాడు.

ప్రతిరోజూ సాయంత్రం నాలుగింటికి మాధవరావు ఇంటికెళ్ళి వీలయినంతసేపు కూచుని వస్తోంది లలిత మాధవరావుకి ఎడంకాలు మోకాలివరకు తీసెయ్యవలసి వచ్చింది ఎడంచెయ్యి పూర్తిగా విరిగిపోయింది. పోలీస్ ఆఫీసర్‌గా పనిచెయ్యగలిగే అవకాశం లేక ఇంట్లోనే ఉండిపోవలసి వచ్చింది. పెద్ద లైబ్రరీ ఏర్పాటు చేసుకున్నాడు. ఎప్పుడూ చదువుతూ ఉంటాడు. "బిజీగా పనిచెయ్యటానికి అలవాటు పడినవాణ్ని ఊరికే కూచుంటే ఎలా తోస్తుందా అనుకునేవాణ్ని. ఈ పుస్తకాలు చదువుతోంటే చాలా హాయిగా ఉంది లలితా!" అన్నాడు. అతని ముఖంలో చిరునవ్వు చూసి లోలోపల మెచ్చుకుంది లలిత.

సాయంత్రం అయ్యేసరికల్లా అతని స్నేహితులు చాలామంది వచ్చేవారు. డిపార్ట్‌మెంట్ విషయాలు చెప్పేవారు, అతని సలహాలు తీసుకునేవారు "చూసావా! నా స్థితి ఇలా మారకపోతే, నాకింత మంచి మంచి స్నేహితులున్నారని తెలిసేదేకాదు." అనేవాడు హుషారుగా.

వాళ్ళతో ఏ కోశానా ఈర్ష్య లేకుండా ఆప్యాయంగా మాట్లాడే మాధవరావును ఆశ్చర్యంగా చూస్తూ కూచునేది లలిత. మాధవరావు స్నేహితులందరికీ కూడా లలితను మాధవరావు ఇంట్లో చూడటం అలవాటైపోయింది. వాళ్ళందరికీ కాఫీలు లలితే అందించేది.

అతని గదిలో బల్లమీద మణిమాల ఫోటో ఉంది. అది చూసినప్పుడు మాత్రమే అతని ముఖాన్న మబ్బులు క్రమ్మేవి. అప్రయత్నంగా ఒక్క నిట్టూర్పు వెలువడేది.

ఆరోజు లలితను చూడగానే ఆనందంతో "కంగ్రాచ్యులేషన్స్!" అన్నాడు మాధవరావు.

"దేనికి?"

"నిన్న రాజు నా దగ్గరకు వచ్చాడు త్వరలోనే నిన్ను పెళ్ళి చేసుకోబోతున్నానని చెప్పాడు"

"ఇందాకే రాజుతో చెప్పేసాను అతణ్ని చేసుకోలేనని"

"లలితా" నిజంగా ఆశ్చర్యపోయాడు మాధవరావు

"రాజు మంచి ఉద్యోగంలో ఉన్నవాడు అందగాడు నిన్ను కోరి చేసుకుంటానంటున్నాడు ఇంతకంటే ఏం కావాలి?"

"మానవ జీవితాల్లో విషాదాల కన్నింటికీ మూలం ఏమిటో తెలుసా? మనకేం కావాలో మనకు తెలియకపోవటం ఏదో ఏదో కావాలని దేనివెనకో పరుగులు పెడతాం చివరికెప్పుడో అర్థమవుతుంది, మనకు కావలసింది అదికాదని"

"ఓహ్! అయితే ఇంతకూ నీకు కావలసిందేమిటో నీకు తెలుసా?"

"తెలుసుకున్నాను ఎవరిదగ్గరనుండో తెలుసా? మీ దగ్గరనుండే!"

"నా దగ్గరనుండా? నీకు కావలసింది నేను చెప్పానా? ఏమిటది?"

"మానవత్వం! నాకేకాదు ఏ మనిషికైనా కావలసింది మానవత్వం అదొక్కటే అతనికి సుఖాన్నీ, సంతృప్తినీ, ఆనందాన్ని ఇవ్వగలిగింది ఈ విషయం తెలుసుకున్నాను మీదగ్గరనుండి"

"అనవసరంగా నన్ను గొప్పచేసి మాట్లాడుతున్నావు లలితా! మనందరికీ ఏం నేర్పినా ఈ జీవితమే నేర్పుతుంది ఏమయినా నువ్వు చేసింది మంచి పనికాదు ఎంతకాలం పెళ్ళి చేసుకోకుండా ఉంటావ్?"

"పెళ్ళి చేసుకోకుండా ఉండాలని నాకేం లేదు మీరు ఒప్పుకుంటే ఈ క్షణంలో మిమ్మల్ని పెళ్ళి చేసుకుంటాను" గబగబ అనేసింది లలిత

"లలితా" ఆశ్చర్యంతో ఇంక మాట్లాడలేకపోయాడు

"నన్ను క్షమించండి! నాకా అర్హత లేకపోవచ్చు నా మనసులో ఆశ బయట పడేసుకున్నాను"

"పిచ్చిగా మాట్లాడకు" తనకున్న ఒక్క చేతినీ జాపి లలితను దగ్గరగా తీసుకున్నాడు మాధవరావు

"ఈ సృష్టిలో ఎప్పుడు ఏ విధంగా సమన్వయం సిద్ధిస్తుందో మనం నిర్ణయించుకోలేం! ఒక దురదృష్టం నన్ను బాధించిందనుకున్నాను అదే దురదృష్టం, మరొక అదృష్టం నన్ను వరించడానికి కారణమయింది"

"ఇది నిజంగా అదృష్టమనే అనుకుంటున్నారా?"

మాధవరావు సమాధానం చెప్పలేదు లలితను మరింత దగ్గరకు తీసుకున్నాడు



**Edited and Published by V Leelavathy Raghavaiah, 40/1 Moosasait Street, Madras-600 017 and Printed by D Hanumantha Rao, at Kranti Press, 12, Francis Joseph Street, Madras-600 001**

తగిన అధికారముచే నిర్వహింపబడిన వారిచే ఇంటర్మీడియెట్ పరీక్ష లేక రాష్ట్రప్రభుత్వంచే దానికి సమానంగా గుర్తింపబడే ఆ విధముగా ఇతర అర్హత పొందియుండవలెను

సి 1975 జూలై 1 వ తేదీకి అతడు 20 సంవత్సరాలు పూర్తి చేసి 28 సంవత్సరాలకు మించకుండా వయస్సు కలిగి ఉండాలి

గమనిక - వెనుక బడిన కులములు షెడ్యూలు కులములు మరియు షెడ్యూల్డు తెగలు లేక అటవీ ప్రాంతములలోని ఆదివాసులకు చెందిన అభ్యర్థులకు సమానముగా పైన తెలిపిన గరిష్ట వయోపరిమితి అయిదు సంవత్సరములు సడలింపబడును మరియు మాజీ దేశరక్షణ సిబ్బందికి మరి దేశరక్షణ సర్వీసుకు చేర్చి మరొక మూడు సంవత్సరములు పొడిగింపబడును

డి అభ్యర్థి 166 5 సెం మీ (5- 5½ ") లకు తక్కువ గాకుండా ఎత్తు, మరియు కనీసం 86 30 సెంటీమీటర్లు (34 ) గాలి పీల్చినప్పుడు కనీసం 5.00 సెంటీమీటర్లు (2 ) ఎక్కువకాగల ఛాతి కలిగి యుండవలెను

ఇ బి ఎ స్టాండర్డులో ఒక్కొక్క పేపరు 3 గంటల కాలము నిర్వహించే రెండు పేపర్ల వ్రాత పరీక్షలో అతడు ప్యాసు కావలెను

ఎఫ్ అభ్యర్థి మంచి ఆరోగ్యము శరీర దారుఢ్యము, మరియు ఏ విధమైన అంగవైకల్యం లేకుండా చక్కని అలవాట్లు లేక ప్రభుత్వ సర్వీసునకు అనర్హులు కాకుండా ఉండవలెను

3 దరఖాస్తు ఫారం మరియు ఇతర వివరములు అభ్యర్థన పత్రంతో తగిన పోస్టేజీతో స్వంత చిరునామాకల కవరు ద్వారా జిల్లా పోలీసు సూపరింటెండెంటునుండి లేక అభ్యర్థులు జంట నగరాలైన హైదరాబాదు సికింద్రాబాదుల వారైనచో డిప్యూటీ కమీషనర్ ఆఫ్ పోలీసు, శాంతి భద్రతలు (1) నుంచి పొందవచ్చును ఆ విధమైన కవరు జత పరచని అభ్యర్థనలు గమనింప బడవు

(సం) ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్.

# తొలిమాట

ఈ సంచిక సినిమా పేజీలలో కొత్త ఆకర్షణ కనిపిస్తుంది ప్రతిసారి మాదిరి సినిమా న్యూస్ యివ్వడం లేదు వెరైటీకి సినిమా సెక్షన్ను మరింత ఆకర్షణీయంగా తీసుకురావటానికి ప్రయత్నించాము అందువల్ల సినీ న్యూస్ యీ సంచికలో యివ్వలేకపోయాం



అంతర్జాతీయ మహిళా సంవత్సర సందర్భంగా ఆగస్టులో జ్యోతి మహిళల స్పెషల్ వస్తోంది



మద్రాసులో నీటి ఎద్దడి, విద్యుచ్ఛక్తి కొరత ప్రెస్ యిబ్బందులూ జ్యోతికూడా ఎదుర్కోక తప్పటంలేదు అందుకే యీకొద్ది ఆలస్యం

వెంకటసుబ్బారావు




'చీకటి పొద్దున వెలుగు రేఖ', మే నెలతో ముగిసి 'జ్యోతి' కి వెలుగు నిచ్చిం దనే చెప్పాలి. కామేశ్వరిగారి జవాబు చదవ తగిందే. చక్కని భావప్రకటనతో వెలువడిన ఎవర్ని చేసుకోను (సీరియల్) కడుపుబ్బ నవ్వింపజేసింది. అబ్బూరి గార్కి, మీకు మా అభినందనలు 'రంగదాసు ప్రేమ కథ' చిన్నదైనా బాగుంది. 'అజ్ఞాత బంధాలు' ఇతివృత్తాన్ని ఇంకా చక్కగా చిత్రింవజేసుండవచ్చు రచయిత్రి గారు. నవల పరవాలేదు.

—వై. జగదీష్, వై. సుజాత
మదరాసు-17.

వెంటనే మీకు వుత్తరం రాయింపజేసిన 'ఎవరిని చేసుకోను' (సీరియల్) హాస్యరసభరితంతో మమ్మల్ని మైమరిపింపజేసింది. ఇంజనీర్ భార్య అనుభవాలు పోలీస్ భార్య అనుభవాల్ని మించింది. కామేశ్వరిగారి జవాబు నవలను చక్కగా విశదపరచింది. కళ్యాణీ, సుజాత పాత్రలు చెరో మకుటంగా వున్నాయి నవలకు. వివాహం లాటరీ వంటిదే అన్న ఆమె వాక్యం నిజం అనిపిస్తోంది ఇప్పుడు సంఘంలో జరుగుతున్న వివాహాల్ని తలచుకుంటూంటే. మిస్టర్ సంపత్ ఎం. ఏ. సీరియల్ కై ఎంతగానో నిరీక్షిస్తున్నాం.

—కొత్తపల్లి పద్మ, యామిజాల గణపతి
మదరాసు.

మేనెల జ్యోతిలో పి ఆనందారామం పూర్తినవల అజ్ఞాత బంధాలు ఓ మాదిరిగా వుంది. కథ మామూలే. 'చెదపురుగు చరిత్ర' కథ బాగుంది కథ చదవకముందు టైటిల్ చూచి చెదపురుగు అంటే మని ళ్ళలో చెదపడుతూ వుంటుంది కదా ఆ పురుగు చరిత్రేమో ననుకున్నా. చెద పురుగులాంటి ఒక వ్యక్తి కథని చక్కగా చిత్రీకరించారు రచయిత. అబ్బూరి ఛాయా దేవిగారి 'ఎవర్ని చేసుకోను' చాలాబాగుంది. నేటి నవనాగరికత యువతులలో చాలా మందియొక్క మనస్తత్వాలు ఈ కథలో చక్కగా వ్రాశారు. ఏ ఉద్యోగస్తుడ్ని చేసుకొన్నా ఏదో లోపం. కష్టం వుంటూనే వుంటాయి. పూర్తి సుఖం ఎవర్నిచేసుకున్నా వుండదు అయితే పెండ్లిచేసుకొన్న యువతీ యువకు లిరువురు సహృదయంతో ఒకరి నొకరర్థంచేసుకొని, ఒకరి అభిప్రాయములను అలవాట్లను యింకొకరర్థం చేసుకొని, బ్రతకాలి. తనను కట్టుకొన్న అమ్మాయికి సరదాలు, కోరికలుంటాయన్న విషయం మగవాడు తెలిసి సహకరించిన జీవితాలు పూలబాటే కాదూ.

—వై. లక్ష్మి
విజయవాడ.

నవనవంయువతీయువకుల మనోల్లాసానికి మన్మథ బాణం
వయోవృద్ధులకుకూడా వలపు పుట్టించే వసంతకుసుమాకరం
ప్రౌఢపరిపాకంలోని స్త్రీపురుషులకు పూర్ణ చంద్రోదయం



"జూ లీ" (విజయా ప్రొడక్షన్స్)తో
రాజేశ్ రోషన్ వినిపించిన సంగీతం
పాలిడార్ ద్వారా మీ విశ్రాంతివేళలు
శృంగార రసమయం కావించుకోండి
ఒక ఎల్ పి రెండు మాక్సి యి పి లు

పాలిడార్ డీలర్లందరి వద్ద



# నా మాలకాకి

"నన్ను ముట్టుకోకు నా మాలకాకి" అనే సామెత మనం సాధారణంగా వింటూంటాము అంటే ముట్టనట్లుండి తామేమో తమ పనేమో తప్ప ఇంక ఇతరుల ప్రమేయం ఏమీ పట్టనట్లుండేవారి విషయంలో ఈ సామెత వాడటం జరుగుతూంటుంది.

అసలీమాట కర్థం ఏమిటి అని అప్పుడప్పుడూ ఆలోచన వస్తూంటుంది నాకు. కాకుల్లో బాగా నల్లగా ఉండి కొంచెం పెద్ద సైజులో ఉండే కాకుల్ని మాలకాకులు అనడం వాడుకలో ఉంది. అందువల్ల ఈ సామెత జాతి పరంగా వచ్చింది కాబోలు అని సమాధాన పడుతూంటాను.

కాని ఆ మధ్య ఒకరితో ఈ విషయంమీద చర్చ రాగా ఈ సామెతపై ఒక చిన్న కథ తెలిసింది.

ఒక తల్లి తన బిడ్డకు వెంకటేశ్వరుడని పేరు పెట్టుకుంది. వెంకటేశ్వరస్వామి కిలా ఆ బిడ్డ ముఖాన నామాలు దిద్దుతూండేది ఆమె. ఆ పిల్లవాడు బయటకు ఆటలకు వెళ్ళేప్పుడు ఆ నామాలు చెరుపుకోవద్దని చెప్పి పంపించేది. అలాగే ఆ పిల్లవాడు ఆట లకు వెళ్ళినపుడు తన నామాలు చెరగకుండా జాగ్రత్తపడుతూండేవాడు. కాని ఒక తురక పిల్లవాడు ఈ వెంకటేశ్వరుని ఆట పట్టించి నామాలు తన నాలుకతో నాకి తుడి చేస్తూండేవాడు. ఇలా ప్రతిరోజూ జరుగుతూండేది. తన నామాలు తుడవకుండా ఉండ టానికి తప్పుకు తిరగడంతో ఆ తురకపిల్లవాడు వెంకటేశ్వరుని, ఏకాకి, "నా మాల కాకి" అని ఏడ్పిస్తూండేవాడు. నామాలు పెట్టుకుని ఉండటంవల్ల "నా మాల, కాకి" అని అల్లరి పెట్టేవాడు. తన బిడ్డ నామాలు అలా ప్రతిరోజు తుడిచి వేయడంతో విసు గెత్తిన ఆ వైష్ణవమాత ఒకరోజు నామాలు దిద్దేప్పుడు నామాలతోపాటు నాభికూడా కలిపి నామాలు పెట్టిందట.

ఆటలకు వెళ్ళిన వెంకటేశ్వరుని తురకపిల్లవాడు యధాప్రకారం నన్ను ముట్టు కోకు నా మాలకాకి ఏకాకి," అంటూ వచ్చి నామాలు నాలుకతో నాకేడు. ఇంకే ముంది పాపం వెంటనే చనిపోయాడు ఆ తురక పిల్లవాడు. అప్పట్నించీ ఈ సామెత ఏర్పడిందన్నమాట. "నన్ను ముట్టుకోకు నా మాలకాకి" అని.

—సత్యనారాయణ.



# సరాగమాల పోటీ 29

## రూ. 3150-00 బహుమతులు !!

### నిబంధనలు తు. చ. తప్పక వ్రాయాలి

| | |
|---|---|
| విజయా ప్రొడక్షన్స్ | జూలీ |
| సుజాతా ఇంటర్నేషనల్ | దుల్హన్ |
| పి. ఎస్. ఆర్. పిక్చర్స్ | మాయా మచ్ఛీంద్ర |
| అనిల్ ప్రొడక్షన్స్ | సంసారం |
| వనజా మూవీస్ | వనజ-గిరిజ |

ఈ అయిదు చిత్రాల రికార్డులు పాలిడార్ వారివే కాబట్టి నిర్మాతలతో బాటు పాలిడార్‌వారు సహకరించినందున పెద్ద యెత్తున ఒక్కో చిత్రానికి ఒక నగదు బహుమతి రూ 102-00లు, పదునొకండు తదుపరి బహుమతులు.

అందరూ అతి స్వల్ప వ్యయ ప్రయాసలతో పాల్గొనదగిన అతి సులభమయిన నిబంధనలు.

1. పోస్టు కార్డుపై మీకు ఆ సినిమాలో నచ్చిన పాట ఒకటి, నచ్చని పాట ఒకటి వ్రాసి, వాటి ప్రక్కనే దానికి కారణం (రచన, వరస, వాద్యగోష్ఠి, పాడటం, సన్నివేశం, చిత్రీకరణ, నటన, నృత్య దర్శకత్వం. సెట్ లేక ఔట్‌డోర్ — ఇవే. వీటిలో ఒకటే వ్రాయాలి)
2. దాని క్రిందుగా ఆ సినిమా గురించి ఒకే ఒకవాక్యం స్లోగన్ లాంటిది వ్రాయాలి.
3. అడ్రసు వ్రాసే చోట దిగువ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయటమేగాక దానిపైన ఫలానా సినిమా పోటీ అని వ్రాయాలి. దానికి యెడమ ప్రక్క ఖాళీ జాగాలో పిన్‌కోడ్ నెంబరుతో సహా మీ పూర్తి అడ్రసు, ఇంతకు ముందు గెలుపొందిన పోటీల వివరాలు వ్రాయాలి.
4. ఒక కార్డులో ఒక సినిమా గురించే వ్రాయాలి.

5. నగదు బహుమతులకు అర్హులు కావటానికి ఏదైన పాలిడార్ రికార్డు కొన్నట్లు పాలిడార్ డీలరు బిల్లు జతపరచి పంపాలి. వీరు మాత్రం కవర్లలో వాటి పత్రాలు పంప వలెను ముగింపు తేదీ జూన్ పదిహేను. ఆ నెల 25వ తేదీలోగా బహుమతులు (రూ. 48-00 విలువ చేయు రికార్డులు, పుస్తకాలు) రిజిస్టర్ పోస్టుద్వారా, నగదు మనియార్డరు ద్వారా విజేతల కందగలవు. అగస్టు 1975 సంచికలో విజేతల జాబితా చూడనగును.

V. A. K. Ranga Rao

'Ram Mahal', Pycrofts Gardens, Madras-500 006.

## జ్యోతి సప్లిమెంట్

జూన్ **1975** సంచికలో

నిర్మాణంలో సున్న 'మా వూరి గంగ'

చలన చిత్రానికి కథ సమకూర్చిన

శ్రీమతి యార్లగడ్డ సరోజినీదేవి రచన

## "ప్రతిఫలం"

(నవల)

చదవండి

## జూలై నెల జ్యోతిలో

ప్రఖ్యాత రచయిత్రి

కావిలిపాటి విజయలక్ష్మి

గారి

## చాకు లాంటి లేఖ

(నవలానుబంధం)




అమలాపురంనుంచి భీవుడు ఉత్తరం రాశాడు. రెండే రెండు ముక్కలున్నాయి కాగితంలో—

సూరీ!

మీ దొడ్లో వేపచెట్టు కొట్టేస్తున్నారు. అది కాస్తా కొట్టేస్తే ఏటా ఉగాదికి వేపపూవు గురించి మీ ఇంటికొచ్చే ఆడపిల్లలు ఎవరూ మీ ఇంటికి రారు. నీ ఊహా సుందరి అన్వేషణకు ఆపైన తీవ్రంగా ఆటంకం కలుగుతుంది. వచ్చి రక్షించుకో!

స్నేహితుడు,

భీవుడు.

ఉత్తరం చూసుకున్న సూర్యం గొల్లుమన్నాడు. (గుండెలు బాదుకుని!)సూర్యం

గుండెలు బాదుకుంటున్న శబ్దం విన్న అతని జతగాడు బాబురావు అంతవరకూ పేపర్లో దాచుకున్న మొహాన్ని పైకెత్తి-

"హం! నువ్వీ ప్రేమలేఖలు రాయటం మానవ్ అవి తిరిగొస్తే ఏడవటం అంతకన్నా మానవ్!" అన్నాడు చికాగ్గా చూస్తూ.

సూర్యం గుండెలు బాదుకోవటం మాని కోపంగా చూశాడు. దాంతో కాస్త ఝంకాడు బాబురావు-"అవును మరి కనపడిన ప్రతీ ఆడపిల్లనూ ప్రేమించాననుకోవటం తప్పుకదూ?" అన్నాడు నెమ్మదిగా.

గుండెల బాదుకోవటంతోబాటు ఏడుపు కూడా మాని మరింత కోపంగా చూశాడు సూర్యం.

బాబురావు మౌనం వహించాడు భయపడి కొన్ని సెకన్ల సేపు ఆ ఇద్దరి మధ్య మౌనం విచ్చలవిడిగా రాజ్యం చేసింది కాసేపున్నాక బాబురావే-"ఇంతకీ ఏమిటా ఉత్తరం? పార్వతికి రాసిందేనా?—" అన్నాడు ఆప్యాయంగా చూస్తూ

కాదన్నట్లు తలూపాడు సూర్యం.

"మరి? మెడికో లలితా? ... లేకపోతే ఫస్ట్ బి ఏ పద్మా? "

సూర్యం జవాబు చెప్పలేదు.

"కొంపతీసి శ్యామల కాదు కదా?"

సూర్యం రక్కున మొహం పైకెత్తి-"వాళ్ళందరూ ఇదివరకే అయిపోయారు. అయినా ఇది వేరే విషయం మా భీవుడు ఉత్తరం రాశాడు." అంటూ ఉత్తరం బాబురావుమీదకు గిరాటేశాడు.

తెల్లబోయి చూశాడు బాబురావు సూర్యంవైపు ఉత్తరం అందుకుంటూ.

ఉత్తరం చదవటం ముగించి ఆశ్చర్యంగా మొహంపెట్టి-

"హారినీ! లోకల్‌గానే అనుకున్నాను. అదర్ స్టేషన్లలో కూడా సాగిస్తున్నావన్నమాట నీ కార్యక్రమం? అఘాంతకుడు వస్మీ!" అన్నాడు.

సిగ్గుపడుతూ నవ్వాడు సూర్యం ఆ ప్రశంసకు.

"నాకిప్పుడు తెల్సింది అసలు కారణం!" అన్నాడు బాబురావు గోడకు జేర్లబడి కూర్చుంటూ.

ఏమిటన్నట్లు చూశాడు సూర్యం.

"అదే గత రెండేళ్లుగా పరీక్షల్లో నువ్వెందుకు డింకీలు కొడ్తున్నావో!" వెటకారంగా అన్నాడు బాబురావు.

నడ్డిమీద ఛెళ్లున చరిచినట్లయ్యింది సూర్యానికి. గుర్రుగా చూశాడు. కొడ్తాడేమోనని అనుమానం వచ్చింది బాబురావుకు. అందుకని మాట మారుస్తూ—"అదిసర్లేకాని అబ్బీ! ఇంతకీ వేపచెట్టు గొడవేమిట్రా?" అన్నాడు.

"నేను చెప్పను!" బింకం చూపించాడు సూర్యం.

"అయినా నీ కెందుకూ నా గొడవ? ఆనక వెక్కిరించటానికా?" అని కూడా అన్నాడు

బాబురావుకి నవ్వొచ్చింది సూర్యాన్ని చూస్తుంటే.

అలిగిన చంటిపిల్లాడిలా ఉన్నాడా సమయంలో.

అసలు అందుకనే బాబురావుకి సూర్యం అంటే పుట్టెడభిమానం. అతగాడి మనస్తత్వం వరి పసిపిల్లాడి తీరుదని బాబు

రావుకి బాగా తెల్సు.

అందుకనే ఓ నిముషంసేపు ఆగి—

"అయితే బుజ్జీ అసలు విషయం తెలియకుండా నీకు నేనెలా సలహాలివ్వ గలన్రా!" అన్నాడు బుజ్జగింపుగా.

అవునా అన్నట్లు చూశాడు సూర్యం స్నేహితుడివైపు

"అవున్రా నానిగా! ఈ ఉగాదికి నువ్వు ప్రేమించిన అమ్మాయిని నీకిచ్చి కట్టబెట్టాలని నా సంకల్పం ఊ(! ఒట్టు"

సూర్యం చేతిలో చేయివేసి పైగా అరచేతిలోగిల్లి మరీ చెప్పాడు బాబురావు.

సూర్యానికి స్నేహితుడి మాటలపై కాస్త నమ్మకం తోచింది అప్పటికి.

"చెప్పరా అబ్బి!" అన్నాడు బాబు రావు.

"మా ఇంట్లో ఓ వేపచెట్టు ఉంది " అంటూ మొదలెట్టాడు సూర్యం.

"దాన్నిప్పుడు కొట్టేస్తున్నారు అది కూడా తెల్సు! ఓరేయ్ పిచ్చికన్నా! వేపచెట్టు ప్రతీవాళ్ళింట్లోనూ ఉంటుంది. అదేమంత వింతైన విషయంకాదు. కాక పోతే మీ ఇంట్లో వేపచెట్టు ప్రత్యేకత ఏమిటో కాస్త వివరంగా చెప్పి అఘో రించు! లేకపోతే సలహాలివ్వటం చాలా కష్టం" అన్నాడు జతగాడి మాటలకు మధ్యలో అడ్డొస్తూ.

బాబురావు ఫోజుకి వళ్లు మండింది సూర్యానికి.

"బోడిఫోజూ బోడి సలహాలూనూ" అని తిట్టాడు మనసులోనే. కాని పైకి మాత్రం - "ఆదే అఘోరిస్తున్నాను




కాస్త నువ్వు అడ్డు తగలకుండా ఏడిస్తే అంతా చెప్దామని నా అభిలాష" అన్నాడు సౌమ్యాన్ని మాటల్లోకి ఎరువుతెచ్చు కుంటూ.

అంతే బాబురావు కిమ్మనలేదు.

సూర్యం చెప్పటం సాగించాడు.

"వేపచెట్టు అందరిళ్ళల్లోనూ ఉంటుం దనేగా నువ్వనేది కాని మావూళ్ళో మాత్రం మావీధికి నాలుగైదు వీధుల అటూ ఇటూ ఆపేరుగల చెట్టు ఏదీలేదని నాకు తెల్సు-అదీ ఖచ్చితంగా. అందుకనే మా ఇంటి వేపచెట్టు కంత ప్రత్యేకత.

ఉగాది వచ్చిందంటే చాలు వూళ్లో ఆడామగా అంతా మా ఇంట్లోనే ఉంటారు. ఎందుకో తెల్సా?...ఉగాది పచ్చడిలోకి వేపపువ్వు వేస్తారుకదా? అది కోసుకో టానికి.

అందుకోసం వచ్చిన మగాళ్ళని నే నంతగా ఎప్పుడూ పట్టించుకుని ఎరగను కాని .. ఆడపిల్లల్ని మాత్రం కాస్త పరిశీలన గానే చూసేవాణ్ణి. ఎందుకంటే నా జీవిత

భాగస్వామినీ - నా ఊహాసుందరీ వాళ్ళల్లో ఉండిఉంటుందేమోనని.

ఒక్క ముక్కలో చెప్పాలంటే నా వైపునుంచి పెళ్ళిచూపులు మా వేపచెట్టు క్రిందే సాగుతాయి ప్రతీ ఉగాదికి. సుమారు నాలుగైదు యేళ్లగా వ్యవహారం సాగుతోంది. ఇప్పుడు ఇప్పుడు ఇలా హఠాత్తుగా ఆ చెట్టుకొట్టేస్తే నా ఊహా సుందరిని వెదకటం ఎలా?

ఎలా? ?'' సూర్యానికి మళ్ళీ ఏడుపు ముంచుకు వచ్చింది. జతగాడు చెప్తోన్నదంతా అప్పటివరకూ నుదురు చిట్లిస్తూ ఓపిగ్గా విన్న బాబురావు లోపలే - 'ఏడవలేకపోయావ్!' అనుకున్నాడు .. ఏడుస్తోన్న సూర్యాన్ని చూస్తూ.

బాబురావ్ ఎప్పటికీ ఓదార్చకపోవటంతో తనంతటతానే ఊరుకున్నాడు— సూర్యం.

ఇంతా సూర్యం ఊరుకున్నాక-"ఊరుకోరా?'' అన్నాడు బాబురావు.

తన తొందరపాటుకి నాలిక్కొరుచుకున్నాడు సూర్యం.

ఆ తర్వాత ఇద్దరికీ ఏం మాట్లాడాలో తోచలేదు కాసేపు. సూర్యం పైకప్పుకేసీ-బాబురావు పేపర్లోకిచూస్తూ కాలంగడిపారు.

చివరకు సూర్యమే అన్నాడు - "మా వేపచెట్టు కొట్టేస్తున్నారట!'' అన్నాడు ఏం మాట్లాడాలో తోచక.

"ఆ విషయం గురించే ఇంతవరకూ మాట్లాడుకున్నాం!'' అన్నాడు బాబురావు విసుగ్గా.

సూర్యం బాబురావు విసుగుని గుర్తించవట్లు—

"వేపచెట్టు కొట్టకుండా ఆపాలి .. అర్జంట్‌గా ఊరెళ్లాలి!'' అన్నాడు అరచేతిలో రేఖలు చూసుకుంటూ.

"నేనుచస్తే కానీ ఇవ్వను. .నా దగ్గరేం డబ్బులు లేవు'' అన్నాడు బాబురావు.

"డబ్బులున్నాయి " నసిగాడు సూర్యం.

"నా బట్టలు పట్టుకెళ్ళటానికి అసలు ఒప్పుకోను నాక్కావాలి!'' నిర్మొహమాటంగా అనేశాడు బాబురావు.

"ప్రేమపనిమీద వెళ్తున్నాను అయిపోగనే ఇట్టే తిరిగొచ్చేస్తాను.'' అన్నాడు సూర్యం ఏదో ఆఫీసుపని అన్నట్టుగా

"నీకంతకన్నా పనేం ఉందికనుకనా వేరే?'' అని "ఒరేయ్ సూరిగా! శ్రద్ధగా చదువుకోక...ప్రేమా గీమా ఏమిటి చెప్పు? అయినా నిన్నూ నన్నూ చూసి చూసి ఏ ఆడపిల్ల ప్రేమిస్తుంది చెప్పు?'' అన్నాడు అమనయంగా.

సూర్యం జవాబు చెప్పలేదు స్నేహితుడి దగ్గర పేంట్లు ఎరువు తీసికెళ్లే ఉపాయం ఆలోచిస్తున్నాడు తీవ్రంగా.

బాబురావే అన్నాడు మళ్లీ - "నాకు తెలియక అడుగుతాను కాని సూరిగా! రోజు కెంతమందిని లౌ చేస్తావురా? అదీ బొత్తిగా వన్‌వే ట్రాఫిక్కూ. నీ పద్ధతేం నాకు నచ్చలేదన్మ!'' మందలింపుగా.

"అందుకనే అందుకనే మరి - మా వేపచెట్టు కొట్టెయ్యకుండా ఈ ఉగాదికేనా ఎవర్నో ఒకర్ని నిశ్చయం చేసుకుందామని

అర్థంతరంగా ఇప్పుడు పేంట్లు పట్టుకెళ్లొద్దంటే ఎలారా? నలపకుండా తీసు







కొచ్చేస్తాగా'' అర్థింపుగా అడిగాడు.

''ఉహు! నూర్రోజుల పండుగ అయితేనేకాని నువ్వు బనీనుకూడా విప్పవ్. అదినాకు బాగా తెల్సు. పోతే—నాలు గేళ్లగా దొరకని ఊహాసుందరి ఈ ఉగాదికి మాత్రం కనపడుతుందని నమ్మకం ఏమిటి? లాభంలేదు! ఆదీకాక సూరి బాబూ! నీ ఊ హా సుం ద రి ఎలా ఉంటుందో కాస్త చెప్పి అఘోరించు. అస లలాంటిపిల్ల ఈ భూమ్మీద ఉంటుందో ఉండదో చెప్తాను'' అన్నాడు బాబురావు,

''నాకు తెలీదు బాబూ!'' అన్నాడు కాసేపు ఆలోచించి ఏం చెప్పాలో-ఏమని చెప్పాలో తోచని సూర్యం.

వింతగా చూశాడు బాబురావు-''అఘొ రించినట్లే ఉంది నీ బోడి ఊహ! ...అసలు ఊహంటూలేని వెఱ్ఱివెధవ్వు నీకు సుందరి ఎక్కడనుంచి వస్తుందిరా సూరీ.'' అన్నాడు హేళనగా.

సూర్యం సిగ్గుపడి పోయాడు జతగాడి మాటలకు.

''ఏమో బాబూ! అదేం నాకు తెలి యదు. నాకు మాత్రం ఓ అమ్మాయిని ప్రేమించాలనుంది. ఏమైనాసరే!'' అన్నాడు కృతనిశ్చయుడై ఉన్నట్లు.

''దాన్ని ప్రేమ అనరు. పిచ్చిఅంటారు. అది మోతాదు మించితే ప్రమాదం జాగ్రత్త!'' అని హెచ్చరించాడు బాబు రావు.

సూర్యం బిక్కమొహం వేశాడు.

బాబురావుకి జాలేసింది అతన్నిచూస్తే.

''పోనీ సూరీ! నాలుగేళ్ళ వేపచెట్టు కింద అన్వేషణలో ఎవరెవర్ని చూశావో వాళ్ళకి నీమీద ఎలాంటి అభిప్రాయం ఉందో చెప్తావా?''

''పంతులుగారి సావిత్రినీ. జగన్నాధం

గారి కామాక్షినీ. ప్రెసిడెంటుగారి వర్ధన్ని చాలామందినే చూశాను. వాళ్ళందరికీ నేను చాలా మంచివాణ్ణని అభిప్రాయం" గర్వంగా బదులు చెప్పాడు సూర్యం

మొహం ఇంత చేసుకుని చూశాడు బాబురావు.

"హారినీ సిగరెట్లు తాగి చీట్లపేకాట ఆడే నువ్వు బుద్ధిమంతుడివి ఎలా అయ్యావురా? నిజంగా ఆశ్చర్యంగానే ఉందస్మీ"

"మా ఊరెడితే అవేం చేయను తెల్సా? పైగా కాఫీకూడా తాగను."

"దుర్మార్గుడా! ఈ విధంగా మోసం చేస్తున్నావన్నమాట మీఊరి ఆడపిల్లల్ని. విజం తెలిస్తే చావతంతార్రోయ్! జాగ్రత్త మరి" అన్నాడు బాబురావు.

తంతే తన్ననీ అన్నట్లు నిర్లక్ష్యంగా నవ్వాడు సూర్యం.

రెండు క్షణాలు మౌనవ్రతం సాగించారిద్దరూ. ఆ తర్వాత బాబురావు- "ఒరేయ్ సూరీ! నీ అన్వేషణకి అంతం ఎప్పుడ్రా? ఇందరికి మనసివ్వటానికి నీకెన్నిగుండెల్రా? అబ్బీ?" అనడిగాడు.

"అదేవద్దన్నది ఇంకా ఎవరికీ మనసివ్వలేదని చెప్పానా! అందరూ నచ్చినట్లే కనబడతారు అందరూ నేనంటే ఇష్టపడుతున్నట్లుగానే కనపడతారు - ఎలా చావటం? ఫస్ట్ బి. ఏ పద్మనే ఎంచుకోనా? ప్రెసిడెంటుగారి వర్ధన్ని వరించనా? సావిత్రినా, శ్యామలనా, కామాక్షినా, కాత్యాయనినా ఎవర్ని? ఎవర్ని?"

మిత్రుడి వ్యధ బాబురావు హృదయాన్ని కదిల్చేసింది ఎలాగైనా అతని ఊహా సుందరి అన్వేషణకి ఒకమార్గం చూపించాలనుకున్నాడు.

ఉత్తరక్షణాన్న మెల్లగా ఊపిరి పీల్చి-వదలి, "సూరీ! నువ్వొరి అమాయకుడివిరా! ఆడపిల్లల సైకాలజీ బొత్తిగా తెలియదస్మీ నీకు" అన్నాడు.

"సైకాలజీయా?" ఆశ్చర్యంగా అన్నాడు సూర్యం. "ఆ! సైకాలజీయే అదేమిటంటే - నిన్ను ప్రేమిస్తోన్నట్లు కనపడే ఆడపిల్లకు నీమీద మనసుండటం అబద్ధం నువ్వంటే మండిపడే మగువకి నీమీద తగని మక్కువ. అదీ సంగతి. తెల్సిందా? - ఈ ఫార్ములాతో నీ ఊహా సుందరి అన్వేషణ సాగించు వెళ్ళు! కాని ఒకమాట! నా పేంట్లు మాత్రం తీసికెళ్ళకు" అన్నాడు బారెడు ఉపన్యాసం దంచి.

"ఏడిసినట్లుంది నీ బోడి సైకాలజీనూ నీబోడి సలహానూ" విసుక్కున్నాడు సూర్యం

"ఏం?" అన్నాడు బాబూరావు అతి మామూలుగా. "ఏమిటా? నీబోడి సైకాలజీ ప్రకారం చూస్తే మా కరణంగారి వెంకటలక్ష్మికి నేనంటే తగని మక్కువై య్యుండాలి అది కల్లోమాట! ఎందుకంటావేమో? ఈ దేశం మొత్తంమీద నన్ను విపరీతంగా ద్వేషించేదీ - దుమ్మెత్తి పోసేది ఒక్క వెంకటలక్ష్మి మాత్రమే"

ఆ మాటలు వింటూ ఎగిరిగంతేసేడు బాబురావు. "సో! మైఫోర్‌కేస్తు ఈజ్ క్వయిట్ కరెక్ట్, నా అంచనాయే నిజమైతే ఆ అమ్మాయే నీ ఊహాసుందరి. ఈ భూప్రపంచంలో నిన్ను ప్రేమించే ఒక్కగానొక్క ఆడకూతురు - కావలిస్తే జెట్ చేయి." రెచ్చిపోయాడు బాబురావు

సూర్యానికి వళ్ళుమండింది బాబురావు మాటలకి.

"ఓకే! అదీ చూద్దాం. అయితే ఈ మాటుకి నీ పేంట్లు పట్టికెళ్ళనీ. నువ్వు నెగ్గావో వచ్చేసారినుంచి పేంట్లు అడగను అలాకాకపోతే "

బాబురావుకి మతి పోయిందీమాటు.

సంభాషణ ఎటుమళ్ళించి ఎటు తీసుకొచ్చినా పేంట్లు మీదకు లాక్కొచ్చే జతగాడి నేర్పరితనానికి విస్తుపోయాడు చివరకు ఒక నిర్ణయానికి వచ్చాడు ఎలాగైనా తను నెగ్గటం ఖాయం. ఈ ఒక్కమాటుకే పేంట్లు వాడి మొఖాన తగలేస్తే ఆపైన ఎలాగూ ఇవ్వక్కర్లేదూ

ఆ ధైర్యంతో - "సరే' అన్నాడు బాబురావు వెంరనే సూర్యం దండెంమీద బాబురావు పేంట్లుతీసి సూటుకేసులో కుక్కేశాడు. బాబురావు మొహం అటు తిప్పుకున్నాడు.

మంచంకింద బూట్లుతీసి తొడుక్కుంటూ.

"మరి వెళ్ళిరానా?" అన్నాడు

"మంచిది పేంట్లుమాత్రం మాయగానే విప్పేస్తూ ఉండు" అన్నాడు బాబురావు.

సూర్యం వినిపించుకోలేదామాట.

మరుక్షణంలోనే తన ఊరువెళ్ళే రైల్లో ఎక్కి కూర్చున్నాడు సూర్యం

* * *

ఊళ్లో దిగుతూండగానే భీవుణ్ణి కౌగిక గట్టికి తీ కొని పోయాడు సూర్యం

"ఊ! ఇప్పుడు వివరంగా అన్నీ చెప్పు. అసలు వేపచెట్టు ఎందుకు కొట్టేశారు? ఏమిటీ-" అన్నాడు అక్కడ కూర్చోబెట్టి.

భీవుడు శాంతంగా చుట్టపొగ గుండెల కంట పీల్చి వదిలాడు.

సూర్యానికి కడుపులో దేవినట్లయ్యింది. అయినా భరించాడు.

భీవుడు ఏం చెప్తాడోనని చెవులు రిక్కించి వింటున్నాడు సూర్యం

"వెంకటలక్ష్మి కొట్టేయ్యించింది!" అన్నాడు.

ఉలిక్కిపడ్డాడు సూర్యం.

"ఏ వెంకటలక్ష్మి?"

భీవుడు చుట్టపొగ తన్మయత్వంలోంచి ఇవతలకు రాకుండానే.

"కరణంగారి వెంకటలక్ష్మి!" అన్నాడు

సూర్యానికి ఉక్రోషం ముంచుకొచ్చింది వెంకటలక్ష్మి పేరు వింటూండగానే - "ఎందుకట? అసలెందుకట?" అన్నాడు ఓమూల ఏడుపు ముంచుకొస్తూంటే

భీవుడు జాలిగా చూశాడు స్నేహితుడి వైపు

"ఆ వేపచెట్టుమీద దయ్యం ఉందట అందుకూ' అన్నాడు మళ్ళీ చుట్ట నోట్లో పెట్టేసుకుంటూ

సూర్యం విస్తుపోయాడు ఆ మాటలకు,

"దయ్యమా? ఎవరు చెప్పారూ?"

'వెంకటలక్ష్మి! దాన్ని రెండుమూడు సార్లు బరికించట చెట్టు కిందకెడితే- ఆపైన మొన్న నొకమాటు నెట్టికేక వేసి ఆ వేప చెట్టుకింద పడిపో ందట కూడాను అంతే! వేపచెట్టుమీద దయ్యం చేరిందనీ వూళ్లో

ఆడపిల్ల అందరిమీద వాలుతోందని అందరూ గోలపెడితే కొట్టేయింఛారు మీవాళ్లు—అదీ కథ!'

సూర్యానికిదేం అర్థం కాలేదు ఎక్కణ్ణుంచి వచ్చిందీ పాడుదెయ్యం? ఎప్పుడు వచ్చింది? ఎంతాలోచించినా సమాధానం దొరకలేదు

భీపుడు చట్టయిపోయింది

ఆపైన ఒక్కక్షణంకూడా కూర్చోడని సూర్యానికి తెల్సు

అందుకనే లేచాడు ఇంటికెళ్ళటానికి

*  *  *

ఆ సాయంకాలం సూర్యానికి శివాలయం దగ్గర కామాక్షి కనపడింది

ఎప్పటిలాగే కామాక్షి తను కనపడగానే చిరునవ్వు నవ్వకపోవటం ఆశ్చర్యమనిపించింది సూర్యానికి పైగా మూతి మూఖ వంకర్లు తిప్పు వెళ్ళిపోవటం మరీ వింతగా కనపడింది

ఏమిటీ మార్పు? ఎందుకీ మార్పు అనుకున్నాడు

ఆ తర్వాత కనపడిన వర్ధనీ అంతే-మొహం అటుతిప్పేసుకుంది సూర్యం కనపడగానే

డీలా అయిపోయాడు సూర్యం దాంతో

'వీళ్ళంతా స్ట్రైక్ చేసినట్లూ-కూడబలుక్కున్నట్లు ఏమిటబ్బా ఇది? కొంపతీసి పట్నంలో తను సిగరెట్లు కాలుస్తాననీ-చీట్లపేక ఆడతాననీ పైగా కాఫీకూడా తాగుతాననీ తెల్సిపోయి ఇలా చేస్తున్నారా! ఆ! అవన్నీ వీళ్ళకెలా తెలుస్తాయి?-అయితే వీళ్ళ మనసు హఠాత్తుగా ఇలా విరిగిపోటానికి కారణం?'' సూర్యం బుర్ర వేడెక్కటమే జరిగిందంతే

ఇలా కాదనుకుని ఆ మర్నాడుదయమే చెరువు దగ్గర కెళ్ళాడు సావిత్రి చంకన బిందెపట్టుకుని వచ్చింది నీళ్ళకు సూర్యాన్ని చూసి రక్కున అంతదూరంలోనే ఆగిపోయింది అనక ఈసడింపుగా చూసింది

లాభం లేదనుకున్నాడు సూర్యం ధైర్యం తెచ్చుకుని "ఏమిటి సావిత్రీ? ఎందుకలా ఆగిపోయావ్? మీరంతా నామీద కట్టుకట్టినట్లు ఎందుకు ఇలా మాట్లాడటం లేదూ? అన్నాడు

'రౌడీలతోనూ రాలుగాయలతోనూ మర్యాదున్న ఏ ఆడపిల్లాకూడా మాట్లాడదు-తెల్సా? పట్నంలో నీ పోకిరి వేషాలు మాకెవరికీ తెలియకుండా అల్లాగే ఉంటాయనుకున్నావా? ఎప్పటికీ! అంది స్కాట్‌లాండ్ యార్డ్ పోలీసులా

'అది! అది? అవి? మీ కెవరు చెప్పారు?

నీరుగారిపోతూ అడిగాడు

ఇంకెవరూ? కరణంగారి వెంకటలక్ష్మి ఇవన్నీ చెప్పి మా కళ్లు తెరిపించింది—హుం! అంటూ బుడుంగున చెరువులో బిందె ముంచి చంకన పెట్టుకొని విస విస నడుస్తూ వెళ్ళిపోయింది సావిత్రి

సూర్యం నివ్వెరపోతూ చూస్తూ ఉండిపోయాడు

*  *  *

"వేపచెట్టు కొట్టేయ్యించింది?"

"ఊళ్లో ఆడపిల్లల్ని తనతో మాట్లాడకుండా చేసింది?

"ఎందుకు? ఎందుకు? వెంకటలక్ష్మి ఇవన్నీ చేస్తోంది? తనమీద ఎందుకిలా

కష్ట సాధిస్తోంది? తనేం అపకారంచేశాడు వెంకటలక్ష్మికి?

వాళ్ళింట్లో వీధి గదిలో మడత మంచం పట్టి బెంగపెట్టుకో సాగాడు సూర్యం

"అయినా పట్నంలో తన వ్యవహారాలు ఈవిడగారికి ఎలా తెలిశాయి?-" అంటూ సందేహ పడ్డాడు కూడా

సూర్యం ఈ ఆలోచన్లో ఉండగా-

"అత్తయ్యగారూ! మా అమ్మ మీకీ పంచదార ఇచ్చిరమ్మంది ' అంటూ వెంకటలక్ష్మి కంఠం వినపడింది

"రామ్మా వెంకటలక్ష్మీ రా! ఆఁ మీ అమ్మగారి చాదస్తంకాని ఇంతోటి పంచదార తిరిగివ్వాలేమిటే?" అమ్మ కంఠం-ఆపైన పంచదార డబ్బాలో పోస్తున్న చప్పుడు

కాసేపు నిశ్శబ్దం

'ఇలా ఇవ్వండి అత్తయ్యగారూ! అరటికాయలు నేను తరిగి పెడ్తాను-'' అంటోంది వెంకటలక్ష్మి

'చస్తే ఆ కూర నేను ముట్టుకోను- కోపంగా మనసులోనే అనుకున్నాడు సూర్యం

"మా అమ్మే మా తల్లే! ఆడపిల్లలంటే అలా ఉండాలి-ఏ ఇంటి కోడలవుతవో కాని-' అమ్మ పొగడ్త

"సూర్యం వచ్చాట్టా కదండి అత్తయ్యగారూ?- అరటికాయ తరుగుతూ అడుగుతోంది వెంకటలక్ష్మి

"ఆఁ వచ్చాడమ్మా-నిన్ననే! ఏం నీకు కనపడలేదూ? వీధిలో- ' అడిగింది తల్లి

ఏం చెప్తుందోనని చెవులు రిక్కించాడు

"లేదత్తయ్యగారూ! అయినా మీ సూర్యానికి నేనంటే అస్సలు కిట్టదు పలకరిస్తేనే చాలు మండిపడతాడు. బియ్యం కడిగితేనాండీ అత్తయ్యగారూ?

"వాడి తీరే అంతమ్మ ఎప్పుడెలా ఉంటాడో వాడికే తెలీదు -అయినా నీకెందుకమ్మా వెంకటలక్ష్మి ఈ శ్రమంతా సరే! బావిదగ్గరకు వెళ్ళక్కర్లేదు కాని, వరండాలో బకెట్టూ నీళ్ళూ ఉన్నాయి అక్కడ కడుక్కునిరా! వెంకటలక్ష్మి అంతులేని కాకానీ-వద్దు వద్దు అంటూనే వెంకటలక్ష్మిచేత ఆపనీ-ఈపనీ చేయించుకుంటున్న తల్లి తెలివి తేటల్ని తూకం వేస్తూ తెల్లబోయాడు సూర్యం

"ఈ ఆడవాళ్ళు!' అనుకున్నాడు మనసులోనే

కాక పట్టటం లేక కబుర్లు చేప్పటం పూర్తయ్యిందేమో-"వస్తానండీ అత్తయ్య గారూ! అంటూ లేచింది వెంకటలక్ష్మి

"మంచిదమ్మా! అమ్మగార్ని ఓమాటు రమ్మనమను-బొత్తిగా ఇటు తొంగి చూడ్డమే మానేశారావిడ' అంటోంది సూర్యం తల్లి

'హమ్మయ్యా!' అనుకున్నాడు సూర్యం

వెంకటలక్ష్మి వెళ్ళిపోయినట్లు క్రమంగా దగ్గరయి దూరమైన ఆమె కాలి పట్టాల శబ్దమే చెప్పింది

సూర్యం లేచి వెళ్ళి వంటింటి గడప మీద కూర్చున్నాడు

"ఆకలేస్తోందా? అరటికాయ కూరలో పోపుపెట్టి పెట్టేస్తాను-నీళ్ళోసుకొన్నావా? అడిగింది తల్లి

'ఊఁ! నాకా అరటికాయ కూరవద్దు! విన్ననే పోసేసుకున్నాను అన్నాడు సూర్యం

చివర మాట అర్థం కానట్లు చూసిం దావిడ

'అవును కాని అమ్మా! ఆ కరణంగారి పిల్లకి బొత్తిగా పనీ పాటూ లేదా? ఊరంతా తిరుగుతూంటుంది గజ్జల గుజ్జులా-

ఆ పిల్ల సంగతి నీకెందు కన్నట్లు చూసిందావిడ

రక్కున మాట మార్చేశాడు సూర్యం

"సరే-అన్నం పెట్టు అవతల అర్జంటు పనుంది' అన్నాడు లేస్తూ

ఆవిడేం మాట్లాడలేదు

'హమ్మ వెంకటలక్ష్మి! అమ్మ నీ బాగానే కాకా పట్టావే- అనుకున్నాడు

మళ్ళీ గదిలో చేరాడు

'వేపచెట్టు కొట్టేయ్యించింది!

"ఊరి ఆడపిల్లలందరూ తనతో మాట్లాడకుండా చేసింది!

"అమ్మ మనసుని ఆకట్టేసుకుంది!

సూర్యం వదుసగా మధనపడిపోయాడు వెంకటలక్ష్మి ఎందుకివన్నీ చేస్తోంది? దీని వలన ఆ అమ్మాయికి ఒరిగే దేమిటి? తను నన్ను పబ్లిక్‌గ్గా దుమ్మెత్తి పోస్తూ- తనంటే నేను మండిపడతానవి అమ్మదగ్గర కొత్త పాట పాడుతుందా?

పాడు గుణం

బాబుగాడు అన్నట్లు ఇదేదో వింత రకం సైకాలజీలాగే అనిపించింది సూర్యానికి

దీనికి సమాధానం అతగాడే చెప్పాలని పించింది అందుకే వెంరనేకలం కాగితం తీసుకుని- వివరంగా తన సందేహాలు వ్యక్తం చేశాడు బాబురావుకి

వెంరనే జవాబు వచ్చింది

సూరీ

వెంరనే వెంకటలక్ష్మిని పెళ్ళిచేసుకో- ఆ అమ్మాయే విప్పుతుంది ఆ తర్వాత చిక్కు ముడులన్నీ

—బాబురావు

సమాధానం చదివి క్షణం సేపు ఆలో చన్లో పడ్డాడు సూర్యం 'వెంకట లక్ష్మినా? అనుకున్నాడు కాసేపు పోయాక 'వెంకటలక్ష్మికేం! అను కున్నాడు

వెంకటలక్ష్మి రూపాన్ని స్మృతికి




తెచ్చుకున్నాడు

బాగానే ఉంటుందనుకున్నాడా పైన

అంతే! ఓనాటి ఉదయాన్న తల్లి తులసికోటకి పూజచేసుకుంటున్నప్పుడు ప్రక్కనే వెళ్ళి నుంచుని ప్రసాదం అడిగాడు

తర్వాత మెల్లిగా 'అమ్మా! ఇదే- అంటూ మనసులో మాట వెల్లడించాడు

తల్లి పొంగిపోయిందా మాటలు వింటూ

ఎందుకంటే ఆవిడ మనసులో అంతర్గతంగా ఉన్న కోరికే కనుక ఆది ఆ మధ్యాహ్నం శంకర మఠంలో పురాణ కాలక్షేపానికి వెళ్లి వెంకటలక్ష్మి తల్లితో అంతా చెప్పి- ఏమంటావ్ వదినా?' అంది

కోరి పిల్లనడిగితే కాదనే మూర్ఖురాలు కాదావిడ

*   *   *

"మా వేపచెట్టుమీద దయ్యం నిజంగానే ఉందేదా?-వెంకటలక్ష్మి' అనడిగాడు సూర్యం మొదటి రాత్రి వెంకటలక్ష్మిని

ఆ మాటలు వింటూ పక్కుమని నవ్వింది వెంకటలక్ష్మి

'ఎందుకు వరినే నవ్వుతావ్? అన్నాడు

మళ్ళీ నవ్వింది అందంగా-హాయిగా

"చెప్పు వెంకటలక్ష్మీ! నీ కెప్పుడైనా కనిపించిందా

"ఊఁ చాలాసార్లు కనిపించింది వలపు దయ్యం!' అంది

"వలపు దయ్యమా? ఆశ్చర్య పోయాడు

'అవును-ఊళ్లో ఆడపిల్లలందరూ మీ ఇంటి కొచ్చేది వేపపూతకోసం అనుకున్నారా? అదేంకాదు! మీ కంట్లో పడ్డానికి ఆపైన ఇంట్లో పడ్డానికి అదీకాక బొత్తిగా బుద్ధిమంతులని మీకో పేరు కూడా ఉందాయె

ఏ ఆడపిల్లకైనా ఆ మాత్రం ఆశ ఉంటుంది అందుకే ఆ వలపు దయ్యం వదల్చటానికే మీ వేపచెట్టుమీద దయ్యాన్ని ఎక్కించాను- అంటూ చెప్పటం ముగించింది

"వెంకటలక్ష్మీ!" అన్నాడు సూర్యం ఆశ్చర్యంగా ఆనందంగా 'అవును-మనసైనా మీరు మరో ఆడపిల్ల పాటపాడుతూంటే చూస్తూ ఎలా ఊరుకోగల్ను? అయినా నాదే తప్పు మగాడి మనసు ఎలా ఆకట్టుకోవాలో తెలియక పోవటమే నాకింత అనర్థం తెచ్చి పెట్టింది తనకుగా తాను వస్తే చులకన అవుతుందంటారు ఆడది అందుకనే చీదరించుకోవటం మొదలు పెట్టాను చీదరించుకున్న కొద్దీ దేరువవుతారనుకున్నాను గాని దూరమవుతారనుకోలేదు నా ద్వేషాన్ని-ద్వేషంగానే చూశారు గాని అందులో ప్రేమ ఉందని మీరూ తెలుసుకోలేకపోయారు అందుకే కంగారు పడ్డాను వేపచెట్టు కొట్టించేలా చేస్తే అందుకోసం వచ్చే ఆడపిల్లలు మీ ఇంటి ఛాయలకి రాకుండా ఉంటారని లేని దయ్యాన్ని సృష్టించాను అలాగే జరిగింది అయితే కధ అంతటితో ముగిసిపోలేదు నలుగు రాడపిల్లలు కలిసిన చోట మీ బుద్ధిమంతతనం గురించే వచ్చేది, అవే కబుర్లూ అవే మాటలు అందుకనే మిమ్మల్ని వాళ్ళ దృష్టిలో రౌడీసీ-రాలుగాయిని చేశాను అంతే-వాళ్ళింక మీ పేరెత్తితే ఒట్టు!' పెద్ద పెట్టున ఉపన్యాసం దంచింది వెంకటలక్ష్మి

జెలసీ అసూయ!' సూర్యం అనుకున్నాడు వెంకటలక్ష్మి చెప్పినదంతావిని

అయినా వెంటనే తేరుకుని తనకోసం ఓ ఆడపిల్ల పోటీపడి జెలసీ చూపించటం కూడా క్రెడిట్‌గానే భావించాడు ఆ భావనలో సూర్యానికి వెంకటలక్ష్మి మీద ప్రేమ అధికం అయ్యింది

"వెంకటలక్ష్మీ!' అన్నాడు ఆప్యాయంగా ఆమె చేయి అందుకుని

"మీరు నన్ను క్షమిస్తారా?-" అమాయకంగా అడిగింది

"ఎందుకూ-? అన్నాడు సూర్యం

"మీ వేపచెట్టుని అనవసరంగా కొట్టించేసినందుకు-'

సూర్యం నవ్వాడు

"క్షమించను ప్రేమిస్తాను ఎందుకో తెల్సా? వేపచెట్టు వెనుక ఇంత వలపు గుట్టు ఉన్నందుకు అది కొట్టేయ్యటంతో అంతా బయటపడినందుకు

తర్వాత మనసులో అనుకున్నాడు-

'ఓరేయి బాబూ నీ సైకాలజీ అద్భుతం నువ్వే నెగ్గావ్

అన్నమాట ప్రకారం ఇక పైన నీ పేంట్లు అడగను-ఎందుకో తెల్సా? నువ్వు నెగ్గినందుకు కాదు నా పెళ్ళికి డజను పేంట్లు కుట్టించుకున్నానుగా? అందుకు"



# జీవితం

1 జీవితంలో ఎప్పుడైనా ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకొంటే అంత కంటే మంచిపని యింకేది కన్పించదు —ఆరాధన యద్దనపూడి సులోచనారాణి

2 జీవితం ఎంత వ్రాసినా తరగని పెద్ద ఫైలు ఊహల్ని భావాలుగా మలుస్తుంది మనస్సు ఆ భావాలకో మెరుగుపెడుతుంది మెదడు, నిర్దిష్టమైన రూపంలో వుంచి —వెలుగునీడలు యలమంచి యూస్సీలక్ష్మి.

3 జీవితం దాని సత్యం మానవుడు శతాబ్దాలుగా దానిని వెదుకుతున్నాడు శతాబ్దాలు అతడు చేసిన దారుణ పూజలోని పూలు రాలిపోతున్నవి

—పదవిహీన లత

4 జీవితంలో మార్పులు జరగటం ఎదురుచూచినదానికన్నా ఎక్కువ వ్యవధి తీసుకోవచ్చు కాని మార్పు జరిగాక ఆ కొత్త అధ్యాయంలో లీనం కాగలిగితే గతం లోని నష్టాన్నీ కష్టాన్నీ కూడా చాలా సులభంగా దాటిపోగలిగే శక్తి వస్తోంది మానవుడికి ఈ మార్పే గత జీవితగమనానికి నిర్దేశమైన పథకం అనికూడ నమ్మటం జరుగుతుంది

—భారతి కొమ్మూరి వేణుగోపాలరావు

5 జీవితం ఒక చిక్కుపడిన దారవుండ లాంటిది ఒక తప్పు మరొకతప్పుకు దారితీస్తుంది ఒక అబద్ధం మరొక అబద్ధానికి త్రోవ చూపినట్లు

—సీతాపతి నండూరి విఠల్

6 యవ్వనం ఉండగానే జీవితాన్ని అనుభవించాలి

—ఆహుతి యద్దనపూడి సులోచనారాణి

7 జీవితం చిత్రమైంది మనిషి అద్దుతగలకపోతే జీవితము, సమస్యలని ఆదే పరిష్కారము చేస్తుంది చివరకు మిగిలేది—బుచ్చిబాబు

8 జీవితంలో సాధ్యమైనవన్ని ఉపయోగకరమైన పనులు చేయడమే జీవిత ధ్యేయం —ఇందిరాగాంధి

9 కాలంలో ఋతువులు మారి తిరిగి వస్తుంటాయి। జీవితంలో మాత్రం అంతా ఒకే ఒక ఋతువు। ఏదీ తిరిగిరాదు —జీవితం చెరుకూరి కమలామణి

10 జీవితాన్నుండి ఏమీ కోరనప్పుడు జీవితం ఒక వరంలాగానే కనిపిస్తుంది కాని జీవితాన్నుండి అన్ని అందాలను పొందాలనుకున్నటువంటి అత్యాశాపరులకు జీవితం శాపంగా పరిణమిస్తుంది —సుగంధి పరిమళాసోమేశ్వర్

11 ప్రతి మనిషి జీవితం అతని జీవితకాలంలోని ఒకే ఒక్కక్షణం ఆధార పడి ఉంటుంది ఆ క్షణంలో ఆ మనిషి చేసుకొన్న నిర్ణయాన్నిబట్టి అతని జీవితవిధానం ఆధారపడి ఉంటుంది —తప్పటడుగు పరిమళాసోమేశ్వర్

12 పైకి కనిపించే అభిప్రాయాలన్నీ చాలామంది జీవితంలో ఆచరించేసరికి రకరకాల బలహీనతలకి నమ్మకాలకి బానిసలౌతారు మాటలలోనగాని మనుషులు సంస్కారంలేక జీవితాలు నరకం చేసుకొంటారు —అంధకారం రంగనాయకమ్మ

13 జీవితం ఎవర్ని ఎలా మారుస్తుందో ఎప్పుడెలా తెలుస్తుంది అడుగు ముందుకు సాగాలి ఉన్నచోటే జడుస్తు కూర్చుంటే జీవితం స్తంభిస్తుంది ఎప్పుడు ఏమి జరిగిన ధైర్యంగా నిలబడాలి —అంధకారం రంగనాయకమ్మ

14 జీవితమంటే ఏమిటి? ఒకప్పుడు ఏ ఎడారిలోనో ఉండి అసలతని జీవితానికి, అర్థమే లేదుకదా! ఒకవ్యక్తి తన పరిసర వ్యక్తులతో ఏర్పరుచుకున్న వివిధానుబంధాల విన్యాసమేకదా, జీవితచక్రం —స్వాతిజల్లు సి ఆనందరామం.

15 ప్రతివ్యక్తి జీవితంలోనూ కలసివచ్చే రోజులుంటాయి ఆ ఋతువులో అన్నీ శుభాలే జరుగుతాయి అనుకున్నది తడువుగా ఏ కార్యమైన ఫలిస్తుంది ఆ దెబ్బతో మనిషికి ఆనందోద్రేకం తప్ప మరో అనుభూతి ఉండదు
—కరుణామయి అరుణ - వి ఎస్ రంగస్వామి-

16 జీవితం జీవితమే దానికి మరొక పర్యాయపదంలేదు జీవించుకుంటూ పోవడం కంటే జీవితాన్ని అనుభవించడానికి మరొకమార్గం లేదు —చీకటిగదులు గోపీచంద్

17 అందరూ జీవించి, అందరూ దుఃఖించటంకన్న కొందరు జీవించి ఆ కొందరూ సుఖించటమే జీవితానికి పరమార్థం —జీవనస్రవంతి లత

18 స్వార్థం లేనిదే జీవితం లేదు శ్రుతిమించిన స్వార్థం జీవితంలో మాధుర్యాన్ని తీసుకువస్తుంది —లహరి మేఘశ్యామ్'

19 జీవితం అశాశ్వతం అని మనం మనస్సులో ఓమూల ఎప్పుడూ గుర్తు పెట్టుకొంటే బ్రతుకు మనం ఊహించినంత ఆరాటంగాగానీ సమస్యలమయంగా గానీ కన్పించదు —గుడ్డివాడు ధనికొండ హనుమంతరావు

20 జీవించటానికే పుట్టినప్రాణి బలహీనతలతో జీవితాన్ని దుఃఖపూరితం చేసుకోవడం వివేకం అవదు —చదువుకున్న కమల రంగనాయకమ్మ

21 జీవితం నేర్పిన పాఠాలు ఏ విశ్వవిద్యాలయము నేర్పదు
—భిన్నధృవాలు మాదిరెడ్డి సులోచన

22 జీవితపు ప్రమిదలో ఆశాతైలం అడుగంటకూడదు —వాహిని కవిత

# పుట్టింటి గౌరవం పోటీ 27 విజేతలు

స్లోగన్లు బాగులేనందున నగదు బహుమతి మరిరెండు సాధారణ బహుమతులుగా మార్చడమైనది

1 ఎస్ రంగరాజన్ విజయవాడ 2 పి జనార్ధనరావు, ఒంగోలు 3 కె బాపిరాజు, భీమవరం 4 పి శ్రీనివాసరెడ్డి పగలపూడి 5 బి చిన్నమ్మడు, విశాఖ 6 సి పూర్ణచంద్రరావు, గుడివాడ 7 ఎమ్ రాఘవేంద్రరావు, విజయవాడ 8 డా ఎం సూర్యనారాయణ, ర్యాలి 9 ఎస్ వాడ పొదలాడ 10 పి రాధాకృష్ణమూర్తి, గుంటూరు 11 కె వి మోహనరావు, విశాఖ 12 ఎన్ అమ్మాజి, తుని 13 పి జగ్గారావు, విశాఖ

'రాధా అందించు నీ లేతపెదవి, గోపీ నాలోని అందాలు నీవి, 'గోవిందో గోవింద, రేగాడు రేగాడు', 'రామలింగం సోమలింగం ఇవన్నీ ఉత్సాహాన్ని పడుచు దారులలోకి పయనింపజేసేవి 'నీలాల నింగిలో' (ఈ అయిదు శీల-బాల-యుగళ గీతాలే) అటువంటిదేకాని మరికాస్త చక్కనిది 'బాబూ దోబూచులా తల్లీ పిల్లా పాట రాగం వాత్సల్య రాగం స్వరం సుశీల (వి ఇ 13038, 39, 40 కొలంబియా)

హెచ్ ఎం వి వారు చేసిన ఒక ఘనమైన ఘనకార్యం మంగళంపల్లి బాల మురళీకృష్ణ పాడిన అన్నమాచార్య సంకీర్తనలు ఎల్ పి విడుదల చేయటం ఇందులో ఉన్న పది పాటలు వెలలేని మణులు 'కొమ్మలేని ముత్యాల కొంగు బాలమురళి పాడగా వినటం యీ లోకంలో అలౌకికానందాన్ని అనుభవించడం బాపు వేసిన కవరు చూపురులను తిరుమలపై బంగారు వాకిలి యెదుట నిలబెట్టుతున్నది రికం పై వ్రాసిన స్లీవ్ నోట్స్ యెలా వున్నవో చక్కగా వ్యాఖ్యానించిన మొదటి శ్రోతకు తక్షణ బహుమతి రూ 20-00 లు అయితే సంకీర్తనలు లేక అనాటి వాడుకలో పదములనో యీనాటి వ్యవహారములు కీర్తనలనో వుంటే ఒప్పుగా వుండేది (స్టీరియో ECSD 3238)

మధురమణి అయ్యర్ వేలాది కర్ణాట సంగీత ప్రియులకు ఆరాధ్యదైవం కీర్తిశేషుడైన యీమహావిద్వాంసుడు యేనాడో

# ఈ నెల విడుదలలు

78 ల పై పాడిన పాటలు యీమధ్య కొలంబియావారు ఒక ఎల్ పి పై మార్చారు అంతవరకు బాగానేవుంది కాని అచ్చు తప్పులు వేయడం బుద్ధి మాంద్యానికి, పక్కవాద్యగాండ్ర పేరు వేయకపోవడం అధికార మదానికి ఉదాహరణలు (33ESX6058)

పాత 'నాగిన్ 'చోరి చోరి' చిత్రాల బహుళ ప్రజాదరణ పొందిన పాటలు తిరుగ ఎల్ పి పై విడుదల చేయబడినవి (హెచ్ ఎం వి EALP 403 కొలంబియా 33 ESX 14017) ఈ రెండవదానిలో యింతకు ముందు రికార్డుగా విడుదలకాని ఒక మూడు రాగాల (హిందోళం మోహన కాపి) తిల్లాన, కీర్తిశేషులు దండాయుధ పాణిపిళ్లై సృష్టి వున్నది అయితే రికార్డు పైగాని స్లీవ్‌పైగాని వారిపేరు ఉండక పోవట్టానికి కారణం కళ్లు కప్పుకొనిపోవటమే ఈ తిల్లాన పాడినది ఎం ఎల్ వసంతకుమారి అందులో వీణ వాయించింది ఆనాడు 'చివరకు మిగిలేది ''కలిమిలేములు చిత్రాలలో పాటపాడిన ముక్కామల సునంద తెరపై ఆ సన్నివేశంలో వీణవాయిస్తూ కనిపించింది ఈమె

ఇక పాలిడార్ విడుదలలు

'తూఫాన్'' చిత్రంలో ఎల్ పి యి పి, లు 2392 057 2221 155) పలు రకాల కమ్మని పాటలతో అలరిస్తాయి రచన సంగీతమూ రవీంద్రజైన్ నాకు ప్రత్యేకంగా నచ్చినవి 'ఓబర్‌ఖా 'రేష్మా మేరానామ్ హై, 'ప్యార్‌కర్ ప్యార్‌కర్' పాడినవారు ఆశా, రఫీ మహేంద్రకపూర్ ''ఫిల్మ్ హిట్స్ వాల్యూం 3 'లో పన్నెండు ప్రజాదరణ పొందిన పాటలు పొందుపరుపబడినవి(2392 059)ఆకర్షణీయమైనకవరు

''టేల్స్ ఫ్రమ్ పంచతంత్ర ' లో పిల్లలకు బోధపడేరీతిలో సంభాషణల పాటల కథనాల ద్వారా అంగ్లభాషలో మూడు కధలున్నవి (2392 831) ఇక పాశ్చాత్య సంగీత ప్రియులకు శృంగార భూకంపం కలిగించడానికి ఇన్ ది మూడ్ ఫర్ హిట్స్ (2371 460) కవర్‌పైనున్న అర్ధ నగ్న కాంతలు వారి ఉద్దేశాలు చెప్పకనే చెప్పుచున్నారు గోల్డన్ ట్రంపెట్ హిట్స్ 1, 2 లలో (6499 414, 415) వేడి వేడి సంగీతం అనవచ్చు మీసాలు జాగ్రత్త! చక్కని స్టీరియో యెఫెక్టు

ఇక యి పిలు ''మానిషాద మలయాళ చిత్రంలో నాలుగు పాటలు (2221 147) ఇందులో అనిసెట్టి వ్రాయగా సుశీల పాడిన తెలుగుపాట (ఆంధ్రమాత నీకు) వాణీ జయరాం పాడిన తమిళ గీతము వున్నవి దారితప్పిద మగ కన్నడ చిత్రంలో రెండు పాటలు (2221, 148) లో వున్నవి పాడినవారు నటుడు రాజ్ కుమార్, శ్రీనివాస్ జానకి యేనాడోగాని వినరాని ఎ పి కోమల సంగీతం జి కె. వెంకటేశ్

మూడు ఎస్ పిలలో (6158 600, 601 602) పంజాబీ జానపద సంగీతాలు విడుదల చేశారు పాడినవారు పాతతార పుష్పాహంస్ నిర్మల్‌పింగు నిర్మల్, చంద్రకాంత్ పన్నులాల్‌కథక్ వున్నారు.

—రి బం,రి కం వై,రి శ్రో స.

# "సమాజంలో మనం"

(కాకతీయ కళావాహిని సమర్పణ)-హైద్రాబాద్

మైలాపూర్ ఫైన్ ఆర్ట్స్—9-5-75

సమాజం మాకేం చేస్తోంది? అని ప్రశ్నించే ముందు-సమాజానికి తామేం చేస్తున్నది ఆత్మ విమర్శ చేసుకోవటం చాలా మంచిది అలాంటి భావనలో ఉండి పోయిన ఓ మధ్య తరగతి కుటుంబ ఇతి వృత్తమే కాకతీయ కళావాహిని హైద్రాబాద్ ప్రదర్శించిన సమాజంలో మనం ఈనాడు మనకి తారసపడే చాలా రకాల మధ్య తరగతి కుటుంబాలలాంటి కుటుంబంలో అవిటి వాడై ఏ పనికీ ఉపయోగపడని తండ్రీ ఎప్పుడూ ఊహా సౌధాలలో ఊరేగుతూ గమ్యంలేని ఆలోచనలతో-అర్థం పర్థంలేని ఆశలతో-ఆశయాలతో ఉండే అరుగురు కొడుకులూ చిన్న ఉద్యోగింతో ఇంటి బాధ్యత అంతా నెత్తిమీద వేసుకున్న కూతురు ఇవీ పాత్రలు వీటి మధ్య పరిభ్రమిస్తుంది కథ

ముఖ్యంగా ఈ నాటకం ప్రదర్శించిన తీరు అభినందించ తగ్గది కొత్త ప్రయోగం ఒకటి ఈ నాటకంలో ప్రవేశపెట్టారు రెండో కొడుకు రచయితగా కథ రాస్తూంటాడు-రంగస్థలానికి ఓ మూల కూర్చుని అతనలా రాస్తూన్నంతసేపు పాత్రలు మరో ప్రక్క ఆ సన్నివేశాన్ని చూపిస్తాయి అప్పుడప్పుడు రచయిత వ్రాయటం ఆపి నప్పుడు పాత్రలు నిశ్చలన ప్రతిమల్లా ఎలాగున్నవి అలా ఆగిపోతాయి

ఆఫీసు వాతావరణాన్ని మైమ్ ద్వారా చూపించటం మరొక విశేషం ఈ నాటకాన్ని డైరక్టుచేసిన శ్రీరాజు ఆఫీసు సూపరింటెండెంట్ పరంధామయ్యగానూ, శ్రీసూరి అవిటి వాడైన తండ్రి కుటుంబయ్యగానూ శ్రీ భావరాజు (ఎక్స్ట్రా) కంట్రాక్టరుగానూ చాలా బాగా నటించారు అందరు నటులు నటనలో పరిపూర్ణత కనపరచటం మెచ్చదగింది మొత్తానికి ఈ నాటకం చాలా బాగా రక్తి కట్టిందని చెప్పాలి ఈ సందర్భంలో ఈలాంటి ప్రయోగాత్మక-ప్రయోజనాత్మకమైన నాటకం ప్రదర్శించటానికి ప్రోత్సాహం అవకాశం కల్పించిన కళావాహినిని అభినందించాలి

జనిల్ ప్రొడక్షన్స్ ప్రెస్ మీట్ సందర్భంలో→
ఎన్ టి రామ రావు టి ప్రకాశరావుగార్లు

మా పూరి గంగ లో
లక్ష్మి
↓

ప్రక్క పేజీ క్రింద
బలిపీఠం లో శారద



ప్రక్క పేజీపైన
అల్లూరి సీతారామరాజు
స్వర్ణోత్సవ సందర్భాన
శోభన్‌బాబు కృష్ణ

ప్రక్క పేజీ క్రింద
అనురాగాలు లో శివ

అమ్మాయిల శపథం లో
రామకృష్ణ చంద్రకళ





'చల్లని తల్లి' లో సుమిత్ర- విజయకాంత్



'చీకటి వెలుగులు' లో వాణిశ్రీ

చీకటి తెరలు తెరలుగా విడిపోతుండగా తూర్పు తెల్లబడింది.
అయిదు గంటలను సూచిస్తూ అలారం గడియారం గయ్యాళి భార్యలా గణగణమని అరవసాగింది

మహారాణి 'మాధ్వి ముసుగులోనుంచి చెయ్యి చాపి అలారం పీస్ నెత్తిపై ఒక్కమొట్టికాయ యిచ్చినట్లు టక్కుమని నొక్కింది 'అబ్బ అప్పుడే తెల్లవారిందా' అనుకుంటూ బద్ధకంగా కాళ్ళు చేతులు దుప్పటిలోకి లాక్కుంది

''సోమరీ! ఎప్పటివరకు నీవు పండుకొని యుండెదవు, ఎప్పుడు నిద్ర లేచెదవు ఇంక కొంతసేపు నిద్రించెదనని, కొంత కునికెదనని, కొంచెము సేపు చేతలు ముడుచుకొని పరుండెదనని నీవను కుందువు ' అని సోమరి గురించి సోలమెన్ రాజు చెప్పిన సామెత గుర్తుకురాగా దుప్పటిని కాళ్ళతో తన్ని పైకి లేచింది.

ప్రకృతి ఇంకా నేద తీర్చుకుంటూవుంది, మెల్లగా కాలేజి బయటకు వచ్చి గణగణమని గంట మ్రోగించింది

గరల్స్ హాస్టల్ మేల్కొంది ఏడు భవనాలచుట్టూ ఆరడుగుల కోట గోడలా ప్రహరీ వుంది ఏడు భవనాలకి ఏడు పేర్లు ఒక్కొక్క భవనంలో సుమారు ముప్పైమంది బాలికలు వుంటారు ప్రత్యేకించిన గదులలో ముగ్గురు టీచర్లు అందులో ఒక టీచర్‌ని ఆ కాలేజి అంటీగా ఎన్ను కుంటారు హాస్టల్ కంతా ఒక వార్డెన్

స్కూల్ పీపుల్‌లీడర్ గాక, మరొక అమ్మాయిని ఎన్నికచేసి ఆ అమ్మాయిని మహారాణిగ చేస్తారు. ఓట్లలో ఎన్నుకున్న మహారాణిని మీటింగ్‌లో సింహాసనంలా తయారుచేసిన కుర్చీలో కూర్చోపెట్టి [illegible]గా అలంకరించి, చెమ్కీ అట్టతో తయారుచేసిన కిరీటంపెట్టి పాటలు పాడుతూ స్కూల్‌కు మహారాణిగా చేస్తారు మహారాణితోపాటు యువరాణిని కూడ ఎన్నిక చేస్తారు

మహారాణికున్న బాధ్యతలలో ఒకటి గంటలు కొట్టడం - స్కూల్లో గంటలుకొట్టి పీరియడ్స్ మార్చాలి పరీక్షలప్పుడు కూడ తాను పరీక్ష వ్రాస్తూ. అర్ధగంటకోసారి టంగుమనిపిస్తుండాలి. మహారాణిలేని సందర్భాలలో ఆయాల సహాయంతో యువరాణి ఆ పనులను నిర్వర్తిస్తుంటుంది

గంటకొట్టి హాస్టల్‌ను లేపింది మాధ్వి మరో అయిదు నిముషాలకి రణగొణధ్వని మొదలైంది బాత్ రూమ్స్ దగ్గర గిల్లికజ్జాలు ఆడుతున్నారు పాటలు వినిపిస్తున్నాయి, పంపుల్లోనుంచి నీటిధార బకెట్లలో పడుతున్నది.

బకెట్లు లాగిన చప్పుడు వినిపిస్తూవుంది. మెలకువ వచ్చిన టీచర్స్ విసు
క్కుంటూనే నిద్రలోకి జారిపోతున్నారు

క్రితం రాత్రి పట్టి వుంచుకున్న నీళ్ళలో, కాలకృత్యాలు గబగబ
కానిచ్చి కాలేజినుంచి బయటకు వచ్చింది మాధ్వి ఎవరి పనుల్లో వారున్నారు
తనను ఎవరూ చూడటం లేదని నిర్ధారణచేసుకొని పుస్తకాలను పట్టుకొని
చతురవలె, ఎదుట కాలేజిలోని చివర గదిలోకి వెళ్ళింది మహారాణి మాధ్వి

ప్రియుని పరిష్వంగనము వీడలేని రేచెల్వవలె క్రొంజీకటి మంచు
తెరనుండి వీడీవీడకవుంది. చెంగల్వతో మరు కలయిక ఎప్పటికోనని అంబ
రాంతమున చంద్రవంక తెల్లబోతూ వున్నాడు గదిలోకి వెళ్ళిన మాధ్వి
లైటువేసింది లైటుకాంతికి కళ్ళు మరీ గట్టిగా మూసుకుంటూ, "వచ్చావా
మాధ్వీ" అంది, స్ప్రింగు మంచంపై నున్న లెక్కలటీచర్ అజంత.

"గుడ్ మార్నింగు టీచర్"

"వెరీగుడ్ మార్నింగు మహారాణి" అంటూ దుప్పటిని ముఖంవరకు
లాక్కొని ప్రక్కకు తిరిగి నిద్రపోవటానికి ప్రయత్నించింది అజంత.

అజంతకు వేకువజామున నిద్ర ప్రీతి శీతలముచే తృణాలు ముడుచు
కునే వేళలో పరతెంచిన గాలులు మత్తును కలిగించేవి అలాంటి చక్కని
నిద్రను భంగము కలిగిస్తున్న మాధ్విపై కోపంరాదు లెక్కలంటే బ్రహ్మ
రాక్షసిని చూసినట్లు భయపడే విద్యార్థిని - పరీక్షల్లో ఏవో పాసు మార్కులు
వస్తే చాలని తలచే విద్యార్థిని తనకై తాను చెప్పమని వస్తే చెప్పననే
ఉపాధ్యాయిని వుంటుందా? ఇంకా ఆసక్తి కలిగించేలా సుళువుగా బోధిం
చేది, మూలనున్న చాప క్రిందపరుస్తూ 'నిన్న చెప్పిన లెక్కలు అసలు
అర్థం కాలేదు" స్వగతంగా పైకే అనేసింది మాధ్వి

"అన్నిటికి సూత్రాలు ముందు అర్థం చేసుకొని కంఠతా వచ్చి
వుండాలి ఏదో చెప్పు నిన్న చెప్పిన సూత్రం" ముసుగులోనుంచే అడి
గింది అజంత.

మాధ్వి గబగబా నోట్సులోని పేజీలు త్రిప్పుతుంటే, "అలా చూసి
కాదు మహారాణికి తీరుబడి కాలేదా? గంటలు కొట్టడంతోనే పాస్ అయి
పోతావా మాధ్వీ!" మెల్లమెల్లగ చీవాట్లు వేసింది

పడుకునే సగం నిద్రపోతూనే, మాధ్వికి కావలసిన లెక్కలు తెలియ
పరచింది "భాగిస్తే అంత వచ్చిందా - సరిగ్గా చూడు అంతరాదు" అలా
చెప్పుకుపోయే అజంతవైపు ప్రశంసా పూర్వకంగా చూస్తూ 'తాను కూడా
అలా లెక్కలు చేయగలిగితే' అని తలచేది మాధ్వి

హోంవర్క్ పూర్తిచేసి, బాలభానుని లేత కిరణాలు పృధ్విపైకి

చిగుతుండగా మాధ్వి ఆ గదినుంచి బయటకువచ్చి. మరో టీచర్ కంటబడ కుండ జాగ్రత్తపడుతూ, తన కాటేజీకి వెళ్ళిపోయి, టిఫిన్ తీసుకుంటున్న వారిలో కలిసిపోయింది. ఎనిమిది గంటలకి స్టడీ అవర్ అని జ్ఞాపకం చేసినట్లు గంటకొట్టి, పుస్తకాలు చేతబట్టి స్టడీ హాలుకి వెళ్ళింది

* * *

ఎత్తైన ప్రహరీ గోడ తామరపువ్వు డిజైన్‌లో యినుప తలుపు. ఆ తలుపుల వెనుక తెల్లగా వెల్లవేసిన భవనాలు, సీతాకోక చిలుకల్లా ఉపాధ్యాయినులు రాణి తేనె టీగలా హెడ్ మిస్ట్రెస్, పలువన్నెల పువ్వుల్లా విద్యార్థినీ బృందాలు ఎల్లవేళలా వసంతాన్ని పోనీయక బంధించినట్లు కళకళలాడుతూ, రాణి ప్రమీల స్త్రీ రాజ్యాన్ని గుర్తుకుతెస్తూ వుంటుంది.

ఆ ఏడు భవనాలు ఏడు రాజ్యాలకు సమానము అందులో వారికున్న రాజకీయాలు, కుతంత్రాలు, ఎత్తులు ఏ సామ్రాజ్యానికి తీసిపోవు రాజకీయాలతోపాటు స్నేహాలు, ఆత్మీయతలు వారిలో పెనవేసుకున్నాయి వాటితోపాటు ఈర్ష్య, అసూయ, ద్వేషాలున్నాయి. ప్రతి ముగ్గురిలో ఒకరు అపరాధ పరిశోధకులు వుంటారు విద్యార్థుల పైన ఉపాధ్యాయులు వుంటే, ఉపాధ్యాయినులపైనే ఓ కన్నువేసి వుంచుతారు విద్యార్థినులు

వృద్ధనారి - సారీ, అసిస్టెంట్ హెడ్ మిస్ట్రెస్ టీచర్స్ దుస్తుల మీద, వారి సిగలపైన విమర్శలు విసుర్లు వచ్చగానే విసురుతుంటుంది 'వృద్ధ నారీ పతివ్రత' అంటుంటారు యంగు టీచర్స్. ప్రధాన వుపాధ్యాయిని తన కంటే చిన్నదని ఆమెకు మంట ఎవరు ఏడు ఆమె క్వార్టర్స్‌కు వచ్చారో, ఎన్నిగంటలువుండి వెళ్ళారో, ఎప్పటి కప్పుడు టీచింగునోట్సు తయారుచేసినట్లు, నోటు చేసుకుంటుంది

* * *

స్నేహాలు ప్రేమలు పలురకాలు కో ఎడ్యుకేషన్‌లోని వ్యవహారాలు-ప్రేమలు స్నేహాలులాగ గరల్స్ స్కూల్లోని స్నేహాలు యించుమించు అలాగే వుంటాయి ఇద్దరు ప్రాణస్నేహితులుగావుంటే అట్టి వారిని కనిపెట్టటానికి ఒక రహస్యశాఖ పనిచేస్తూ ఎప్పటి వార్తలను అప్పుడు హెచ్. ఎమ్ గారికి అందచేస్తూవుంటుంది. తమ సీడను నమ్మనివారు కూడా వున్నారు ఇద్దరు ప్రాణస్నేహితులు కారు, ఒట్టి స్నేహితులని తలచినా ఆ ఇద్దరినీ విడదీస్తారు కాటేజస్ మారుస్తారు

ఒక అమ్మాయి ఒక టీచర్‌పై ఇష్టం చూపిస్తుందని ఏ మాత్రం తెలిసినా, తక్కిన టీచర్స్ ఆ అమ్మాయిని సాధిస్తారు హాస్టల్‌లోవుండే టీచర్స్ బాధ అలావుంటే, బయటనుంచి వచ్చే టీచర్స్ గొడవ మరో విధంగా

వుంటుంది క్లాసులో పాఠం అర్థం కాలేదంటే ఇంటికివచ్చి ప్రవేట్లు చెప్పించుకోమంటారు. ప్రవేట్లు చెప్పేదగ్గర వస్తుంటాలు పట్టింపులు

మాధ్వీ గడుసుపిల్ల ఉన్నమాట ముఖం మీదనే అనేసే స్వభావం గలది మాధ్వీ ఏవైన తప్పులు చేస్తుందేమోనని వెయ్యికళ్ళతో కనిపెట్టి వుంటుంది అసిస్టెంట్ హెచ్ ఎమ్ ఎపుడు మాధ్వీని పనిష్ చేసే సమయం వస్తుందా అన్న ఆశ - ఆ సమయం రాకుండానే ఆ పిల్ల స్కూలు వదిలి పోతుందేమో అన్న నిరాశ, వీటిమధ్య ఊగిసలాడుతూంది ఆమె మనస్సు

*　　　*　　　*

మాధ్వీకి తల్లిలేదు తండ్రి, అన్నగారు వున్నారు తండ్రివుండి పేరుకు మాత్రమే ఇంటి బరువు బాధ్యతలు తల్లిపోయిన రోజే వదిలేశారు. ఆయనకు పట్టిన స్మశాన వైరాగ్యం సంవత్సరాలు గడుస్తున్నా వదలలేదు

అన్న 'విపుల్' - తల్లి, తండ్రి, అన్న తనే అయి, చెల్లి సంరక్షణకి పూనుకున్నాడు ఎదుగుతున్న చెల్లికి, తెలియపరచవలసినవి- నేర్పవలసినవి ఎన్నో వున్నాయని తలచాడు ప్రకృతి కొన్ని విషయాలు నేర్పినా, చుట్టూవున్న ప్రపంచం మరికొన్ని తెలియపరుస్తుంది స్వతంత్ర భావాలు కలిగి, నలుగురిలో నేర్పుగా బ్రతకటం నేర్చుకోవాలి సంఘజీవనానికి అలవడాలి సుఖదుఃఖాలను ఇతరులతో పంచుకోవాలి

జీవితంలో ఎదరయ్యే కష్టనష్టాలకు ఓర్చుకుని, జీవిత పోరాటంలో నెగ్గుకువచ్చే సామర్థ్యం కలిగివుండాలి ఇక్కడే, తన పెంపకంలోవుంటే సురక్షితంగా వుంటుంది కాని మాధ్వీ భావాలు ఎలా ఎదుగుతాయి చిన్నప్పటినుంచి ప్రపంచాన్ని చూడటం నేర్చుకొని, మంచి చెడులను గ్రహింపు చేసుకొని, తనే వ్యక్తిత్వం ఏర్పరచుకుంటుంది - మాధ్వీకి మంచి జరుగుతుందనే నమ్మకంలో, దూరమయినా, మంచి హాస్టల్‌వున్న ఈ స్కూల్లో చేర్పించాడు విపుల్

మాధ్వీకి ఫస్ట్ ఫారమ్‌నుంచి హాస్టల్ జీవితము ప్రారంభమైంది అప్పటి హెడ్ మిస్ట్రెస్ 'జేన్' మాధ్వీని కూతురిలా ఆదరించింది రాత్రులు ఏడుస్తున్న మాధ్వీని తనగదికి తీసుకొనివెళ్ళి బుజ్జగించి ఎన్నో కధలుచెప్పి, నిద్రపుచ్చేది నిద్రపోయినట్లేపోయి, పెద్ద టీచర్‌కి కోపం వస్తుందేమోనని నిశ్శబ్దంగా వెక్కిళ్ళు పైకి రాకుండా ఏడ్చేది అంత చిన్నపిల్ల - అతినిశ్శబ్దంగా ఏడుస్తుంటే, జాలి కలిగినా, తాను గాఢంగా నిద్రపోతున్నట్లు నటించేది 'జేన్'. మాధ్వీ ఏడుస్తూ నిద్రలోకి జారిపోయినప్పుడే, జేన్ నిద్రపోయేది।

పరిసరాలు అలవాటుపడిన తర్వాత ఒక రోజు మాధ్వీని వేరే

మంచంలో పడుకోమంది జేన్. భయంగా చూస్తున్న మాధ్వి చెంపలు నిమురుతూ, "మాధ్వీ - అమెరికాలో చిన్న పాపాయిలను వేరే గదిలో పడుకోపెడతారు. పాపాయికి భయం దేనికి? దూతలు మంచం చుట్టూ వుండి కాపలా కాస్తారు అందుకే వాళ్ళు ధైర్యంగా పెరుగుతారు. చిన్నప్పటినుంచీ వాళ్ళ పనులు వాళ్ళే చేసుకుంటారు వాళ్ళ వస్తువులని జాగ్రత్త చేసుకుంటారు

అమ్మ కావాలి అన్న పడకలో వుండాలి నాన్నను చూడాలి. అని ఏడ్వరు తెలుసా?" అని తాను అమెరికాలో చూసిన విషయాలన్నీ చెప్పేది

మాధ్విని దసరా సెలవులకి పంపక, సంక్రాంతి సెలవులకి పంపింది. బాగా అలవాటైంది. వుండగలదు అన్న నమ్మకం కలిగిన తర్వాత. విపుల్ కృతజ్ఞతలు తెలుపుతూ, మీ అంతటిది కావాలి మాధ్వి అని వ్రాశాడు

"తమ్ముడూ విపుల్, నీవే ఒకరి సంరక్షణలో వుండవలసిన వాడివి అంత చిన్న వయసులో ఎంతగనో ఆలోచించి. నీవు మాధ్విపై చూపే ప్రేమ, తీసుకున్న బాధ్యత నన్ను ముగ్ధపరచినవి మై బాయ్. గాడ్ బ్లెస్ యూ" అని రిప్లై యిచ్చింది జేన్

జేన్‌కి తల్లిదండ్రులు లేరు. పిన్ని పెంచింది. మిషన్‌వాళ్ళు పెంచి స్టేట్స్‌కి కూడ పంపారు మాధ్వి సెలవులకు ఇంటికివెళ్లాక, ఒంటరితనం ఏదో క్రొత్తగా తెలుసుకున్నట్లయింది జేన్‌కి తనెక్కడవున్నా. గుంపులో నుంచి. ఓ జతకళ్ళు తననే చూస్తున్నాయని, వెంటాడేవని గ్రహించింది తన గది ముందు నిల్చుని, తన పిలుపుకై యెదురుచూసే మాధ్వి తనలో క్రొత్త భావాలను, ఆత్మీయతను రేకెత్తించినది మరో జీవితం వుందని గూడ గుర్తింపు చేసినట్లనిపించింది జేన్‌కి కలిగిన ఆలోచన ఫలించేటప్పటికి రెండేళ్ళు పట్టింది

జేన్ పెళ్ళి చేసుకొని. మరో ఊరికీ, మరో స్కూల్‌కి వెళ్ళిపోయింది ఎనిమిదో క్లాసులోవున్న మాధ్వి జేన్ వెళ్లిపోతుంటే ఏడ్చింది పిల్లలతో పాటు జేన్ వెక్కి-వెక్కి ఎడ్చింది సూట్‌లోవున్న నల్లటి వ్యక్తిపై మాధ్వికి కోపం వచ్చింది

ఎత్తుగ తెల్లగ వుండే జేన్ మేడమ్‌కి తగినవాడు కాదు మేడమ్ ఏడుస్తుంటే విసుగ్గా ముఖం పెట్టాడు మాధ్వికి క్రమంగ ఉత్తరాలు వచ్చేవి క్రొత్తలో ఎడబాటుకి-రెండ్రోజుల కొకటి వ్రాసేది స్కూలు విషయాలతో నింపేది ఆ ఉత్తరాలన్నీ.

అసిస్టెంట్ హెచ్ ఎమ్ కి హెచ్ ఎమ్ గా ప్రమోషన్ రాలేదు మైథిలి అనే క్రొత్త మేడమ్ హెచ్ ఎమ్ గా వచ్చారు హెచ్ ఎమ్ కాలేదన్న కోపం అందరిమీద చూపిస్తున్నారు తల్లిని పోగొట్టుకున్న బిడ్డలా

వుంది స్కూలు. మేడమ్ వచ్చేయరూ? మీరాక కోసం ఎదురుచూస్తుంటాం అని వ్రాసేది రానురాను జేన్ దగ్గరనుండి ఉత్తరాలు రావటం ఆగిపోయాయి. ఉత్తరాలు రావటం పూర్తిగ, ఆగిపోయినా, జేన్ మేడమ్ గురించి ప్రతి రాత్రీ ఆలోచించేది. తల్లి ప్రేమ కాస్తో కూస్తో జేన్ దగ్గరే అనుభవించింది.

* * *

రోజులు గడుస్తున్నాయి. పాత టీచర్లు పెళ్ళిళ్ళు చేసుకునీ, బదిలీలు వచ్చో వెళ్ళిపోతుంటే, క్రొత్త టీచర్లు వస్తున్నారు. ప్రమీల రాజ్యంలో లాగ ఇదివరకు అన్ని పనులకూ స్త్రీలే కాని ఇపుడు మగ గుమస్తాలు వచ్చారు. తెలుగు పండితులు పురుషులే, గేమ్స్ టీచర్ స్థానంలో సార్ వచ్చాడు అంతవరకు ఒకే కుటుంబంగ వున్న ఆ స్కూల్లోవాళ్లు దాయాదుల్లా విడిపోయారు అన్ని రకాల పార్టీలు అక్కడే. N & O కాంగ్రెస్‌లాగ, హెచ్. ఎమ్. పార్టీ, అసిస్టెంట్ హెచ్. ఎమ్. పార్టీ సమయానుకూలంగ తక్కిన టీచర్స్ పార్టీలు మార్చుతుంటారు అలా మార్చినవారు పార్టీ రహస్యాలను వెల్లడిస్తారు అప్పుడు కోల్డ్‌వార్ మొదలవుతుంది. యుద్ధ ఫలితాలన్నీ విద్యార్థినులపై పడుతుంటాయి. సాధ్యమైనంతవరకు ఎదుర్కొంటూనే వుంటారు పిల్లలు, రోజు రోజుకు రూల్స్ మారిపోతుంటాయి.

స్టూడెంట్సు టీచర్ల గదులకి పోకూడదు. అయా సమయాల్లో వారి పనులని చేయటానికి వెళ్ళొచ్చు. సోషల్ విజిట్స్‌కి వెళ్ళకూడదు ప్రత్యేకించి ఏ పిల్ల అయినా, టీచర్ గదికి వెళ్ళి చనువుగ మాట్లాడినా, నవ్వినా రహస్యశాఖ కనిపెట్టేస్తుంది అలా వెళ్ళిన వారిపై చర్య తీసుకుంటారు. పరాయి మగవాని గదికి ఒక ఆడపిల్ల వంటరిగా వెళ్ళినంత రభసచేసి, ఆఫీసుకు పిలిచి, చీవాట్లు వేస్తారు.

ఆ సంవత్సరం 'సునందన'ను మహారాణిగ ఎన్నుకున్నారు. మాధ్వి యువరాణి ప్రతి సంవత్సరం 'మహారాణి'ని అలంకరిస్తుంటే కళ్ళు పెద్దవి చేసి, తదేకంగ ఆ వేడుకను చూసేది మాధ్వి. తను మహారాణి కాగలదా? టీచర్లందరు మహరాణిని పిలిచి మాట్లాడుతుంటారు హెచ్. ఎమ్ కంటె తన కళ్ళకి మహారాణి గొప్ప అధికారిణిగ కనుపించేది. ఏడవ తరగతికి వచ్చినపుడు జేన్ మేడమ్‌ని అడిగింది 'తను మహారాణి అవుతుందా' అని. ఆ. నీవు పెద్ద క్లాసుకు వచ్చాక, తప్పక మహారాణి వవుతావు నేనే నీకు కిరీటం పెడ్తాను.'' అని బుగ్గలు నిమిరింది ఆ రోజు జేన్.

యువరాణి అయిన మాధ్వి కళ్ళనిండుగ జేన్ వుంది. స్టడీ అవర్‌లో చదువుకోక ఉత్తరం వ్రాస్తూ కూర్చుంది. మరుసటి రోజునుంచే జవాబు కోసం ఎదురు చూడసాగింది

రోజులు గడుస్తున్నాయి. హాస్టల్లో చిన్న చిన్న మార్పులు, భోజనంలో మరీ మార్పులు జరిగాయి మిషన్ ఫండ్స్ తగ్గిపోవటంతో ఆహారం అధ్వానంగ తయారయింది. అన్నంలో పురుగులు వస్తున్నాయి ఇక కూరల సంగతి చెప్పనక్కరలేదు. ప్రతిరోజూ ఒకటే కూర-వంకాయ పులుసు

డబ్బు కట్ట గలిగినవారికి A క్లాసు పెట్టారు కట్టించుకున్నంత డబ్బుకి సరిపడ సదుపాయాలు లేవని పిల్లల గొడవ వార్డెన్‌గ వున్న అసిస్టెంటు హెచ్ ఎం. డబ్బు కాజేస్తుంది. 'హాస్టల్లో దొంగతిండి తినే ఆ ఇంట్లో వాళ్ళందరు అంత లావయ్యారు' అని మైథిలి అన్నట్లు విని, రాముడు చెట్ల చాటునుంచి బాణం వదిలినట్లు, బాణాలు వదలసాగింది అసిస్టెంటు 'తల్లో మెదడు లేకపోయినా, పరీక్షలో తెల్ల కాగితాలు ఇచ్చినా, పిల్లలు పాసవుతున్నారు ఎలా పాసవుతున్నారు? చాటుగావచ్చి, పుస్తకాలు చూసి, నింపిన పేపర్లపై మార్కులు వేస్తుంది ఎందుకు వేస్తుందో చెప్పాలా? ' అంటూ

హాస్టల్లో జరిగిన టీపార్టీకి ఒక్కొక్క అమ్మాయి దగ్గర ఐదురూపాయలు వసూలు చేసింది వార్డెన్, పిల్లలు గోలపెట్టారు మహారాణి సునందన. ఆ వారం జరిగిన మీటింగ్‌లో పిల్లల తరపున మాట్లాడింది-'జరిగిన పార్టీకి ఐదురూపాయలు చాలా ఎక్కువ లెక్కలు చూపి పిల్లలకు కలిగిన అనుమానాలను నివృత్తి చేయటం వారి ధర్మం' అని. వార్డెన్ ముఖం మాడిపోయింది. కోపాన్ని దిగమ్రింగలేక, పుస్తకాలు విసిరికొట్టింది

ఈ వార్డెన్ పని నాకొద్దు అని విసురుగ వెళ్ళిపోయింది 'టీచర్లని నమ్మాలికానీ, పెద్దవాళ్ళని అలా అగౌరవించవచ్చునా' అన్నారు ఆవిడ పార్టీకి సంబంధించిన టీచర్లు టీచర్ల కోపానికి బిక్క ముఖాలు వేసుకొని, మీటింగ్ మరో వారానికి వాయిదా వేశారు పిల్లలు

భోజనానికి వెళ్ళుతున్న మహారాణి సునందనకి హెచ్ ఎమ్ నుంచి కబురు వచ్చింది వెళ్ళిన పది నిముషాలకి తిరిగి వచ్చింది పిల్లలందరూ గుమిగూడి 'ఏమిటి విషయము' అని అడిగారు 'తనతో సంప్రదించనిదే. ఏ విషయమూ అలా మీటింగులో అడగరాదని, ఏమైన చెప్పవలసినవి ఉంటే తనకు చెప్పమన్నారని' అంది సునందన. ఆ చిన్న పిల్లల లేతరక్తం ఉప్పొంగినట్లు ముఖాలన్నీ ఎర్రబడ్డాయి.

"సభలు, సమావేశాలంటూ అసెంబ్లీ హాలుకు రావటం దేనికి? కాలేజి ఆంటీలు, పిల్లలు వచ్చి, స్కూలు విషయాలు, హాస్టలు సదుపాయాల గురించి చర్చించి, అందరికి ఆమోదకరమైన తీర్మానాలు చేసుకోవటానికంటూ, పది రోజుల కొకసారి మీటింగులు ఎందుకు?" మాధ్వి అంది. "ఎందుకంటే

మేడం చెప్పిన ప్రతి దానికీ, 'ఎస్, ఎస్' అంటూ చేతులెత్తటానికి'' మరో పిల్ల అంది.

''ఎన్నికలు దేనికి? చచ్చి చెడి, పిల్లపిల్లా గడ్డం పట్టుకొని, ఓటు వేయమని అడగటం, మన ప్రతినిధిగా మహారాణిని నిలబెట్టటం, ఇవన్నీ ఎందుకు ?''

''అట్ట కిరీటం పెట్టించుకొని, గంటలు కొట్టడానికి '' మరోపిల్ల కీచు గొంతుకతో అనటంలో పిల్లలందరు గొళ్ళుమన్నారు ఆ నవ్వుతో వారి కొచ్చిన కోపం కొట్టుకుపోయింది. ప్లేట్లు, గ్లాసులు పట్టుకొని డైనింగుహాలుకి వెళ్ళారు

సునందన నవ్వుతూ బి సెక్షన్ మీల్సు వైపు నడిచింది డైనింగు హాలు తలుపుదగ్గర ఎలుగుబంటిలా నిలబడివుంది అసిస్టెంట్ హెచ్ ఎమ్

''సునందీ! ఎంత పొగరు నీకు మహారాణివయ్యావని కళ్ళకు పొరలు క్రమ్మాయా?'' సునందన చేతిలోనున్న సత్తు గిన్నె, గ్లాసువైపు ముఖం చిట్లించి చూస్తూ, ''అవున్లే, అడుక్కుతినేదాన్ని, అందలం ఎక్కిస్తే మరే మవుతుంది '' ఆమె వాక్ ప్రవాహం అలా సాగిపోయేదే, కాని ఎపుడు వచ్చిందో, మాధ్వి సునందన ప్రక్కన నిల్చుని వుంది.

''మేడమ్ - మీ ఇష్టప్రకారము మాట్లాడకండి విద్యార్థినుల ప్రతినిధి కాబట్టే, అందరి తరపున మాట్లాడింది. మీరు ప్రత్యేకించి సునందిని పట్టుకొని తిట్టడం భావ్యం కాదు. నీళ్ళు ఆగిపోయి మూడు రోజులైంది ఆ దిగుడు బావిలోనుంచి తెచ్చుకుంటున్నాము చిన్నపిల్లలు కాలుజారితే ఏమవుతుందో మీ రెన్నడైనా ఆలోచించారా? వార్డెన్‌గా మీరు మీ బాధ్యతను విస్మరించి నపుడు, అలాంటివి గుర్తుచేయటం, జరిగేలా చేయడం మహారాణి వంతు ఇది మిమ్మల్ని అవమానపరిచినట్లు ఎలా అవుతుంది '' అనవలసిన మాటలు నాలుగూ అని సునందన చెయ్యిపట్టుకొని వెళ్ళింది మాధ్వి ఆ క్షణం నుంచి మాధ్విపై కక్ష తీర్చుకోవాలని ఎదురుచూడ సాగింది అసిస్టెంట్ హెచ్. ఎమ్.

* * *

క్రూరమృగాలు వుండే అడవుల్లో ఆటవికవాసులు నిర్భయంగా నివ సిస్తున్నా, ఆ మృగాల గర్జనలకు భయపడకపోయినా, ఒక కంట వాటిని కనిపెట్టి, దూరంగా మసులుతుంటారు అలాగే హాస్టల్లో పిల్లలు కాలక్షేపం చెయ్యసాగారు, సహృదయులైన టీచర్ల చల్లని చూపుకు, ప్రేమకు పోటీ పడుతుంటారు. అందంగావున్న టీచర్స్‌కొరకు పోటీలు ఎక్కువ. వారి కేదో ఒక విధంగా తమ ఇష్టాన్ని తెలియచెయ్యాలని క్రిందా మీదా పడుతుంటారు.

హాస్టల్ విషయాల్లో ఏ మాత్రం మెరుగు కనుపించలేదు వార్డెన్‌గా వుండనన్న అసిస్టెంట్ హెచ్ ఎమ్ వార్డెన్‌గానే వుండిపోయింది. సునందన ఆ కబంధహస్తాలకి వొరుగుతూనేవుంది డబ్బున్నవాళ్ళు ఏమిచేసినా చెల్లుతుంది కాని పేదవానికోపం పెదవికి చేటని తెలుసుకో లేకపోయింది సునందన. మహారాణి పదవి తనకు కంటకంగా తయారైంది అన్ని అర్హత లున్న ఆ పదవి, తన బీదతనంలో రాణించనంటున్నది

ఫండ్స్ తక్కువయ్యా యని 'బి' క్లాసు భోజనానికి పదిరూపాయలు కట్టమన్నారు. అదీ పంపించలేకున్నారు, కూలి చేసుకునే తల్లిదండ్రులు, ప్రొద్దునా సాయంకాలం కిచెన్‌లో ఒకగంట పార్ట్‌టైమ్ ఉద్యోగం చేయ టానికి ఒప్పుకుంది అదే మంచి సమయంగా, మాధ్వీలాంటి పిల్లలమీద ఉన్న కోపాన్ని కూడ తనమీదే చూపిస్తూ, సాధిస్తుండేది వార్డెన్. బ్రతుకు భారమయినట్లనిపించసాగింది సునందనకు

"దయగల దేవుడు తనలాంటి పిల్లలను ఎందుకు పుట్టించాలి? బీదలను ఆదరించమన్నారు కాని ఆయన మాట వినేదెవ్వరు? అసలు దేవుడు ఎలా వుంటాడు, ఒక్కసారి చూడాలి ఎలా " సునందన తన కష్టాలను మర్చిపోవటానికి దేవుని గురించి ఆలోచించేది. పధ్నాలుగు సంవత్సరాల జీవితమే వెగటనిపించేది. నిద్రలో మనస్సు తేలికయ్యినా, తెల్లవారుతుందంటే బరువెక్కింది చీకటి కోసం పగలంతా ఎదురుచూసేది.

ఆ రోజు కుళాయిలో నీళ్లు రాలేదు. బకెట్ తీసుకొని బావిదగ్గరకు వచ్చింది ఇంకా పూర్తిగా తెల్లవారలేదు బావిమెట్లు దిగింది విశాలమైన బావి నిండుగ నిశ్చలంగ వుంది. కాళ్ళకి చల్లగా తగిలాయి నీళ్లు, నిశ్శబ్దంగ, ఒంటరిగ చివరి మెట్టుపై నిల్చుంది బావిలో నీళ్ళు తననుచూసి నవ్వుతూ ఆహ్వానిస్తున్నట్లు భ్రమ కలిగింది నీళ్ళు రాకపోతే పిల్లలందరు బావికి వస్తారు. ఏ కొంచెం కాలుజారినా పడిపోతారు పట్టుకోవటానికి ఏ ఆధారంలేదు. ఇంతవరకు ఏ ఆపదా కలుగలేదు టీచర్లు బాధ్యతను విస్మరించినా, బావి పిల్లలను కాపాడుతూ వచ్చింది, 'అంతా దేవుని దయకదూ? అనుకుంటూ బకెట్టు ముంచింది సునందన 'దేవుడు, దేవుడు, ఆ దేవుడ్ని ఎప్పుడు చూస్తాను చూసి అడగాలి ఇంత దయగల గొప్ప దేవుడివి ఆకాశంలో సూర్య చంద్రులను నిలబెట్టి నీ మహిమను చాటావు అంత ప్రభావము కలిగిన దేవుడవు నాలాంటి పేదరాలిని ఎందుకు సృష్టించావు ప్రకృతిలో ఇన్ని అందాలు సృష్టించిన నీవు, మా వార్డెన్‌కున్నట్టి మనస్సుగల మానవులను ఎందుకు సృష్టించావు? అవి నీ పనులు కావా? మరెవ్వరివి?' ఆలోచనలో బకెట్ జారిపోయింది. నిండిన బకెట్ తేలికగా, అతి నిశ్శబ్దంగ మునిగి

పోయింది. ఆ క్షణంలో ఆ చిన్నిబుర్రలో ఏ ఆలోచనలు వచ్చాయో మెల్లిగ నీళ్ళలోకి దిగిపోయింది సునందన చల్లటి నీళ్ళు సునందనిని కప్పేశాయి అప్పుడే తెలిసింది తనకు గాలి, గాలికావాలని 'భగవాన్' గాలి కావాలి. గాలి. గాలి ' ప్రాణం విలవిల్లాడింది ఊపిరితిత్తులు నిండుగా గాలి పీల్చింది మరలా పీల్చింది ఊపిరితిత్తులలో ఏ కాస్తో వున్న గాలి బయటకు వచ్చింది ఆ స్థానంలో నీళ్ళు ఆక్రమించుకున్నాయి గాలిపొరలు భళ్లమని పగిలాయి ఈ బాధ ప్రాణభయాన్ని తెలియజేశాయి. ప్రాణాన్ని కాపాడుతుందేమోనన్న ఆశతో చేతికందిన ఆకును గట్టిగా పట్టుకుంది. చేతులు పైకిపెట్టి తడమసాగింది 'ఇంత చల్లగ, ప్రశాంతంగ వున్న నీళ్ళలో ఇంత భయంకరమైన చావు దాగివుంటుందనుకోలేదు' నిరాశగా, గాలికోసం అలమటిస్తూనే, ఆ రెండు మూడు నిముషాల్లోనే నరకం చవిచూసింది ఆ ప్రాణి. మరెవ్వరూ ఇలాంటి చావుకు గురికాగూడదు దేవుడనుగ్రహించిన ఆత్మని హత్యచేయటం అంత సులువుకాదు అన్నట్లుగా నీళ్ళపై చెయ్యి ఆడిస్తుండగానే సునందన ప్రాణం శరీరాన్ని వదిలింది

సునందన చావుతో మూగపోయిందా గరల్సు స్కూలు. గొంతెత్తి మాట్లాడటానికే భీతిచెందారు విద్యార్థినులు స్కూలు యజమానులు బావి గోడలు పైకిలేపి, గిలకను పెట్టారు

కాలచక్రాల క్రింద సునందన జ్ఞాపకాలు నలిగిపోయాయి. కాని 'నిద్రలో రాత్రులు గంటలు విన్నాము' అని పిల్లలు గుసగుసలాడుకున్నారు. బాత్‌రూమ్ కెళ్ళిన పిల్ల కెవ్వుమంటూ పరుగెత్తుకు వచ్చింది 'సునందన బాత్ రూందగ్గర నిలబడివుంద'ని చెప్పింది అప్పటినుంచి రాత్రులు బాత్ రూం కెళ్లాలంటే గ్రూప్సగ వెళ్ళేవారు సునందన, తాపుల్లో గూడ ఎవ్వరికీ హాని తలపెట్టదు అంతగా వెంటబడి, ఆత్తలా సాధించిన వార్డెన్‌ని చాటుగ తిట్టడంకూడ వినలేదు మాధ్వి ఎపుడూ దేవుని తలంపే అలాంటి సునందన దెయ్యంకాదు

"మేడమ్ - సునందన నేరుగ దేవుని దగ్గరకే వెళ్లివుంటుంది వీళ్ళంతా చీకటి నీడల్నిచూసి, సునందన అని భ్రమిస్తున్నారు. అవునుకదూ మేడమ్, మేడమ్. జేన్‌మేడమ్, నా తల్లివికదూ మీరు, మీరే చెప్పండి." అని యేడుస్తూ ఉత్తరం వ్రాసింది జేన్‌కి

లాంగ్‌బెల్ కొట్టడానికి బయటకువచ్చిన మాధ్వి చేతికి ఉత్తరం ఇచ్చింది గేమ్సు టీచర్. ఆ ఇన్‌లాండ్ కవర్ చింపివుంది. అది మామూలే. ఆ స్కూలు పిల్లలకి వచ్చే ఉత్తరాలన్నీ చదివే ఇస్తారు. ఉత్తరాన్ని ఆత్రంగా చదివింది. మొదట చదివింది అర్థం చేసుకోనని మొరాయించింది మనస్సు,

క్లాసులోకి వెళ్లలేక, అక్కడే నిల్చుని ముఖాన్ని కప్పుకొని వెక్కివెక్కి యేడ్చింది మరునిముషంలో పిల్లలు, టీచర్లు మాధ్వి చుట్టూ గుమిగూడారు. మాధ్వి కంటనీరుపెట్టగా ఎన్నడూ చూడలేదు. మాధ్వి చేతుల్లోని ఉత్తరాన్ని తీసుకొని చదివిన టీచర్, "అయ్యో జేన్‌మేడమ్ చనిపోయిందా" అని పెద్దగా అన్నది

తర్వాత జేన్ ఎలా చనిపోయినది తెలుసుకున్నారు, చక్కగ హుందాగ వుండే జేన్‌కి భర్త ఎప్పుడూ అనుమానించేవాడట 'అమెరికాలో ఎలా వున్నావు? అమెరికన్ నీగ్రోలు నిన్ను చూడలేదా? నిన్ను ఎలా వదిలారబ్బా!' అని పొడుచుకు తినేవాడట అలా మాటలతో తూట్లుపడ్డ శరీరాన్ని కిరోసిన్‌పోసి అంటించుకుంది ఆ కసి, కోపం, విరక్తి, అతని మాటలతో తన మనస్సు ఎలా విరిగిపోయిందో, తన శరీరాన్ని కాల్చుకుని చూపించింది.

హుందాగ, నిండుగవుండే జేన్‌ను చూచి గర్వపడవలసినది పోయి ఈర్ష్యపడేవాడు. తెలివిగలది, సంపాదన ఎక్కువ అందరూ ఆమెపై చూపే గౌరవం తనను చిన్నచూపు చూస్తున్నారనిపించేది ఎదగని తన మనస్సు జేన్‌ని చంపేసేదాక వూరుకోలేదు

మాధ్వి ఉత్తరాలు చదువుతూ, జేన్ ఆ పిల్ల మనస్సును ఎంతగ ఆక్రమించుకున్నదో తెలుసుకున్నాడు. ఆ పిల్ల ప్రేమ అతన్ని పిచ్చివాన్ని చేసింది ఇక వూరుకోలేక, 'నీ ఉత్తరాలు అందని చోటుకు జేన్ వెళ్లిపోయింది,అంటే చచ్చిపోయింది' అని మాధ్వికి వ్రాశాడు

మాధ్వి సునందనని మర్చిపోయినట్లుగా, ఎప్పుడూ తన మనస్సులో కదిలాడే జేన్‌మేడమ్‌ని జ్ఞాపకాల వెనక్కి నెట్టలేకపోయింది, మాధ్వి మనస్సు. ఎరిగిన విపుల్‌వచ్చి, సెలవు పెట్టించి, ఇంటికి తీసుకొనివెళ్ళాడు.

* * *

సూర్యుడు నడినెత్తిమీద నున్నాడు గరల్స్‌స్కూలు బయట రోడ్డు కిరుప్రక్కల బారులుతీర్చి నిల్చున్నారు, అమ్మాయిలు ప్రొద్దున ఎనిమిది గంటలనుంచి ఆ రోడ్డుకు కాపు కాస్తున్నారు మద్రాసునుంచి ఆ రోజు ఆ రోడ్డుగుండుగ రాష్ట్రపతి పోతాడట, అందుకు ఆ కాపలా దూరంనుంచి ఏ లారీయో, లేక బస్సో వస్తున్నా సోలిపోయి కూర్చున్న పిల్లలు లేవటం. మరలా వున్నారంటూ రోడ్డుమీదే కూర్చోవటం చేస్తున్నారు ఎర్రటి ఎండ ఆకలిని రెచ్చగొట్టుతూంది ఈ కాపలాకు అర్థంలేదు హెచ్ ఎమ్. ఇలాంటి పనులే చేస్తుంది.

ఆ మధ్య ఎవ్వరో ఆమెకు తెలిసిన వృద్ధుడు చనిపోయాడు హాస్టల్ పిల్లలందరిని కదిలించుకుపోయింది. ఒక్కొక్కరువెళ్ళి, శవాన్ని ఉంచిన

మంచం చుట్టిరమ్మని చెప్పింది. అతను ఎవరో, అసలు అక్కడికి ఎందుకు వెళ్ళినట్లో వాళ్ళకి తెలియనేలేదు చిన్నపిల్లలు ఒకరిద్దరికి జడుపుజ్వరం గూడ వచ్చింది. చేతిలోవున్న అధికారాన్ని ఎలా సద్వినియోగం చేయాలో తెలియక కొందరు ఇలాంటి పనులు చేస్తుంటారనిపిస్తుంది

అలాంటి సమయంలో రిక్షాలో సూట్‌కేసు, బుట్టల మధ్య ఇరుక్కుని కూర్చునివస్తున్న మాధ్వీని చూశారు పిల్లలు 'మహారాణి, మహారాణి వస్తుంద'ని గోలచేస్తూ లేచి నిల్చుని, చేతుల్లో నలిగి వాడిపోయిన పువ్వులు మాధ్విపై విసిరారు కొందరు కాగితపు ముక్కలు విసిరారు మరి కొందరు 'మహారాణికి జై' అంటూ అరిచారు

ఫస్ట్‌ఫారం పిల్లలు రిక్షాను పట్టుకున్నారు

"ఏమిటీ! ఇలా గోడకట్టారు——" అంది మాధ్వి

"రాష్ట్రపతి వస్తున్నాడట"

"ఢిల్లీనుంచా"

"కాదు మద్రానునుంచి"

"అయితే ఎప్పుడో వెళ్ళిపోయాడు. ఊర్లో రోడ్డుమీద ఒక్క పోలీసూ లేడు"

మరునిముషంలో రోడ్డు వర్షం వచ్చి వెలిసినట్లయింది

ప్లేగ్రౌండ్‌లో చెట్లనీడన, ఓ పిల్లగుంపు వలయాకారంగా కూర్చుని, మధ్య మాధ్వి పట్టుకొచ్చిన మిఠాయి డబ్బా ఉంచుకొని, ఆనందంగ ఆరగిస్తూ, మాధ్వీ చూసిన సినిమా కథలు ఒకటి తర్వాత ఒకటి టూకీగ చెప్పించు కుంటున్నారు. మాధ్వి కథతోపాటు, డైలాగులు కూడ వప్పజెప్పుతూ, 'ఫోటోగ్రఫీ బాగుంది హాస్యంలో క్రొత్తదనం లేదు, అయినా నవ్వు వచ్చింది' అంటూ, స్పష్టంగ తన అభిప్రాయాలను వెల్లడిస్తూ వుంది. సినిమాలపై మాధ్వికున్న జ్ఞానం అపారం అని ఆ శ్రోతలకు తెలుసు. స్కూలు నుంచి హాస్టలువైపు పోతున్న ఓ ఆకారాన్ని చూస్తూ "ఎవ్వరా అజంతా సుందరి" అంది మాధ్వి

దూరంనుంచి అతి నాజూకుగా, లే ఎండలో మరీ తెల్లగ రేఖా చిత్రంలా నడిచిపోతున్నది క్రొత్తగా వచ్చిన లెక్కల టీచరు

"అజంత, మన లెక్కల టీచర్" అన్నారు.

"అందంగ వుందికదు, ఇక సుగుణా మేడమ్ ఆటకట్టు" అని ఏకగ్రీవంగ అంగీకరించారు

ఆ రాత్రి మాధ్వి పడకపై వాలుతుండగా, శ్రీదేవి కాటేజినుంచి, వసుంధర వచ్చి, "మాధ్వీ, నీ దగ్గర వెడిసీళ్ళ సంచి వుందికదూ, కాస్త

ఇవ్వవూ, లెక్కల టీచర్‌కు కడుపు నొప్పిగా వుందట. కాపడం పెట్టాలి''
అంది.

మాధ్వి వసుంధరతోబాటు కిచెన్‌లోకి వెళ్ళి, వేడినీళ్ల తీసుకొని, అజంత గదికి వెళ్ళింది బాధ ఎక్కువగానే వుంది కాబోలు ముఖమంతా ఎర్రగ కందిపోయింది కాపడం పెట్టటంతో కొంత ఉపశమనం కలిగింది. ఇంతలో మాధ్వి సిస్టర్ గదికి వెళ్ళి, రెండు టాబ్లెట్స్ తెచ్చి అజంతతో మింగించింది

మరో పదినిముషాల్లో నొప్పి తగ్గి, నిద్రతో కళ్లు మూతలు పడుతుండగా, అజంత మాధ్వి చెయ్యి అందుకొని ముద్దు పెట్టుకుంది అలా వారి పరిచయం, స్నేహంలోకి దిగింది

మాధ్వికి అజంతను చూస్తుంటే సింహాల్ బొమ్మ గుర్తుకు వచ్చింది. అన్నయ్యకు ఉత్తరం, ఏదో క్రొత్త విషయం అరుస్తూ చెపుతున్నట్లు వ్రాసింది 'అన్నాయ్, అన్నాయ్, కాలండర్‌లోని సింహాల్ బొమ్మని ఫ్రేమ్‌లో బిగించావు బొమ్మలాంటి అజంత, మా లెక్కల టీచర్‌ను నీకు చూపాలని వుంది స్వీట్ వాయిస్ అంటే ఏమిటో ఆమె స్వరం విన్నాక తెలిసింది లెక్కలంటే నాకు అమాంతంగ ఇంటరెస్టు పుట్టుకొచ్చింది 'ఆమె నవ్వు ఎలా వుంటుందంటూ' నీ అనుమానాలన్నీ వ్రాయకు మా ఉత్తరాలను సెన్సార్ చేస్తారని తెలుసుగా? నీ కిష్టమైన ఛావల్ సెంటులా ఆహ్లాదంగ వుంటుంది ఊతపదం ఏమిటో తెలుసా? 'సో', బోర్డువైపుకి తిరిగి, లెక్క వేస్తూ, తల వోరగపెట్టి కళ్లు పైకెత్తి క్లాసువైపు చూస్తుంటే, విచ్చిన గులాబీలు గుర్తుకు వస్తాయి తన శరీరపు రంగు చూసుకొని మిడిసిపడే సుగుణా టీచర్ జట కట్టయింది తన ఫేవరేట్స్ కూడ 'అజంత'ను లైక్ చేస్తున్నారు పేరు క్రొత్తగా వుంది కదూ'' ఇలా మాధ్వి ఉత్తరాలన్నిటిని అజంతతో నింపేసేది

అలాగే సమయం దొరికినప్పుడల్లా ఎన్నో కబుర్లతోపాటు 'విపుల్' గురించి కూడా చెప్పేది అజంతతో

''ఎప్పుడూ అన్నయ్య నామస్మరణేనా? మీ వదిన సంగతి చెప్పవేం?''
అంది ఓరోజు

''ఇంకా వదిన రాలేదు అంటే పెళ్ళికాలేదు, అందమైన అమ్మాయి కొరకు వెదుకుతున్నాడులే ''

''బాగానే వుంది మీ అన్నయ్య అందగాడేనా? నీలాగ వుంటారా?''

''నాలాగ నల్లగ మాత్రం ఉండడు అన్నయ్య చక్కగ వున్నా, చక్కని భార్య వుంటేనే కద, అందమైన పిల్లలు పుట్తారు ''

"అత్త చాలు నలుపు వస్తే!"

"చచ్చాం! నిజమే నంటోయ్"

ఆ వెంటనే అన్నయ్యకు లెటర్ వ్రాసింది "బంగారన్నాయ్! నీకు పెళ్ళయి, పుట్టే పిల్లలకి, నా రంగు వస్తే???"

ఆ లెటరుకు తిరుగు టపాలో జవాబు వచ్చింది

"మాధ్వీలాంటి పాపాయిలే పుట్టితే, అంతకంటే అందమైన విషయం ఇంకేముంటుందీ ప్రపంచంలో?" ఆ ఉత్తరాన్ని పదేపదే ముద్దు పెట్టుకుంటూ అజంతకు చూపింది.

"తప్పక మీ అన్నను చూడాలోయ్" అంది

ఆ తర్వాత లైబ్రరీలోనున్న అజంత చేతిలో ఓ కవరుంచి వెళ్ళిపోయింది మాధ్వి మాధ్వికి ఇలా కవర్లుతెచ్చి చేతి కివ్వటం అలవాటే అజంత సౌందర్యాన్ని వర్ణిస్తూ, ఆమెపై తనకు గల ఇష్టాన్ని తెలుపుతూ, వ్రాసిన పద్యాలు ఉంటాయి ఆ కవర్లలో ఇదికూడ అలాంటి ఉత్తరమేమో అని తనలో తాను నవ్వుకుంటూ, విప్పిచూసిన అజంత రెప్పలు వాల్చలేక పోయింది ఓ జతకళ్ళు తననే చూస్తున్నాయి అప్రయత్నంగ ఫోటోని వెనక్కు త్రిప్పింది అజంతకు ప్రేమతో విపుల్ అని వ్రాసివుంది క్షణం ఆశ్చర్యంలో మునిగిపోయింది మరుక్షణం నవ్వుకుంది మాధ్వి కొంటె తనానికి కవరును జాగ్రత్తగ నోట్సులో భద్రపరచింది

"అన్నాయ్! బంగారు, నీ ఫోటో చేరవలసినచోటు చేరుకుంది. అజంత తన ఫోటో వెనుక నీ ఫోటో వుంచింది ముందు చూస్తే అజంత, వెనుక నీవు. సాలార్‌జంగు మ్యూజియంలోని స్టాచ్యూలాగున్నారు, ప్రొద్దు పొడవక ముందే ప్రవేటుకెళ్ళాను ఎదురుగ బల్లమీద నవ్వుతూ నీవున్నావు. అజంతవైపు చూశా, మెరుస్తున్న కళ్ళతో చూస్తున్నదల్లా గబుక్కున ముసుగేసుకుంది. అన్నాయ్, నాకు వదిన దొరికింది. ముసుగుమీదనుంచే ముద్దు పెట్టుకున్నాను, నా కోరిక తెలిపింది కదూ? అపుడపుడు అజంత, "మాధ్వీ, అన్నయ్య ఉత్తరాలు వ్రాశావా" అంటే.

"ఏంటండీ మిస్, మీరూ అన్నయ్య అంటే ఎలా?" అంది

"మరేమనాలి?"

"ముద్దుగ విపుల్."

"విప్పు—"

"పప్పు అనలేదు నయం" అంది మాధ్వి. ఇద్దరూ నవ్వుకున్నారు.

వారిద్దరి స్నేహం పిల్లలందరికి తెలుసు. ప్రత్యేకించి తప్పు పట్టలేక పోయారు.

ఆ రోజు మాధ్వి తన కాలేజినుంచి, అజంత గదికివెళ్ళటం ఓ సర్వెంటుచూసి, వార్డెన్ చెవిలో వూదింది మిన్నువిరిగి మీదపడ్డట్టు వులిక్కిపడింది ఆశ్చర్యపోయింది. చిరకాలవాంఛ నెరవేరబోతుంది ముసిముసిగ నవ్వుతూ హెచ్ ఎమ్ కి చెప్పింది

"ఈ పాప కార్యాన్ని వెంటనే అరికట్టాలి. సాయంకాలం స్టాఫ్ మీటింగ"ని చెప్పమంది

మహారాణి కొరకు వెంటనే కబురు వెళ్ళింది

మాధ్వి పరుగున వచ్చింది ఎదురుగ హెచ్ ఎమ్ కోపంగ, గంభీరంగ వుంది వ్యంగ్యంగ నవ్వుతూ హైనాలా, ప్రక్కనవుంది. అసిస్టెంటు సమయం దొరకబుచ్చుకొని పైకి దూకాలని వుంది

అడ్డదిడ్డమైన ప్రశ్నలువేసి, నిజాన్ని రాబట్టాలని చూశారు

మాధ్వి మొదటి ప్రశ్నతోనే అంతా గ్రహించింది

"నాకు లెక్కలు రావు. అందునా పబ్లిక్ తెలియనివి చెప్పించుకుంటానికి వెళ్లాను. మా కాలేజి ఆంటీ పర్మిషన్ తీసుకున్నాను"

ఆ అమ్మాయి ధైర్యానికి ఆశ్చర్యపోయారు.

"బాడ్‌గరల్, టీచర్ల గదులకి పోకూడదని తెలియనూ. అది డిసిప్లెన్ కాదని అందరికంటే బాగ నీకే తెలిసివుండాలి. ఈ హాస్టల్‌కి మాకంటే నీవు పాతవానివి"

"మేడమ్ - టీచర్ల గదులకి చాకిరీ చెయ్యటానికి వెళ్లొచ్చు. కాని చదువుకోవడానికి పోకూడదా. మీ గదులకి విక్టోరియా, ప్రమీల రావటం లేదా?" అంటూ అసిస్టెంట్‌ని చూపింది

మాధ్వి సవాల్‌కి జవాబు చెప్పలేనట్లు మండిపోయారు. "బాడ్ ఆన్సర్స్ ఇస్తున్నావు హాస్టల్ రూల్స్ చదువొకసారి" అంటూ చార్టును ముందుకు నెట్టింది అసిస్టెంటు. మొండిగ నిల్చింది మాధ్వి

"ఇప్పటినుండి నీవు మహారాణిగ వుండతగదు" అంది హెచ్ ఎమ్.

కిరీటంతీసి బల్లమీద పెట్టినట్లు యాక్షన్‌చేసి బయటకు వచ్చింది

ఏడుస్తూ వస్తుందనుకున్న మాధ్వి నవ్వుతూవచ్చి, "ఇపుడు తేలిగ్గా వుంది శరీరం. కిరీట భారంపోయింది మహారాణి పిచ్చి వదిలింది" అంది.

"మనస్కూలు పరిపాలనావిధానాన్ని మార్చాలి మన స్కూలుదే కాదు. దేశ పరిపాలనావిధానాన్నే మార్చాలి నేనే ప్రధానినైతే ఎన్నోచేస్తాను. చేసి చూపిస్తాను"

"మహారాణీ ఏం చేస్తావు? చెప్పవా" వెంటబడ్డారు పిల్లలు.

"ఇపుడు కాదు, తర్వాత. ముందు అజంత మిస్‌ని చూడాలి."

అంటూ ముందుకు పోయింది.

ఎందుకో ఆగి "వసూ" అంటూ వసుంధరని పిలుచి అక్కడే నిల్చుని ఏదో వ్రాసి, ఆ కాగితాన్ని వసుంధర కిచ్చింది

మాధ్వి వ్రాస్తుంటే చుట్టూవున్న పిల్లలు తొంగితొంగిచూస్తూ నవ్వుకున్నారు

అప్పటికీ అజంతని పిలిచి మెత్తమెత్తగ చీవాట్లు వేసింది హెచ్. ఎమ్ టీచర్లే యిలాచూస్తే పిల్లలు మరీ బరితెగించి పోతారు. విద్యార్థినులతో చనువుగవుంటే స్కూల్ డిసిప్లిన్ మంటగలిపిపోతుంది టీచర్లు రిజర్వ్‌డ్‌గ వుండాలి ఇది కాలేజి అనుకుని మీరూ కాలేజి పిల్లలాగవుంటే ఎలా?" అంటూ

వాళ్ల ముఖాలు చూస్తుంటే నోట మాటగూడ రాలేదు, సుతిమెత్తని అజంతకు. తనుచేసిన తప్పేమిటో! ఎంత వెతికినా కానరాలేదు. మౌనంగ తిట్లుతిని బయటకు వచ్చింది "మాధ్విని భయపెట్టలేకపోయినా, ఒక టీచర్‌ను భయపెట్టగలిగాం" అనుకుని తృప్తిగా వెనక్కి వాలిపోయారు హెచ్ ఎమ్ అసిస్టెంటు

టీచర్లు హేళనగ చూస్తుంటే కళ్ళనీళ్ళు గిర్రున తిరిగాయి అజంతకు. క్లాసులోకివచ్చి ముఖాన్ని చేతుల్లో దాచుకుంది పిల్లలు మౌనంగ ఉండిపోయారు వసుంధర, మాధ్వి వ్రాసిన ఉత్తరాన్ని తెచ్చి ఇచ్చింది నన్నే ఇలా అన్నారు ఇక మాధ్విని ఎంతగ తిట్టివుంటారో అనుకుంటూ చదివింది ఆ ఉత్తరంలో ఇలావుంది,

"ప్రియబాంధవీ' మహారాణి పదవిపోయినందుకు హాయిగవుంది. మిమ్మల్ని ఏవైన అంటారేమో, విచారించకండి నేను ఐదు సంవత్సరముల నుంచి ఈ హాస్టల్లో వుంటున్నాను వీళ్ళ పుట్టుపూర్వోత్తరాలు నాకు తెలుసు.

ఏవో ఆఫీసు పనలున్నాయని ఆఫీస్ క్లర్క్ ఫైల్సు పట్టుకుని అసిస్టెంట్ గదికి వెళ్తుంటాడు. మరొక మిస్ తన నగ్న సౌందర్యాన్ని అద్దంలో చూసుకుంటూ, అడవి కాచిన వెన్నెల తన సౌందర్యం అని తలపోస్తూ, పిల్లలచేత తన అందాన్ని పొగిడించుకుంటుంది

గేమ్స్ టీచర్ ఇరవై నాలుగు గంటలూ హెచ్ ఎమ్ గదిలో వుంటుంది అది మాత్రం రూల్స్‌కి విరుద్ధం కాదా? మిస్ ఊర్వశినని తలపోసున్న శాంతా టీచర్, తెలుగు మాస్టారు లైబ్రరీలో కార్నర్ సీట్లలో కూర్చొని, జరిపే రహస్య సమాలోచనలు అందరికీ తెలుసు

శాసనాలు చేయటం సులభం మీరు మెత్తగ వుంటే మొత్త బుద్ధేస్తుంది చెడును చెడుతోనే జయించాలి అవినీతి, లంచగొండితనం,

నశించాలి అని ఉపన్యాసాలు దంచే నాయకులతోనే మొదలవుతుంది లంచ గొండితనం అలాగే మన స్కూలు పరిపాలనా విధానం కూడ

చూశారా, మేడమ్! మీకే పాఠాలు నేర్పుతున్నాను చిన్నప్పటినుంచి స్వతంత్రంగా ఆలోచించటం నేర్చుకుని, మన సమస్యలను మనమే పరిష్కరించుకొనగల శక్తి కలగాలనే నన్ను హాస్టల్లో వుంచారట మా అన్న. జేన్ మేడమ్ నాకెన్నో నేర్పింది. కాని ఆవిడ చెప్పినట్లు ఆవిడ మంచితనం ఆవిడను కాపాడలేకపోయింది తనకొచ్చిన సమస్యను పరిష్కారం చేసుకొనలేకపోయింది. ధైర్యంగానే చచ్చిపోయింది కాని, అటువంటి విజ్ఞానవంతురాలు, ముమ్ముందు తరాల వారికి ఎట్టి సందేశమూ ఇవ్వలేకపోయింది ''

ఆ ఉత్తరం చదువుతున్నంతసేపు ఆశ్చర్యంలో మునిగిపోయింది అజంత జేన్ కొచ్చిన సమస్యను, మాధ్వి ఎలా పరిష్కారం చేసేదో అడగాలనుకుంది తేలిగ్గా నిట్టూర్చి అజంత తనకు పరిష్కార మార్గం దొరికినట్లు

''మాధ్విని మహారాణి పదవినుండి తొలగించినట్లు, త్వరలోనే మహారాణిని ఎన్నుకునేందుకు సంసిద్ధులు కమ్మని'' హెచ్ ఎమ్ పంపిన నోటీసు ప్యూన్ ప్రతి క్లాసుకు వెళ్ళి చూపించాడు. మరొక కాపీ నోటీస్ బోర్డులో పెట్టారు

మధ్యంతర ఎన్నికలకు ఆట్టే టైంలేదు హెచ్ ఎమ్ తన ఫాన్‌ను బాగా తినిపించి, ప్రతి సంవత్సరం ఒక పట్టుచీర గురుదక్షిణగ సమర్పించే పద్మను నామినేట్ చేసింది, అసిస్టెంటు, తన నమ్మినబంటు, పి. ఇ డి గా రాణించే విక్టోరియాని నామినేట్ చేసింది

ఎన్నికల ప్రచారం జోరుగ, ఎన్నడూ లేనంత సందడిగా వుంది పద్మ రోజుకో చీరకట్టి, తన ఖర్చుమీద అందరికి 'ఎ' క్లాసు భోజనం పెట్టించింది రిబ్బన్లు పంచింది పద్మకు ఆశ్రితులు ఎక్కువయ్యారు

ఎక్స్ మహారాణికి మంచి పలుకుబడి వుంది మాధ్వి మాట వేద వాక్కు చిన్నపిల్లలకి వాళ్ళ ఓట్లు రావాలంటే మాధ్విని మంచి చేసుకోవాలి. 'ఎన్నికలకు ముందు నాయకులు చేసే వాగ్దానాలను మేము నమ్మము' అని కబురు పెట్టింది మాధ్వి

అప్పటికప్పుడు హెచ్ ఎమ్ పర్మిషన్ తెచ్చి, పద్మ ఫస్ట్‌షోకి హాస్టల్ హాస్టల్‌నే తరలించుకుపోయింది ప్రొద్దున లేచేసరికి గోడలనిండా బొగ్గు రాతలు ''ధనికవర్గం నశించాలి పద్మ డౌన్ డౌన్ మీ పవిత్రమైన ఓటు పేదవర్గానికి చెందిన విక్టోరియాకే 'ఎ' క్లాసు తిండితినే నాయకురాలు 'బి' క్లాసుకు సేవచేయగలదా నియంత చేతికి చిక్కిన పాకిస్థాన్‌లా నలిగిపో

వచ్చు. మీకు సేవచేయగలిగేది విక్టోరియా మాత్రమే.''

పద్మ ఆశ్రితులు ఆ రాతలను తుడిచేశారు

ఆ రోజు 'బి' క్లాసు మీల్సు ఎన్నడూ లేనంత శుభ్రంగ, రుచి కరంగా వుంది విక్టోరియా కిచెన్‌లో వుండి అజమాయిషీ చేసింది. 'విక్టోరియాకు మీ ఓటు వేస్తే, ఎప్పుడూ మీకు ఇలాగే భోజనం వుంటుం'దని చెప్పింది అసిస్టెంటు ''ధనికవర్గానికి అమ్ముడు పోకండి విక్టోరియాని గెలిపిస్తే, మీకు 'ఎ' క్లాసుమీద పెత్తనం దొరుకుతుంది'' అని కూడ చెప్పింది.

ఆ క్షణంలో ఆ పిల్లల భావాలు చదివి తృప్తిపడింది

'పూర్వం పెట్టుబడిదారులదే పైచెయ్యి అనాదినుంచి ధనికవర్గాలు పేదవారిని దోచుకుంటున్నాయి ప్రజా స్వామ్యంలో నున్న మంత్రులు, నాయకులు గొప్పవారే అప్పటి భూస్వాములే ఇప్పటి మంత్రులు ఈనాడు 'పేదవర్గాలదే పైచెయ్యి' చేత్తో వ్రాసిన కరపత్రాలు పంచిపెట్టింది విక్టోరియా.

పద్మ ప్రతి పిల్ల గడ్డం పట్టుకుని బ్రతిమలాడింది పద్మ ఆశ్రితులు ''పద్మ హెచ్ ఎమ్ కాండిడేటు, ఆమెను ఎన్నుకోకపోతే హెచ్ ఎమ్ ను అవమానించినట్లవటమే కాక, ఆమె కోపానికి కూడ గురికావల్సి వస్తుంది'' అని చిన్నపిల్లల చెవుల్లో మెల్లిగ చెప్పి, చాక్‌లెట్స్ ఇచ్చారు.

''పద్మా! మీ నాన్న ఎన్నడైన ఎం యల్ ఎ గా నిల్చున్నాడేంటి?'' అంది మాధ్వి, పద్మ చేతుల్లోని చాక్‌లెట్ డబ్బా తీసుకుంటూ

''ఏం?''

''అహ — ఎన్నికల్లో దేశనాయకుల ప్రచారానికీ, నీ ప్రచారానికీ ఏమీ తేడా లేకుంటేనూ '' అది వ్యంగ్యమో, ప్రశంసో తెలియని పద్మ తికమకపడింది.

అజంత ప్రయివేట్ క్లాసులు పెట్టుకుంది వెనుకబడిన పిల్లలకు మరీ శ్రద్ధగ, అడిగి అడిగి చెప్పేది టీచర్‌గారి నిష్పాక్షిత మనస్సుకు పిల్లలందరూ తృప్తిపడారు. క్లాసులో ఎన్నో కబుర్లు - ఎన్నిటిమీదనో చర్చలు జరిగేవి.

టీచర్స్ క్లాసుకు సంబంధించిన విషయాలేకాక, క్రొత్త విషయాలు, వినదగినవి చెపుతూ, పిల్లల కారెక్టర్‌ని పెంపొందించవచ్చు పిల్లల భవిష్యత్తుకుగట్టి పునాదులు వేయవచ్చు జ్ఞానం తెలిసిన దగ్గరనుండి స్కూలుకివెళ్ళే పిల్లలమీద, తలిదండ్రుల ప్రభావం ఎంతుంటుందో, టీచర్ల ప్రభావం కూడ అంతే వుంటుంది

భావిభారత పౌరులను తీర్చిదిద్దే అవకాశం ఉపాధ్యాయుల కుంది. గాంధీగారి భక్తికి, కార్యదీక్షకు కారణం, ఆయనకు తల్లి వేసిన పునాది, శివాజీ

దేశభక్తుడు, వీరుడు కావటానికి, అతని తల్లియే కారణం. చిన్నప్పుడు తన తల్లి చదివి వినిపించే కథలు వినే, మావో అంతటి దేశభక్తుడు కాగలిగాడు. అజంత ఈ మాటలన్నీ చెప్పుతూ, 'చూశారా గొప్పవాళ్లంతా తల్లిచేతుల్లో పెరిగినవారే శకుంతల చేతిలో పెరిగిన భరతుడు పులిపిల్లలతో ఆడుకున్నాడు. లవ, కుశులు యజ్ఞాశ్వాన్నికట్టి, యుగపురుషుణ్ని ముప్పతిప్పలు పెట్టారు తల్లి చిత్రాంగద చాటున పెరిగిన బభ్రువాహనుడు, భారతానికి పట్టుకొమ్మ అయిన అర్జునుడిని విగతప్రాణునిగా చేశాడు.

ఇలా లెక్కించుకుపోతే ఎన్నో మరో తమాషా, మగవాళ్ళు స్త్రీని అబల అంటారు. వారిని వంటింటి కుందేళ్లనిచేసి, ఇల్లు కదలనివ్వక కట్టుబాట్లుచేస్తారు

స్త్రీలు వ్రాసిన నవలలు అతితేలిగ్గా తీసిపారేస్తారు కలలలో తేలియాడుతూ, యదార్ధానికి దూరంపోతారు, అని బజార్లలో నెత్తీ నోరూ కొట్టుకుంటారు అలా చేయక, ఓ చక్కని యదార్థనవల వ్రాసి, అమ్మలూ, ఇది నవల, ఇలా వ్రాయండి అని చెప్పొచ్చుగా ''

బల్లలు గుద్ది నవ్వారు పిల్లలు

అజంత చెప్పసాగింది. ''ఈ మధ్యనే ఎక్కడో చదివాను, 'ఆడవారి రచనలు ఎంత ఈదినా మోకాటిలోతే, అని ఎవ్వరో మహానుభావులన్నారట '' అలా ఆడవారందర్ని తీసిపారేస్తే, అంతమంచి శృంగారాన్ని రచించిన ముద్దుపళని మాటేమిటి? మహాభారతాన్ని తెనిగించటానికి కొన్ని శతాబ్దాలు పట్టింది మహామహులు నన్నయ్య మొదలుపెట్టితే, తిక్కన పూర్తి చేశాడు కానీ, కొన్నిరోజుల్లో అందమైన రామాయణాన్నివ్రాసింది, కవయిత్రి మొల్ల ''

''హుర్రే'' అంటూ పుస్తకాలు ఎగురవేసి నవ్వారు అమ్మాయిలు.

అజంత ''ఇష్ '' అంది నోటిమీద వ్రేలుపెట్టుకుని ''ఇంతకీ నేను చెప్పేదేమిటంటే మీరు గూడ అలాంటి తల్లులు కావాలి, అలాంటి రచయిత్రులు కావాలి '' అజంతతోపాటు అమ్మాయిలందరూ నవ్వులు చిందించారు.

''మా వూర్లో ఓ ఆఫీసర్ వుండేవాడు అతను బ్రాహ్మణుడు. అతను ఆ వూర్లో వున్నంతకాలం, ప్యూన్లు మొదలు, ఆ చుట్టుప్రక్కల బ్రాహ్మణులే కనుపించేవారు. తర్వాత ఆఫీసర్ ముస్లిం. ఓ డ్రామాసీను మారిపోయినంతగా మారిపోయింది అక్కడి వాతావరణం. టోపీలు పెట్టుకుని, గడ్డాలు పెంచుకున్న హజరత్‌లు కనుపించేవారు ఆ తర్వాత ''

''ఓ క్రిష్టియన్ వచ్చాడు, అవునా మేడం'' అని ఓ కొంటెపిల్ల

పూర్తిచేసింది. క్లాసంతా నవ్వులు. అజంత మరలా మొదలుపెట్టింది. "మన దేశంలో కులం, అనేది ఎంతగట్టిగా, జలగలాగ అంటిపెట్టుకునుందో చూడొచ్చు.

వృత్తులనుబట్టి కులాలు ఏర్పడ్డాయని అందరూ ఒప్పుకున్నారు ... పెళ్ళిళ్లు కూడ ఆయా కులాల వారి మధ్యనే జరగాలి. ఎందుకు వచ్చేపిల్ల, ఇంటి పనిలోనే కాక కులవృత్తిలో కూడ సాయపడుతూందన్న ముఖ్యోద్దేశ్యంతో. కాని, ఇది యంత్రయుగం, చేతివృత్తులుపోయినట్లు, కులాలు పోవాలి " అంతలో మరో అల్లరి పిల్లలేచి "సో మనందరం కులాల పట్టింపులేకుండా ఎవరినయినా పెళ్ళాడవచ్చు" అంది.

హర్షధ్వనులకు క్లాసు పైకప్పు లేచిపోతుందేమో నన్న భయంతో తలమీదకు ముసుగు లాగుకుంది అజంత

"క్లాసా చేపలమార్కెట్టా" అంటూ అసిస్టెంట్ వచ్చింది పిల్ల లందరూ లేచి నిల్చున్నారు

అజంత ఆవిడవైపు తిరస్కార పూర్వకంగా చూసి, బోర్డువైపుకు తిరిగింది. అసిస్టెంటు వెళ్ళిపోయింది

"సో సాంఘిక వ్యవస్థలో కులాల ప్రాముఖ్యత తగ్గిపోయింది."

"మరిం కెందుకా ప్రాముఖ్యత-?"

"రాజకీయాల్లో మంత్రోపదేశంగా వాడబడుతుంది?"

"హియర్, హియర్" అన్నారు ఫ్రంట్ బెంచ్‌వాళ్లు.

"ప్రాక్టికల్‌గా ఎలా వాడబడుతుందో మీరు చూడవచ్చు ఈ స్కూల్లో క్రిస్టియన్స్ సగానికిపైగా వున్నారు అసిస్టెంటు క్రిస్టియన్ గనుక, క్రిస్టియన్ కాండిడేటుకు కాన్వాసు మొదలుపెట్టింది అసిస్టెంటు ధనికవర్గాలకి ప్రతిబింబంగా వుంది హెచ్ ఎమ్ ప్రతినిధి"

పిల్లలు ఆలోచనలో పడ్డారు

"దేశపరిపాలన గురించి మీరు నేర్చుకున్నారు నేర్చుకుంటున్నారు. నాయకులను, ఉపనాయకులను ఎన్నుకోవటం నేర్చుకున్నారు.

ధైర్యం కలిగి, చక్కగా మాట్లాడ కలిగి, మీకు నాయకత్వం వహించగలిగిన పిల్లనే మీరు స్కూల్ పీపుల్ లీడర్‌గా ఎన్నుకుంటున్నారు. అలాగే బాగా చదివి, మంచి మార్కులు తెచ్చుకుంటున్న అమ్మాయిని క్లాసు మానేటర్‌గా ఎన్నుకుంటారు ఇవన్నీ ఎందుకు చేస్తున్నారు, మీచేత ఎన్నుకొనబడన నాయకుడు, మీ కనుగుణంగ నడుచుకుంటాడన్న నమ్మకంతో. అంటే దేశం రాజకీయంగ ఎలా నడుపబడుతుందో, మీరు స్కూల్లో నేర్చుకుంటున్నారు.

మనదేశం ఇపుడు ఎలాంటి పరిస్థితుల్లో వుందో, మనము మన హాస్టలు ద్వారా చూడవచ్చు మన నాయకులు స్వలాభం కోసం పార్టీలు మారుస్తారు అదేమంటే, మేము ప్రజలకోసం ఎన్నో చేశాము, ఫ్యాక్టరీలు కట్టించాము, ప్రాజెక్టులు కట్టించాము అంటారు గిరిజనులకు, హరిజనులకు ఇండ్లు కట్టించాము అంటారు ఆ ప్లాను క్రింద ఎన్ని లక్షలు ఖర్చు పెట్టారో దేవుడికే తెలుసు

ఒకసారి నేను ట్రైన్‌లో ప్రయాణం చేస్తున్నాను. అది వూరు కాదు, అడవి కాదు. దగ్గర్లో బస్‌స్టాండ్ కానీ, రైలుస్టేషన్ కానీ లేదు. అలాంటి ప్రదేశంలో, అగ్గిపెట్టెల్లా, క్రమంగ కొన్ని ఇండ్లు కట్టి వున్నాయి. అవి గిరిజనులకు అందులో ఏ ఒక్కరూ కాపురం లేరు ఆటవిక వాసులకు వారి గుడిసెలే నివాస యోగ్యంగ, భద్రమైనవిగా అనిపించి, వాటిని వదిలి రాలేదు, అంటే అంత బాగా కట్టారన్నమాట మనవాళ్లు.

హరిజనులకు ఇల్లు కట్టిస్తున్నారు. ఎక్కడ? ఊరికి దూరంగ ఊరిలో కట్టకూడదా? ఇలా ప్రశ్నించుకు పోతుంటే ఎన్నో ప్రశ్నలు పుడుతూనే వుంటాయి. అలా ప్రశ్నలు రాకుండా ఏం చెయ్యాలి?

"రాజ్యాంగాన్ని మార్చాలి. ప్రతి ఒక్కరికీ 'రోటీ కపడా ఔర్ మకాన్ వుండేలా చెయ్యాలి" అని పిల్లలు నినాదాలు చేశారు

"ఇష్ మెల్లగ "మన రాజ్యాంగం మార్చాలి అది బాగానే వుంది కాని రాజ్యాంగ యంత్రాన్ని సరిగా త్రిప్పేవాళ్లు లేరు ఎవరికి దొరికింది వాళ్ళు దోచుకుంటున్నారు అవినీతి, స్వార్థం, లంచగొండితనం పెరిగిపోయాయి ఎవరో ఒకరు పట్టుపడినా, ఒకరికి ఒకరు సపోర్టు వచ్చి, ఆపదనుంచి రక్షించి, తమలోకి లాగేసుకుంటారు, పెద్దమనుషులు ఆ వలయం అలా తిరుగుతూనే వుంటుంది మన నాయకులు ఎలా వున్నారో చెప్పనా? మా వూళ్ళో "

"మిస్— అన్నీ మీ ఊర్లోనేనా?"

"సరే— మీ ఊర్లో ఒక ఆఫీసర్ వున్నాడు. అతను తన డ్యూటీ ప్రకారం దొంగ రవాణా చేస్తున్నవారినో, లేక అలాంటి అవినీతి పనులు చేస్తున్న పెద్దమనుషుల్ని పట్టుకుంటాడు మరుసటిరోజే ఆ వూరి ఎమ్. ఎల్. ఎ నో, ప్రెసిడెంటో, లేక మంత్రిగారో రెకమండేషన్‌కు తీసుకు వస్తాడు, "హిహిహి తమ దయ" అంటూ ఇలా వారి ధర్మం వారు నెరవేర్చకపోగా, ఎక్కడో నూటికి కోటికి, సూటిగ తమ ఉద్యోగ ధర్మం నిర్వర్తిస్తున్న వారిని, అలా బ్రతకనీయరు.

అలాంటివారు మన ప్రతినిధులు. వారిని ఎన్నుకున్నది మనమే.

డబ్బున్నవాడు, ఓట్లు కొని నాయకుడౌతాడు. ఒకవేళ నాయకుడు దేశభక్తుడే అయినా, అతను అనుకున్నది చేయలేకపోతాడు. దుష్ట గ్రహాలు అడ్డురావటం వలన. పదవీ వ్యామోహంలో పడి, మనస్సాక్షిని అణగద్రొక్కేస్తాడు

పదవికి రాజీనామా ఇవ్వమని, అతన్ని ఎన్నుకున్న ప్రజలు గొంతు చించుకున్నా, పదవి వదలడు పైన అమ్మవారు రెడ్ లైట్ చూపిస్తేగానీ, దిగిరాడు. దీనికి కారణం ఎవ్వరు? మనమే.

మన స్వాతంత్ర్యపు హక్కును, వ్యక్తిత్వపు విలువను చాటేది 'ఓటు ఆ రెండక్షరాలు అక్షర లక్షలు చేస్తుంది దాని విలువను మనము గ్రహించలేక దుర్వినియోగం చేస్తున్నాము "

తన ఉపన్యాస ధోరణిని ఆపి, క్లాసును పరికించింది అజంత. పిల్లలు నిటారుగ కూర్చుని, యేకాగ్రతతో వింటూ, వింటున్నది జీర్ణం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నారు. వారిని చూసి, అర్ధవంతంగ నవ్వింది

బల్లమీదున్న, పుస్తకాలు సర్ది, చేతిలోకి తీసుకుంది

"మేడమ్— మీ ఉపన్యాసం ముగియలేదు పూర్తిచెయ్యండి" అన్నారు పిల్లలు ముక్తకంఠంతో.

"ఉపన్యాసాలు అప్పుడే ఎలా ముగిస్తాయి. రాజకీయాలు, పార్టీలు, ఓటు వున్నంతవరకూ వుంటాయి "

"ప్లీజ్ మిస్" అన్నారు పిల్లలు

మాధ్వి గ్లాసుతో మంచినీళ్లు తెచ్చిచ్చింది తనూ చిన్నపిల్లలా నవ్వుతూ గ్లాసు అందుకుంది

"మీరు ఎదిగే పిల్లలు. భారత రాజ్యాంగాన్ని చేపట్టేవారు మీ పిల్లలను తీర్చిదిద్దే తల్లులుగా, మీరు తెలుసుకోవలసినది ధనాన్ని గౌరవించే కన్నా, ధనం కన్నమిన్న అయిన మంచి బుద్ధిగలవారిని గౌరవించాలి అగ్ర జాతి, అగ్రకులాలు, గౌరవింపబడేవి, పూజింపబడేవి, ఎందుకని- వారు పండితులు, శాస్త్రాలను స్వంతం చేసుకున్నారు కనుక కాని ఈనాడు కులాల ప్రాముఖ్యతపోయింది చదువుకున్న ప్రతివాడు గౌరవింపతగినవాడు. కాబట్టి ప్రతి ఒక్కరూ చదువుకోవాలి

ధనం, రాజ్యం సంపాదించిన రాజులు ఏమి సందేశమిచ్చారో తెలుసు కదా. అశోకుడు బౌద్ధసన్యాసి అయ్యాడు క్రీస్తుకు పూర్వం ఆరవశతాబ్దంలో వున్న అలెగ్జాండరు తన మరణానికి ముందు ఏమని చెప్పాడంటే ."తన శరీరాన్ని స్మశానానికి తీసుకువెళ్లేటప్పుడు. అందరూ చూచేవిధంగ, తన రెండు చేతులను బయటపెట్టమన్నాడు". ఎందుకంటారా దేశదేశాలను కొల్లకొట్టి, రత్నాలను రాసులుగ పోసుకున్న అలెగ్జాండరు చక్రవర్తి పోయే

టప్పుడు వట్టిచేతులతో పోయాడని ప్రపంచమంతా తెలుసుకొనటానికి.''

''మేడమ్, పాపం స్వంత ఇంట్లో కూడ కాక అరణ్యంలో చని పోయాడు'' పెద్దగా నిట్టూర్చింది ఓ పిల్ల.

''ఎంత సంపాదించినా, జానెడుపొట్ట నింపుకోవటానికే'' మరోపిల్ల అంది

''ఆ - మేడమ్, ఎన్నిలక్షలు సంపాదించినా, ఆ జానెడుపొట్ట నింపు కొనని వారు గూడ వుంటారు ఉదాహరణకి సినిమాస్టార్లు, పాపం లావై పోతారని, కడుపునిండా తినకుండా, మజ్జిగత్రాగి పడుకుంటారట.'' ఓ సినిమా పిచ్చిపిల్ల వ్యాఖ్య

''సో విటమిన్లు తక్కువై కొందరు బాధపడుతుంటే, విటమిన్లు ఎక్కువై ఫాట్ పెరిగి, బాధపడువారు కొందరు ''

''సో మన ఓటును సద్వినియోగం చేసుకోండి'' మాధ్వి పూర్తి చేసింది. క్లాసంతా నవ్వింది

తిరిగి అజంత మొదలుపెట్టింది, ''మా ఊర్లో ''

''సారీ మేడమ్ మా ఊర్లో'' అంది మాధ్వి.

''సరే మీ ఊర్లో, ఎలక్షన్లు వచ్చాయి కూలీ, నాలీ చేసుకునేవాళ్ళు ఓటువేసే రోజు కూలికిపోరు వారి ఓటు విలువ తెలుసుకోలేక, ఎవరు ఎక్కువ డబ్బుఇస్తే వారికే తమ ఓటు, ఆ ప్రతినిధుల వాహనాలమీద వెళ్ళి వేసివస్తారు కూలీ నాలీ చెయ్యకుండానే, సులభంగ డబ్బు దొరికిందని, తప్ప త్రాగుతారు. ''పెతిరోజూ ఓటు చేయించుకుంటే బాగుంటుందిరా ఇంది రమ్మకీ, మా యమ్మకీ జై'' అంటారు మీరు మీ తల్లిదండ్రులకి చెప్పండి ఓటు విలువ ''

''మా పిల్లలకి మేడమ్-''

''ప్రతి పౌరుడు మంచివాడిని ఎన్నుకోవాలి కాన్వాసింగు చూసి మోసపోకూడదు మీరు ఓటువేసే వ్యక్తి విజ్ఞానవంతుడా, అతని వ్యక్తిగత జీవితం ఎలాంటిది? ప్రలోభిగా మారి పదవికి అమ్ముడుపోతాడా, దేశభక్తి, ప్రజాభిమానంగలవాడా? పొరుగువాని గాడిదను గానీ, స్త్రీనిగాని ఆశించే వ్యక్తా ఇవన్నీ ఆలోచించి, తగిన వ్యక్తికి మీ ఓటు వేయండి.

అలాంటి వ్యక్తి కానరాని రోజు, చదువులేని భూస్వామికంటే, ఎలి మెంటరీస్కూలు పంతులకే మీ ఓటు వేయటం ఉత్తమం.''

కరతాళధ్వనులు చేశారు పిల్లలు

''చివరిమాటగా ఒక్కటి చెపుతున్నాను, మీ కాలంలో కనీస విద్యా ర్హత వున్నవారికే ఓటు అన్న శాసనం తెస్తారని, ఎందుకంటే మీలో ఇందిరా

గాంధీలు వుండవచ్చు అన్న నమ్మకంతో, ఆశతో.''

''వన్స్‌మోర్ - వన్స్‌మోర్'' అన్నారు పిల్లలు హుషారుగ.

*　　*　　*

మహారాణిని ఎన్నికచేసే రోజు వచ్చింది. చివరి పీరియడ్ అసెంబ్లీ హాలులో చేరారు స్టాఫ్ అందరూ వచ్చారు.

స్కూల్ పీపుల్ లీడర్ లేచింది అధ్యక్షులను, సభలు అడ్రెస్ చేసి ''మహారాణి మాధ్విని పదవినుంచి తొలగించిన కారణం సబబుగా లేదని మా ఉద్దేశ్యం మహారాణి తన కర్తవ్యాన్ని, విధులను ఎన్నడూ మరిచిపోలేదు. మాధ్విపైన మాకు అంచంచల విశ్వాసం. పరీక్షలు దగ్గరకు వస్తున్నాయి. ఇప్పటికే కాలం వృధా అయిందని మా భావన స్కూలు తరఫున, హాస్టలు తరఫున మహారాణిగా మాధ్వినే ఎన్నుకున్నాం'' అని చెప్పి, ముగించింది.

చప్పట్లు ఎంతసేపటికి ఆగకపోతే, హెచ్. ఎమ్. పైకిలేచి, ''అవునా'' అని గద్దించి అడిగింది. పిల్లలందరూ చేతులు ఎత్తారు. అసిస్టెంటు హెచ్. ఎమ్ విసురుగా వెళ్ళిపోయింది, సభామర్యాదను పాటించక. ఇక హెచ్. ఎమ్. కు మాధ్విని అభినందించక తప్పలేదు

పిల్లలు ''మహారాణికీ జై'' అంటూ మాధ్విని ఎత్తేశారు.

''మహారాణీ- రాజ్యాంగ యంత్రం నీ చేతికిస్తే ఏమి చేస్తావు?'' అని ప్రతి పత్రికకు 'ఇది మీ పేజీ' అన్న శీర్షికకు వుత్తరాలు రాసే అలవాటు వున్న అమ్మాయి అడిగింది

క్షణం గుంపువైపు చూసి ''నాయకులను ప్రజా నాయకులగానే వుంచుతాను పదవులు ఇచ్చి పాడుచేయను'' అంది పిల్లలకు ఎంతవరకు అర్థం అయిందో కాని, అందరూ హ్యాఁర్రేరర్రే. అంటూ గోలచేశారు

పరీక్షలు ముగిశాయి రెక్కలు వచ్చిన పక్షుల్లా పిల్లలు ఇండ్లకు వెళ్ళసాగారు అజంతతో వచ్చిన మాధ్వి. టికెట్లు తీసుకోవటానికి వెళ్తున్న అజంతతో, ''నేనూ మీతో వస్తున్నాను'' అంది.

బుకింగ్ దగ్గర, ఆ ట్రైన్‌కు వెళ్ళే పిల్లలు మరి కొంతమంది వున్నారు సెకండ్ క్లాసు టికట్లు రెండుకొంటున్న అజంతతో, ''మేడమ్, ఫస్టు క్లాసు టికెట్లు కొనలేదేం?'' అంది ఒక అమ్మాయి.

''మిమ్మల్ని వదిలి నేనొక్కదాన్నీ అక్కడ కూర్చోనా?''

ఆ పిల్లల మనస్సులు ఆనందంతో నిండిపోయాయి ''ఈ అజంత మాది కూడాను'' అన్నట్లు మాధ్వివైపు చూశారు మాధ్వి పకపకమని నవ్వింది. 'అన్నాయ్! మనం అదృష్టవంతులం' అని తలచింది.

రైలు వచ్చింది. నిముషంలో సామాను సర్దేసి, చోటుచేసి అజంతను కూర్చోపెట్టారు. ట్రైన్ కదులుతుంటే, అనుగుణంగ క్లాప్స్ చేశారు. రైలు వేగాన్ని అందుకుంది.

అజంత ప్రక్కన కూర్చున్న మాధ్విని 'మమ్మల్ని కూర్చోనివ్వవోయ్" అంటూ "లె-లె-లె నా రాణి, లేవనంటావా, లేపమంటావా" పాటపాడుతూ లేపారు. నవ్వులు, కేరింతలతో కంపార్టుమెంటు కదిలిపోయింది.

ఆ పాట విన్నవారికి ఓ సంఘటన గుర్తుకొచ్చింది. సునందన, ఏ పాట రాగమైనా ఇట్టే పట్టేసేది. ఏ ఫంక్షన్కైనా సునందన పాట ఉండ వలసిందే. ఓ ఫంక్షన్కు డి ఓ. అధ్యక్షత వహించాడు. ఛీఫ్‌గెస్టు ఇంకా రాలేదు.

సునందన ఒకపాట తర్వాత మరొకటి పాడుతూ శ్రోతలను ఆనంద పరిచింది, అసిస్టెంటు ఒకపాట వ్రాసి పంపింది. ఆ పాట పాడటం ఇష్టంలేక పోయినా, అసిస్టెంటు కోరింది కదా అని పాడింది ఆ పాట విన్న గెస్టు ముఖాల్లో రంగులు మారాయి. చివర్లో సునందన స్వరాన్ని మెచ్చుకుంటూ, ఆ పాటమీద అయిష్టతను తెల్పారు మీటింగు జరుగుతుండగానే, హెచ్. ఎమ్. టీచర్లు సునందనని దులిపేశారు. 'అసిస్టెంటు కోరిన పాటది' అని చెప్పినా వినలేదు.

అంతమందిని ఆనందపరిచిన సునందన, వెక్కి-వెక్కి ఏడ్చి, ఆ రోజు కడుపు మాడ్చుకుంది. పిచ్చుకపై బ్రహ్మాస్త్రం ప్రయోగించిన అసిస్టెంటు తృప్తిగ నవ్వుకుంది

ఆ సంఘటన గుర్తొచ్చి, అమ్మాయిలు హాస్టల్‌ని, టీచర్స్‌ని బహి రంగంగా విమర్శించసాగారు. వారు పాడినపాట గుర్తుచేసుకున్నారు అజంత వారిని నెమ్మదిగ మందలించింది "మీరు మీ దేశాన్ని ప్రేమించినట్లుగ స్కూలును గౌరవించాలి. మీరు సంతోషించిన సమయాలు లేకపోలేదు. స్కూలుకు ప్రతి సంవత్సరం, అంత మంచి రిజల్ట్సు వస్తున్నాయంటే టీచర్సు పడే శ్రమ ఎంతో తెలియటంలేదూ? పైగా మీ మాటలన్నీ గాలిలో ప్రచారమవుతున్నాయి "

అమ్మాయిలు ముసిముసిగా నవ్వుకున్నారు.

"మేడమ్, మేడమ్, ఉత్తరం వ్రాస్తాము. రిప్లై ఇస్తారా" అని పదేపదే అడుగుతూ దిగిపోయేవాళ్ళు దిగిపోతున్నారు.

తమ స్టేషన్ రాగానే మాధ్వి, అజంత దిగారు. ట్రైన్‌లోని అమ్మాయిలకు జాగ్రత్తలు చెప్పి, ట్రైన్ కదిలేవరకు ప్లాట్‌ఫారమ్ మీదే వుండిపోయారు.

మాధ్వి హుషారు తగ్గిపోవటం చూసి, "క్రొత్తవూరని బెదురుగా వుందా, నేను - నీ అజంతను లేనూ" ప్రేమగా మాధ్వి భుజంపై చెయ్యి వేసి, తనకొరకు ఎవరైనా వచ్చారేమోనని చూసింది.

అల్లంత దూరంలోనున్న జట్కావాలా త్వర త్వరగవచ్చి సామాను అందుకున్నాడు జట్కాలో కూర్చుని, చివరకడ్డీ తగిలించారు. కారు రోడ్డు మీద జట్కాప్రయాణం బాగనేవుంది. కంకిరరోడ్డుకి తిరిగేటప్పటికి బండికి తలలు కొట్టుకున్నాయి.

"మన్సూర్ - మెల్లగ పోనీయ్" అంది అజంత.

"అచ్చా సాబ్"

చుట్టుప్రక్కల కొండలేగావి, దాపుల్లో ఏ వూరూ కనిపించలేదు.
"ఎంత దూరం?" అంది మాధ్వి

"ఓ మూడు మైళ్ళు వుంటుంది."

ఓ అర్ధమైలు వెళ్ళేసరికి, ఒక కారు దుమ్ము లేపుకుంటూ వచ్చి ఆగింది. జట్కా ఆపాడు జట్కాలోనుంచి దూకి "దిగు" అంది అజంత.
"ఎందుకూ?"

"కారు వచ్చిందిగా అందులో పోదాం"

"వాళ్ళు లిఫ్ట్ ఇస్తారా"

"ఇవ్వకపోతే తందాం.... రా "

బెరుగ్గా అజంత వెనుక నడుస్తూ, "మరి సామాను " అంది మాధ్వి.

"అతను తెస్తాడులే ఏం డ్రైవర్, మేము వస్తామని తెలియదూ?"

"తెలుసు మేడమ్, ట్రైన్ కరెక్టుగా వస్తుందనుకోలేదు" అన్నాడు నవ్వుతూ.

మాధ్విని చూస్తూ, "ఈ నల్ల అమ్మాయి ఎవ్వరూ?" అన్నాడు.

కళ్ళు పెద్దవిచేసి, "ఆఫ్టరాల్, డ్రైవర్‌కి ఎంత పొగరు?" అన్నట్లు మాధ్వి చూస్తుంటే, అజంత మెత్తగ నవ్వుతూ. "మాధ్వీ, ఈ డ్రైవర్ మా అన్న వట్టి అన్న, బంగారు అన్నయ్య కాదు" అంది.

"అదేంటి?"

"మాధ్వికి ఓ బంగారు అన్నయ్య వున్నారులే"

"ఐ సీ." కారు ముందుకు పోయింది

"సో! నోకి అన్నయ్య ఐ సీ అన్నమాట" మాధ్వి అజంత చెవిలో వూదింది.

నవ్వుతూ "ఒట్టి ఐ సీ కాదు. ఇంజనీరు అన్నయ్య. ఉద్యోగం

కొ_త్త హాళక్కి అయితే, టాక్సీ నడుపుతున్నాడు'' గుసగుసలాడింది అజంత.

''మీ గుసగుసలు వినటం అలవాటులేదు. ముగ్గురాడవాళ్లు లేరుగా, మీ రిద్దరు ఇలా గుసగుసలాడ్డానికి. వాక్ స్వాతంత్రం వున్నదని మరిచి పోయినట్లుంది. పార్లమెంటులో మాట్లాడినట్లు, నిర్భయంగ నా ముందు మాట్లాడవచ్చు ''

''అలాగే పార్లమెంటుగారూ'' అంది మాధ్వి

''అన్నయ్యా! మహారాణి మాధ్వితో మాట్లాడుతున్నావని గుర్తుం చుకో!''

''ఐ సీ '' కన్నులు పెద్దవిచేసి, 'మహారాణి మాధ్వి!' ఈ పేరు ఎక్కడా విన్నట్లులేదే! మాధ్వి అంటే...'' అన్నాడు

మాధ్వి, అజంతే ఒకరినొకరు చూసి నవ్వుకున్నారు.

''అంటే మాధ్వి'' మాధ్వి సమాధానం

''బాబోయ్ గడుసుపిల్ల'' అంటూ స్పీడు పెంచాడు. అతని మెడ పొడుగ్గా, దృఢంగా వుంది పలుచని చెంపలమీద వత్తుగా వున్నాయి మీసాలు. చెలియలి కట్ట దాటిరానట్లు మెడపైనే సడన్‌గా ఆగిపోయిన వత్తైన జుట్టు.

సైడ్ బరన్స్, మెడక్రిందుగ జుట్టుతో, 18వ శతాబ్దంలో పురుషులు ఎలా వుండేవారోగానీ, ఇపుడు మగవాళ్ళతో గంభీరమే లేదు ఆడతనం గోచరిస్తోంది. అందుకే అన్నయ్యను సైడ్ బరన్స్ పెట్టనివ్వలేదు.

అజంతకి అందమైన పొగరుమోతు అన్నయ్య ఉన్నట్లు మాధ్వికి తెలియదు అతని దగ్గరనుంచి ఉత్తరాలు వచ్చినట్లే లేదు ఎన్ని రోజుల తర్వాతో కలుసుకున్నా, అతి సామాన్యంగా, ఇపుడే ఏ బజారులోనో కలిసి నట్లున్నారు. అదే అన్నాయ్ అయితే, తనవైపు ఎంత ఆపేక్షగా చూస్తాడు. ఎన్నో ప్రశ్నలు వేస్తాడు చిక్కిపోయావు చెల్లెమ్మా అంటూ ముంగురులను సవరించినట్లు సవరిస్తూ, తలను ముద్దుపెట్టుకుంటాడు మాధ్వి ఆలోచనల్లో వుండగానే కారు ఇంటి ఆవరణలోకి వెళ్ళింది. అతను దిగి, కారు డోర్ తీస్తూ, ''సుస్వాగతం, మహారాణి మాధ్వి'' అంటూ తలవంచాడు. మాధ్వి కోపంగ చూసింది

కారు షెడ్డులో మూడు ఆటోలు వున్నాయి. ''స్టేషన్‌కి, ఊరికి దూరం. చుట్టుప్రక్కల పల్లెలకు ప్రయాణ సాధనాలుగ ఇవన్నీ పెట్టాడు. పాపం, గొడవపడుతున్నాడు'' అంది అజంత. రెండు స్థంభాలమీద నిల్చున్న వరండా, ఆర్చీలు, కనుబొమలు వంచి చూస్తున్నట్లుగా వుంది

ఆలోచనలో పడి వచ్చేప్పుడు గమనించనే లేదు. రోడ్డుకు అటువైపు కాలువ వుందని. ఉన్నట్లుండి చూసి, ''హాయ్'' అంటూ అటువైపుకు

పోతున్న మాధ్వివి ఆపింది అజంత. "సాయంకాలం వెళ్లి అడకోవచ్చు" అంటూ.

లోపలనుంచి వస్తున్న ఆమెను "అమ్మా" అంటూ మురిపెంగ పిలిచింది అజంత ఆమె చామనఛాయలో అతి మామూలుగా వుంది. విద్యా వంతురాలిలాగ కనుపించలేదు. మరి ఆమె సంతానానికి అంత అందం, విద్య ఎలా అబ్బాయో, అనుకుంటూ నమస్కారం చేసింది మాధ్వి.

"అమ్మా- మాధ్వి "

"మహారాణి కదూ! బాగున్నావా తల్లీ" ఆప్యాయంగ పలుకరిస్తూ సోఫాలో ప్రక్కన కూర్చోబెట్టుకుంది సౌభాగ్యమ్మ.

నాజూకైన తీరైన ముక్కు. దట్టమైన కనురెప్పల క్రింద చురుకైన కళ్లు. మాధ్విని చూసే కొలది, అందం ఇనుమడిస్తుందా అనిపించింది ఆమెకు. మాధ్వి చేతులు తడుముతూ. "చక్కగా వున్నావమ్మా" అంది. మాధ్వి చేతులు మృదువుగ, మెత్తటి సిల్కు గుడ్డను మరిపింపజేస్తున్నాయి

"వంట అయింది స్నానంచేసి వస్తారా? బాగా అలిసిపోయారు" అంది తన నంటి కూర్చున్న అజంతతో. మాధ్వికి క్రొత్తగా వుంది. గదివి పరికించి చూసింది. షోకేసుపై శ్రీ గంధంతో చెక్కిన రాధాకృష్ణుల, సరస్వతీ బొమ్మలు చూడముచ్చటగా వున్నాయి.

స్కూలు పిల్లలంతా కాళహస్త్రి కెళ్ళుతూ, 'మాధవీమాల' గ్రామాని కెళ్ళారు. అక్కడున్న కుటుంబాలన్నీ ఎర్రచందనం బొమ్మలు చేస్తారు. ఆ బొమ్మలు చూసి, వారి నైపుణ్యానికి ఆశ్చర్యపోయారు. శ్రీ గంధపు బొమ్మలు ఒక్కొక్కటి మూడువందలదాక చెప్పారు "అబ్బా" అన్నారు పిల్లరంతా. "ఏ ఫోటో ఇచ్చినా అలాగే చెక్కి ఇవ్వగలం" అన్నారు. అన్నాయ్ బొమ్మ చెక్కించాలనుకుంది మాధ్వి

'గోడలకు దశావతారాలు, ఫ్రేముచేసి తగిలించారు. బాగా డబ్బున్న వాళ్లలాగే వున్నారు అజంత ఎంత సింపుల్‌గవుంది. మెడలో ఓ బంగారు గొలుసు కూడ వేసుకోలేదు' అనుకుంది మాధ్వి

సౌభాగ్యమ్మ లోపలికివెళ్లి, పని పిల్లచేత కాఫీలు పంపింది

"అమ్మగారు, నేను పరిచయమున్నట్లే మాట్లాడారు" అంది మాధ్వి.

"అమ్మకి నమస్కారాలు వ్రాయమనే దానివి కదూ "

"నా విషయాలన్నీ వ్రాశారన్నమాట."

"నీ విషయం. మీ బంగారన్నయ్య విషయం కూడ

"మేడమ్ - మీ అమ్మగారిపేరు?"

"ఇపుడు మేడమ్‌ని కాదు."

"వదిన"

అజంత ముసిముసిగ నవ్వుతూ, "అమ్మ పేరు. సౌభాగ్యవతి" అంది.

మేడపైకి వెళ్ళారు. కొండల వరుసలు అతిచేరువలో కోటగోడల్లా వున్నాయి కొండలమీద సూర్యుడు మనోహరంగ నిల్చున్నాడు మాధ్వి అటూ ఇటూ పరుగెత్తి చూస్తుంటే, అజంత నవ్వుకుంటూ లోనికెళ్ళింది

కొండలక్రిందుగ ఇల్లు బాట కటువైపు చిన్నకాలువ ప్రవహిస్తున్నది. అవలివైపు ఏవో తోటలున్నట్లున్నాయి.

"ఇంత చక్కని ఇంటిని వదిలి ఆ హాస్టల్లో ఎలా వున్నారు?" అంది.

"ఏం? మీ ఇల్లు బాగోలేదా?" ఆ స్వరం విని, వెనక్కు తిరిగింది మాధ్వి

అతను - తలస్నానం చేసినట్లుంది తల తుడుచుకుంటున్నాడు. తెల్లని పైజామా, లాల్చీలో మెరుగుపెట్టిన బంగారంలా వున్నాడు అందగాడే అయినా అందమైన మనస్సు లేదనుకుంటూ, "అని ఎవ్వరు చెప్పారు" అంది.

"ఎవ్వరు చెప్పారబ్బా" తలగోక్కున్నాడు

"గోక్కుంటూ వుండండి" అని పరుగున వెళ్ళిపోయింది

"నల్లపిల్ల" తనలో తాను గొణుక్కుంటూ క్రిందకు వెళ్ళాడు

* * *

రెండో రోజు అజంత నాన్నగారు వెంకటపతిగారు వూరినుంచివస్తూ ఓ యువకుడ్ని వెంటబెట్టుకుని వచ్చారు ఎదురేగివచ్చిన సౌభాగ్యవతిని చూసి పలుకరింపగా నవ్వుతూ "మా ఆవిడోయ్" అన్నారు ఆ యువకుడు వినయంగ చేతులు జోడించాడు వెంకటపతిగారు సోఫాలో కూర్చుని, కండువా ప్రక్కనవుంచి, "అమ్మలు ఏది? ఇల్లు ప్రశాంతంగ వుందేం? కులాసాయేనా? అరె నీవు నిల్చునే వున్నావా భాగ్యం, నీవు కూర్చోకపోతే, అబ్బాయి కూర్చోడు " అన్నారు

ఆ వచ్చిన అబ్బాయిని చూస్తూ కూర్చుంది పొడగరే ఎండనపడి వచ్చాడు ముఖం ఎర్రగా అయింది అంతటి ఎర్రని పెదవులు అబ్బాయిలకు ఉండటం అరుదు. సిగరెట్ అలవాటు లేనట్లుంది సూటిగవున్న ముక్కు వెండిరూపాయిమీది జార్జిచక్రవర్తి ముక్కులావుంది కళ్ళు మరీ తెల్లగ, స్వచ్ఛంగ వున్నాయి ఆ చేతులు అవీ చూస్తుంటే, నీడపట్టున ఉద్యోగంగా కనుపిస్తున్నది ఆ అబ్బాయిప్రక్కన అజంతని ఊహించుకో ప్రయత్నిస్తుండగా, వెంకటపతిగారు.

"ఎవ్వరీ అబ్బాయి అని అడగవేం?"

"ఇంతకీ ఎవరనుకున్నావు? నా స్నేహితుడు సత్యనారాయణ లేడూ వాడి కొడుకు. తమాషాగా కలశాంలే? రైలు దిగి వస్తుంటే, ఈ అబ్బాయి నేరుగ నా దగ్గరికేవచ్చి, మన ఇంటి అడ్రెస్‌చెప్పి, ఎటుపోవాలి అని అడిగాడు" పెద్దగా నవ్వి "మనవాడి టుప్‌టుప్‌లో తీసుకువచ్చా."

"ఓహో! సత్యనారాయణగారి కొడుకా?" అని జ్ఞాపకం చేసుకో సాగింది

సత్యనారాయణ నీటైన మనిషే కాని నలుపు. అతనికి పుట్టేపిల్లలు నల్లగా వుండగూడదని ఏరికోరి పచ్చని ఛాయగల అమ్మాయిని చేసుకున్నాడు బంగారంలాంటి కొడుకుని కని గర్వంగ చూపించాడు పేకు వ్యాపారం నిమిత్తం తెలంగాణా ప్రాంతాలకి వెళ్ళిపోయాడు ఆ తర్వాత అతని సంగతి తెలియలేదు కాని బాగా సంపాదిస్తున్నాడని విన్నారు. తర్వాత కొన్ని సంవత్సరాలకి ఓ కార్డు వచ్చింది

"ఒరే వెంకట్, కూతురుపుట్టి నలుపులోవి అందాన్ని చూపించింది. నేనూ అందంగ వుంటానని ఇపుడు తెలిసింది"

ఆ ఉత్తరం చదివి పెద్దగా నవ్వుతూ, "భాగ్యం నీవూ నల్లటి పిల్లల్ని కనొచ్చు" అన్నారు

"అమ్మా, నాన్నా కులాసానా?"

"అమ్మలేదు, నాన్నగారు బాగున్నారు!" అన్నాడు అమ్మపోయిన నాటినుంచి విరక్తితో కాలం గడుపుతున్న తండ్రిని తలుచుకున్నాడు.

"అమ్మాయి పేరేంటి?"

"మాధ్వి"

లోనికి వెళ్తున్న సౌభాగ్యమ్మ ఆగిపోయింది. "ఏంటీ? మాధ్వి-సత్యనారాయణగారమ్మాయా?" అంది ఆశ్చర్యంగ, "టీచర్‌గారింటికి వెళ్తున్నాను అని అడ్రెస్ వ్రాసింది. ఎప్పుడూ అలా ఎక్కడికీ వెళ్ళేదికాదు. ఏమిటోనని..."

"అహ! ఇంటికి వచ్చిన క్షణంనుంచి ఇంట్లోవుంటేగా అలా తోట లోకివెళ్ళారు" చెప్తూతూ కాఫీ తీసుకురావటానికి లోపలికి వెళ్ళింది సౌభాగ్యమ్మ.

అది ఐదెకరాల నిమ్మతోట పేరుకు నిమ్మతోట అయినా, అనువైన జాగాలో అన్నిరకాల ఫలవృక్షాలున్నాయి బావిచుట్టూ పూలమొక్కలు, కూరగాయల పాదులు పెంచారు. పూలమొక్కల మధ్య సన్నజాజితీగ గొడుగులా అల్లించి, క్రింద సిమెంటు చప్టా వేయించారు దానిపై కూర్చున్న అజంత కనకాంబరాలు, సన్నజాజులు మాల అల్లుతూంది మరి కొంతదూరంలో గుల్ మొహర్ కొమ్మకు ఊయలకట్టి ఊగుతుంది మాధ్వి.

బావిలోని పంపుద్వారా నీళ్ళు దడదడమని తొట్టిలోకి పడుతున్నాయి

చెట్ల సందునుంచి ఆకాశం మరీ నీలంగ కనుపించింది. ఊయలతోపాటు ఆకాశం కూడా వూగుతున్నట్లనిపించింది. చదువుకి స్వస్తిచెప్పి ఈ తోటలో వుండి పోవాలనిపించింది మాధ్వికి. అజంతవైపు చూపింది. వదిలిన వెంట్రుకలు అలలలగా బుజాలక్రిందుగా జారి, గాలికి ఎగురుతున్నవి చెవిదగ్గర మెట్టతామరపువ్వునుమాసి, "మేడమ్! మీరు దివినుండి భువికి విహారానికొచ్చిన గంధర్వకన్యలా వున్నారు" అంది మాధ్వి

అజంత మాధ్వివైపు చూపింది. విరబోసుకున్న మాధ్వికేశాలు ఊయలపీట క్రిందుగా వ్రేలాడుతూ, మబ్బుతెర కదిలివస్తున్నట్లుగా వుంది.

తెలుపు జెర్సి లంగ, గులాబీరంగు వోణిలో నీలిరంగు వింతగ మెరుస్తుంటే "మాధ్వి నన్ను పొగడ్డం మానేసి కాసేపు నీవు వెళ్ళి ఆ నీటిలో నిన్ను చూసుకో"

"ఎంతయినా నల్లపిల్లను" దిగులుగ అంది. "మీ అన్నగారు, మహ ఆయనే గనుక తెల్లగవున్నాడని, మాటిమాటికి "నల్లపిల్ల, నల్లపిల్ల" అంటున్నాడు మీ అన్నయ్య అని వూరుకున్నా, లేకుంటేనా " అని అంటూనే, ఊయలదిగి, లంగా అంచులు పట్టుకుని "అన్నాయ్, అన్నాయ్" అంటూ గెంతులు వేయసాగింది

"ఆ అమ్మాయికి ఏగాలో సోకలేదు కదా" అనుకుంటూ భీతిగ ఆ వైపుకు తిరిగింది. అజంత వెంకటపతిగారి ప్రక్కనవస్తున్న అబ్బాయిని చూపి, "ఆ ట్టిపో...మీ అన్నయ్యా?" అంది గెంతుతూనే, "బంగారన్నయ్య పొట్టికాదు ఇండియన్ నార్మల్ హైటు హాయ్ హాయ్" అంది. దగ్గరైన విపుల్ మీదకు "అన్నాయ్" అంటూ వురికింది హృదయానికి చేరువైన మాధ్వి చెంపలపై ముద్దుపెట్టుకుంటూ, పూలమాలను గుండెకు చేర్చుకుని, కన్నార్పక చూస్తున్న అజంత తొలిచూపులో చూపు కలిపాడు

"నార్లవార్ల కన్యకలందరినిచేర్చి, అజంతగా చెక్కాడా భగవంతుడు" అని తలచాడు విపుల్. కూతుర్ని మక్కువగ చూస్తూ, "ఏం తల్లీ!" అని పలుకరించారు వెంకటపతి,

"అంతా సత్యనారాయణపోలికే, ఏమ్మా కోడలా?" మాధ్వి తలమీద చెయ్యివుంచి వూపారు

అర్థం చేసుకోలేనట్లు చూసింది మాధ్వి.

"అన్నాయ్, మా మేడమ్ అజంత" అని చెప్పింది.

"నమస్తే!"

"నమస్తే!"

"'అబ్బాయ్! నాకీరోజు చాల ఆనందంగ వుంద''న్నారు వెంకటపతి

గారు. పెద్దయ్యగారిని చూసి పరుగెత్తుకువచ్చిన పాలేరుని చూసి, "ఏమోయ్. నిమ్మకాయలు మండీకి వేయలేదూ" అంటూ ఆ వైపుకు వెళ్ళారు

మాధ్వీ, విపుల్‌చెయ్యి వూపేస్తూ, "అన్నాయ్, ఎలావుంది నీ సింఘాల్ బొమ్మ!"

విపుల్ చిరుదరహాసంతో "నీవు నచ్చావు" అన్నట్లుగ అజంత వైపు చూశాడు.

చెంపలు ఎరుపెక్కగా చూపులు క్రిందకు వాల్చింది. సిగ్గు ఒక అలంకారమే అని తలచాడు చొరవచేసి ఒక్క మాటైనా మాట్లాడలేదు.

'పెళ్ళి కొడుకులా ఆ సిగ్గేంటి, ఏదైనా మాట్లాడక' అనుకుంది అజంత

మాధ్వికి చెరొక ప్రక్క నడుస్తూ ఇంటికి వెళ్ళారు.

"నాన్న ఎలా వున్నారన్నాయ్."

"నీవు రాకపోయేసరికి నన్ను పంపారు గాభరాగా వున్నారు."

ఉన్నట్లుండి అజంతవైపు తిరిగి, "అన్నయ్య నచ్చాడా!" అంది మాధ్వి మెల్లగ

"లేదు" అన్నట్లుగా తల త్రిప్పింది.

"ఏయ్ దొంగా కాదంటే అవుననేగా "

"చెల్లెమ్మా! మీ మిస్‌కి మాటలు రావా?"

"మాట్లాడి చూడన్నాయ్ "

అజంత ఫక్కుమని నవ్వింది. ముత్యాల్లాంటి పలువరస తళుక్కుమంది.

విపుల్ స్నానంచేసి, నల్ల టెర్లిన్‌పాంట్‌లో పచ్చగళ్ల షర్ట్ టక్‌చేసి. చేతులు మడచుకుంటూ బయటకు వచ్చాడు

వంకీలు అమర్చి దువ్వుకున్నట్లున్న క్రాఫ్, గాలిలో తేలివస్తున్న సెంటుపరిమళాన్ని చూసి, "ఎవ్వరీ స్వయంవరం పురుషుడు" అనుకున్నాడు. ఎదురుగ వస్తు సిద్ధార్థ

నవ్వు ముఖంతో "మీరూ," అని పలుకరించాడు.

"నేను - నేను మాధ్వి అన్నయ్యను" అని నవ్వాడు.

"ఐసీ - బంగారన్నయ్యవా" చెయ్యి ముందుకు చాచి

"నేను అజంతా అన్నయ్య, సిద్ధార్థను బంగారం మాత్రం కాదు."

చాచిన చేతిని ఆప్యాయంగ అందుకుని షేక్‌చేసి వదిలాడు విపుల్.

"ఎక్కడికైనా వెళ్తున్నారా?"

"ఎక్కడికీ లేదు" అన్నాడు విపుల్.

బాల్కనీలోకివెళ్ళి కూర్చున్నారు విపుల్ లెక్చరర్‌గా వర్క్ చేస్తు న్నట్లు తెలుసుకొని, దొరికిన ఉద్యోగం దొరికినట్లే వూడిపోతే, బిజినెస్‌లోకి ఎలా దిగింది. సిద్ధార్థ చెప్పాడు.

ఒకరిమీద ఒకరికి మంచి అభిప్రాయం కలిగింది. భోజనాల దగ్గర అందరూ కలుసుకున్నారు.

"వాడ్నిగూడ రమ్మని వ్రాస్తాను. అడ్రెస్ చెప్పు బాబూ!" అన్నారు వెంకటపతిగారు

విపుల్ మధ్యమధ్య అజంతను చూస్తూనే వున్నాడు. 'అలా చూడ కుండ, ఏదైన మాటాడిస్తే బాగుండు ఈ మౌనం మరీ సిగ్గుగవుంది. స్నేహంగ మాటాడకూడదూ, ఎవరో పిలిచి పిల్లనిస్తున్నట్లు, ఆ పిల్లను చూపుల్తో చదివేస్తున్నట్లు ఏమిటా చూపు' అన్నట్లుగ చూసింది

మరి కళ్లెత్తి చూడలేదు విపుల్. లోలోన నవ్వుకుంది అజంత

ఒక కూర తర్వాత మరొకటి వేసుకుంటూ, ఆ వంటకాల రుచిని ప్రశంసిస్తూ, గలగల మాట్లాడుతూ, నవ్వుతూ, అందరినీ నవ్విస్తున్న మాధ్వి పెరుగు వేసుకుంటుంటే, "వుహూ- మాకు ఏమైనా మిగిలిందా?" అన్నాడు సిద్ధార్థ.

"ఆ మిగిలింది మజ్జిగ పులుసు, వేసుకుంటావా నాయనా!" అంది.

అందరూ గొల్లుమన్నారు

"అమ్మా- నీకేమైనా మిగిలిందో లేదో" అన్నాడు జాలిగ

"అమ్మలకి మిగిలేది అడుగు బుడగే, అమ్మా మీ పార్లమెంటు గారిని, సారి బుద్ధావతరాన్ని వెరీవెరీ సారి మీ సిద్ధార్థని మా హాస్టలుకి పంపండి. మూడో రోజు ఇంటికి వచ్చి, ఈ విస్తరాకుని కూడ తినకపోతే నా పేరు మాధ్వి కాదు"

"వూరుకో బాబు- ఎదిగే పిల్లలు తినకపోతే మనం తింటామా! వాడి మాటలు పట్టించుకోకు."

"మా వృద్ధనారి దగ్గరున్న వాళ్ళకి ఈ మాటలన్నీ ఓ లెక్కలేదు. నాకు దిష్టి తగులుతుందని భయపడేరు."

"అంతా వాడిమాటలే సత్యనారాయణ నోటినుంచి వూడిపడింది" వెంకటపతి అన్నారు

చాల రోజులకి ఇంట్లో సందడిగ వుంది. తృప్తిగ తిని లేచారు

సౌభాగ్యమ్మ తింటుంటే, దగ్గర కూర్చుని కూర వడ్డిస్తూ, "నిజంగానే అడుగు మిగిలిందే" అంది మాధ్వి

"అన్నీ అలాగే మిగిలిపోయాయి చూడు" అని వేరే గిన్నెలు

చూపించింది.

"హోస్టలు తిండి తిని తిని రుచి మర్చిపోయాను. అన్ని కూరలు ఒకటే రుచి. సాంబారుకి, వేపుడు కూరలకి తేడా వుండదు. మరి ఆ స్టయిల్, ఆ నేర్పు ఎక్కడ సంపాదించారో" కాస్సేపు ఆగి, "వండుతూ వండుతూ నిమ్మకాయ రసం పిండినట్లు నుదుటిమీద చెమటను కూరల్లో వేస్తుంటాడు వంటవాడు."

"అయ్యో, అయ్యో" అంది సౌభాగ్యమ్మ.

ఆ మాటకే ముఖం వికారంగ చేసుకుంటుంటే, మాధ్వి మరో మాట చెప్పింది.

"మా అసిస్టెంటు హెచ్ ఎమ్ శుభ్రంగ కూరల్లో మంచివి తీసుకొని వేరుగ వండించుకుంటుంది. ఆ వంటవాడు ఏం చేస్తాడో తెలుసా– మాంసం ముక్కల్లో బోన్‌మారే- అదే మూలగను తీసి జుర్రుకొని మరలా ఎప్పటిలా కూరల్లో వేసేస్తాడు కరిగిపోయింది కానోలు అనుకుని దానిని పీల్చుతుంది అసిస్టెంటు

సౌభాగ్యమ్మ అన్నం కలపడం మానేసింది

మాధ్వి నవ్వుతూ, 'ఆ వంటవాడ్ని కోస్తే ఒక వూరంతటికి సరిపోతుంది' అని మా వృద్ధనారి తిడుతుంది వాడ్ని. అంత లావు వుంటాడన్న మాట

"నాకు చెప్పకు తల్లీ" అని భోజనం దగ్గరనుండి లేచింది

"అరె! భోజనం చేయండి" అంది మాధ్వి.

అంతలో "మాధ్వి" అని పిలిచింది అజంత.

"మిస్- అమ్మగారు నా మాటలకే భోజనం మానేశారు మా అన్నంలో బొద్దింకలు చూస్తే "

యాక్ అని వాంతి చేసుకోబోయింది సౌభాగ్యమ్మ. అజంత నవ్వకుండ వుండలేకపోయింది.

పకపక నవ్వుకుంటూ వెళ్తున్న వారిని చూసి, ఆమె కూడ నవ్వింది.

పదిగంటలవరకు వంటగది సర్దుతూ, వంటమనిషికి ప్రొద్దున్నే ఏం చేయాలో చెప్పుతూ వుండిపోయింది

"అమ్మా" అంటూ వచ్చింది మాధ్వి.

"ఏమ్మా!"

"వేడినీళ్లు కావాలి. మిస్‌కు కడుపునొప్పి వచ్చింది" అజంత కడుపునొప్పి సంగతి గుర్తుకు రాగానే, ఆమె ముఖం వివర్ణమైంది.

"నీవు వెళ్లు తల్లీ, నేను తెస్తాను" అంటూ మాధ్విని పంపేసింది.

స్టౌవ్ వెలిగించి, నీళ్లు కాచి, వేడినీళ్ళ సంచిలో పోసుకుని, అజంత గదికి వెళ్ళేవరకు ఆలోచిస్తూనే వుంది.

అజంతకు నిద్రపట్టేంతవరకు వుండి, తిరిగి వచ్చింది. చుట్టపొగ పీల్చి, వెల్లకిలా పడుకుని, శరీరానికి పూర్తి విశ్రాంతి నిస్తున్న భర్త దగ్గరకు వచ్చి నిల్చుంది. ఆలోచిస్తూ తన దగ్గరనున్న భార్యను చూసి మీసాల చాటున నవ్వారు. కాళ్ళదగ్గర కూర్చుని, "అమ్మాయికి మరల కడుపునొప్పి వచ్చింది. ఈ మధ్య చాలాసార్లు వచ్చినట్లుంది "

ఆయన ఏమీ మాట్లాడక పోయేసరికి తిరిగి చెప్పింది. "మన డాక్టరు చెప్పారు అలాంటి నొప్పి వస్తున్న వారికి పెండ్లి కాగానే పోతుందట. చదువు ముగిసింది. ఇక అడ్డు ఏమిటి?"

వెంకటపతి తలక్రింద చెయ్యి చేర్చుకుని, సాలోచనగా భార్యవైపు చూస్తూ, "విపుల్-మాధ్వి అన్న ఎలా వుంటాడంటావు?"

"ఆ అబ్బాయికేం బంగారంలా వున్నాడు. బుద్ధిమంతుడు, మీ స్నేహితుని కొడుకు. అమ్మాయికి కూడ ఇష్టంలాగే వుంది."

"సరే- నీవు అమ్మాయిని అడిగి తెలుసుకో. నేను అబ్బాయితో మాట్లాడుతాను" ప్రక్కకు తిరిగి కళ్లు మూసుకున్నారు

మరొకసారి అజంత నిద్రపోయిందో లేదోనని వెళ్ళిచూసి, దుప్పటి సరిచేసి, బెడ్‌లైట్ వేసి, భగవంతుని స్మరించి, భర్త ప్రక్కనే చోటు చేసుకొని పడుకుంది.

* * *

కిటికీలోనుంచి వచ్చిన చల్లటిగాలి ముఖానికి తగిలింది మాధ్వి కళ్లు విప్పింది సెలవుల్లో ప్రొద్దు పొడిచాక నిద్రలేవాలనుకున్నా అలవాటుప్రకారం అయిదుగంటలకే మెలకువ వస్తుంది అజంత, మత్తుగ పడుకుని వుంది. నెమ్మదిగ లేచి టెర్రస్ మీదకు వచ్చి నిల్చుంది పొయ్యిమీద పాలు ఒలికినట్లు తెల్లగా వుంది తూర్పు దిక్కు. రాచుకొని రాచుకొని మండుతున్నట్లు కొండల వెనుక అరుణిమ పైకి ప్రాకుతూంది. దానికి వ్యతిరేకంగ పశ్చిమాకాశాన నీలికొండలు చల్లగా నున్నాయి. పలుచని దేవతావస్త్రం ఆ కొండలపై పరచినట్లుంది ఆ కొండల మీదనుంచి వచ్చే పిల్లగాలులు మాధ్విని చక్కిలిగింతలు పెట్టసాగాయి. పైట చెవులమీదకు తీసుకుంది. ఇసుకలో మడులుచేసి, నాటిన కర్బూజ తీగలు అక్కడ నీటిగుంటలు వున్నట్లు భ్రమింప చేస్తున్నాయి. పుట్టనివాళ్లు, చనిపోయిన వాళ్లు ఈ చక్కని దృశ్యాలు చూడలేదు కదా!

ఈ తోట, ఈ ఇల్లు తనకెంతో నచ్చాయి. ఇంటి యజమానులు సహృదయులు. అజంత వదిన కాబోతున్నది. ప్రతి సెలవులు ఇక్కడే

గడపాలి. ప్రతిఏటా ఎండిన నదిపాయల్లో కర్‌బూజ పంట పండిస్తారట. తనూ ఈ ఇంటి ఎదుట స్థలంలో పండించాలి. తన ఆలోచనలు ఎవరైన పసిగట్టారేమో నన్నట్లు ఆలోచనను ఆపి సూర్యోదయాన్ని చూసింది. అన్నయ్య గుర్తుకువచ్చినట్లు పరుగున ప్రక్క గదిలోకి వెళ్ళింది.

మధురానుభూతులతో విపుల్‌కి ఆ రాత్రి నిద్ర దూరమయింది. మాధ్వి వెళ్ళేటప్పటికి స్నానాదులు ముగించుకొని కుర్చీలో కూర్చుని వున్నాడు.

"అరే అపుడే నిద్రలేవటం, స్నానం చేయటం అయిపోయాయా?" అంది.

"క్రొత్తస్థలం కదూ. త్వరగానే మెలకువవచ్చింది. నీవూ రెడీ అవ్వు. పదిగంటలకి ట్రైన్ వుంది"

"అప్పుడే వెళ్ళిపోవాలా."

"అన్నయ్యని వదిలి, మీ అజంతాసుందరిదగ్గరే వుండిపోతావా?"

"మరొక్క రోజు వుందాం అన్నాయ్. వదిన ఇంకా లేవలేదు. రాత్రి పాపం కడుపునొప్పికూడ వచ్చింది."

"అరే " సానుభూతి చూపించే లోపల వెంకటపతిగారు లోనికి వస్తూ, "ఏమిటోయ్, అన్నా చెల్లెళ్ళు ఏదో మాట్లాడుతున్నారు" అన్నారు.

కుర్చీలోంచి లేచి, ఆయనకి కుర్చీఇచ్చి, తాను మంచంపై కూర్చుని, "పదిగంటలకు ట్రైన్‌వుంది. వెళ్దాం అని..."

"అపుడే ఇంటి అడ్రెస్ ఇవ్వు, వాడిని తీసుకువస్తాను ఏం కోడలా కాఫీ త్రాగావా?"

"లేదు" అన్నట్లు తలూపింది.

"విపుల్ మా అమ్మాయిని మీ ఇంటికితీసుకొని పోతావా? నీ కిష్ట మేనా?" ఏ విషయమైనా సూటిగ మాట్లాడ్డం వెంకటపతిగారికి అలవాటు.

అర్థం చేసుకున్న విపుల్‌ముఖం సంతోషంతో విప్పారింది. సూటిగ జవాబు చెప్పలేక మాధ్విపైపు చూశాడు.

"చెల్లి పర్మిషన్ కావాలా. ఏమ్మా కోడలా, మీ టీచరు నీకు వదినయితే ఎలా వుంటుంది?"

"అన్నాయ్" అంటూ విపుల్ మెడమీద చేతులువేసి వూపేస్తూ "భలే బాగుంటుందన్నాయ్" అంది.

"వారిని కూడ అడగండి" అన్నాడు విపుల్.

"మిస్‌కా, ఇష్టమే అన్నాయ్" అంది మాధ్వి.

"వూరుకో" అన్నట్లు కళ్ళు పెద్దవిచేసి చూస్తుంటే "నిజంగానే ఇష్టం అన్నాయ్" అంది. పకపక నవ్వారు వెంకటపతిగారు. విపుల్ కూడ

నవ్వేశాడు.

ఈ శుభవార్త అజంతకి అందిరిచాలని పరుగుపెట్టింది వాష్‌బేసిన్ దగ్గర గడ్డం గీసుకుంటూ, "అబ్బా! అమ్మాయికి పరుగులే కాని నడకరాదా?" అన్నాడు సిద్ధార్థ

చెంపలచుట్టూ, ముక్కుమీద షేవింగుక్రీమ్‌లో బఫూన్‌లావున్న సిద్ధార్థనిచూసి నవ్వేస్తూ "చూడండి బఫూన్‌గారూ సారీ, వెరీసారీ సిద్ధార్థ గారూ' అంటూ జడవెనక్కి విసిరి, లెఫ్ట్‌రైట్ - లెఫ్ట్‌రైట్ కొట్టుతూ వెళ్లింది.

"నల్లపిల్ల" మాధ్విని ఉడికించాలని అన్నాడు

"ఎర్రకోతి" అని వెక్కిరించింది.

అంతమాట అంటుందని అనుకోని సిద్ధార్థ నివ్వెరపోయాడు.

సీరసంగ వస్తున్న అజంతను చుట్టేసి గిరగిర త్రిప్పించి "వదినా, వదినా" అంటూ

* * *

తిరుచానూరు కళ్యాణ మంటపంలో పెళ్ళి చేసేందుకు నిశ్చయించారు. బంధుమిత్రులు బస్సులలో వెళ్ళారు. పెళ్లివారు రెండు కార్లలో బయలుదేరారు.

ఒక కారులో విపుల్, నాన్నగారు, వెంకటపతిగారు. సిద్ధార్థ డ్రైవ్ చేస్తున్న కారులో సౌభాగ్యమ్మ, అజంత, మాధ్వి వున్నారు

దారిలో వచ్చే కార్లతో పోటీ వెయ్యమని ఒకటే తొందర మాధ్విది.

"అసలే వాడు కోతి నీవు హుషారు చేశావంటే " సౌభాగ్యమ్మ నచ్చచెప్పింది.

అద్దంలోనుంచి సిద్ధార్థని చూసి నవ్వింది మాధ్వి.

రైల్వే గేటు వేశారు. విపుల్ కొట్టుదగ్గరనుంచి డ్రింక్స్ పట్టు కొచ్చాడు అందిస్తూ అజంతవైపు 'ఇక కొన్నిగంటల్లో నా దానివై పోతా వ'న్నట్లుగా చూశాడు.

డబ్బాలో లడ్డు అందుకుని తినసాగింది మాధ్వి.

"ఎప్పుడూ ఏదో ఒకటి నెమరు వేయవలసిందేనా?"

"నేను తింటున్నారని ఇదవ్వకపోతే, మీరూ తినకూడదూ" నోట్లో లడ్డుంచుకునే మాట్లాడుతూ, రెండు లడ్లు సిద్ధార్థ చేతిలో వుంచింది.

"దేనికో ఒకదానికి వాదనలు. చిన్నదానితో ఏమిట్రా" అంది సౌభాగ్యమ్మ.

"పెద్దవాడ్నని ఏమైన వూరుకుంటుందా- ఈ నల్లపిల్లకి పెళ్ళి ఎప్పుడు చేసి పంపిస్తావయ్యా" విపుల్‌తో అన్నాడు.

"పెద్దవారు. ముందు మీ పెళ్ళి కానివ్వండి. కదన్నయ్యా" అంది మాధ్వి.

"ఎలాంటివాడు దొరుకుతాడో పాపం!"

"మహారాణికేమిరా. అందమైన చక్రవర్తి దొరుకుతాడు" మక్కువగా మాధ్వి తల నిమురుతూ అంది సౌభాగ్యమ్మ

తన రెండు చేతులు కలిపి, రేఖలు చూస్తూ "అవును! ఈ పై రేఖలు రెండూ అర్ధచంద్రాకారంగ వుంటే అందమైన మొగుడు వస్తాడు" అంది. సిద్ధార్థ కళ్ళు పెద్దవి చేశాడు.

సౌభాగ్యమ్మ పకపక నవ్వింది "ఏం పిల్లరా" అంటూ మాధ్వి ఇక ఊర్చోలేక రెండు లడ్లు పట్టుకొని ఒకటి నాన్నకి, ఇంకొకటి వెంకటపతి గారికి ఇచ్చింది "డ్రింక్ తీసుకున్నారా?" అని పరామర్శించింది.

సత్యనారాయణ భార్యని తలచుకోని క్షణం వుండదు. ఈ బాంధవ్యాలు, ప్రేమలు అశాశ్వతము. అందుకే వాటికి దూరంగ వుండాలని ప్రయత్నిస్తాడు. తండ్రిగా పిల్లల్ని ఆదరించలేకపోగా, వాళ్ళే తనని ఎంతో జాగ్రత్తగా చూసుకుంటున్నారు. మమతతో కట్టేసి వుంచారు లేకుంటే ఏ మఠంలోనో వుండేవాడు. చిన్న తల్లి పెళ్ళికాగానే ఏ ఆశ్రమంలోనో కాలం గడపాలని నిశ్చయించుకున్నాడు.

రైలు వెళ్ళింది, గేటు తీశారు. వాహనాలు బయలుదేరాయి తిరుచానూరు చేరుకుని, రిజర్వు చేసుకున్న కాటేజిలో దిగారు

బంధుమిత్రులతో కాటేజి గొడవగా వుంది పందిట్లో గాడ్రేజ్ కుర్చీలో కూర్చొని భావనా ప్రపంచంలోకి వెళ్ళాడు విపుల్ 'ఎందుకీ పెళ్లి తంతు ప్రాణసంకటమైన ఆచారాలు ఎందుకు వచ్చాయి. అట్టహాసంగ బాజా బజంత్రీలతో, పురోహితుడు చదువుతున్న అర్ధంకాని మంత్రాలు వింటూ, అతను చెప్పినట్లు చెయ్యటం? విపుల్‌కిది ఏ మాత్రమూ ఇష్టంలేదు. మనసుకు నచ్చిన ప్రియసఖిని స్వంతము చేసుకొని, ఏవో దూరతీరాలకు వెళ్ళిపోతే ఎలా వుంటుంది? ఆ బంగారు కాలం వస్తుందా? ఇక మున్ముందు తరాలకైనా ఆ అవకాశం ఇవ్వాలి ఆ తలపే ఎంతో మధురంగ వుంది విపుల్‌కి.

తల్లిగా అజంత ఎలా వుంటుంది? అజంతకి పుట్టిన పిల్లలు అద్భుతంగ వుంటారు. ఆ సాయం సమయం మరీ అందంగ కనుపించింది విపుల్‌కి.

ఆ సాయంకాలానికి మెరుగులు దిద్దుతున్నట్లు ఓ అరడజను అమ్మాయిలు అటుగా వచ్చారు. అమ్మవారి గుడినుంచి వస్తున్నట్లు అందరి చేతుల్లో కొబ్బరి గిన్నెలు వున్నాయి. విపుల్ కళ్లు వాళ్ళని చూస్తున్నా, గమనించే శక్తిని కోల్పోయాయి. అతని కళ్ళకి అజంత మాత్రమే కనిపిస్తూ వుంది.

అతని వెనుకనున్న సిద్ధార్థ సిగరెట్ పీలుస్తూ, చుక్కల్లో చంద్రునిలా వున్న అమ్మాయిని చూస్తూ సన్నగా ఈలవేశాడు పలకరింపుగ చెదిరిన క్రాఫ్, నలిగిన బట్టల్లో వున్న సిద్ధార్ధను చూపి "ఎవ్వరోయ్ ఈ విలన్?" అన్నది ఓ గడుసుపిల్ల

"మనకి చుట్టమేమో" అంది మరొకపిల్ల

రసజ్ఞ "ఆ విలన్ ప్రక్కన మన మాస్టారు" కేకవేసినట్లు పలికింది.

"మాస్టారూ" అంటూ సిద్ధార్ధని తోసుకొని విపుల్‌ని చుట్టేశారు ఆ విద్యార్థినులు

వాత్సల్యంగ నవ్వాడు విపుల్, వారిని చూసి

"కంగ్రాచ్యులేషన్స్ మీ పెండ్లిపిలుపు విని మన డిపార్టుమెంటు అంతా వచ్చాము" చంద్రిమలా వున్న 'రసజ్ఞ' అంది

"అందరూ ఎక్కడ వున్నారు ఇక్కడికే వచ్చెయ్యండి" అన్నాడు విపుల్ ఇంకేమనాలో తెలియక

రసజ్ఞ ఒక అమ్మాయికి సైగచేసింది

"మాస్టారూ! మీ శ్రీమతిని మాకు చూపించరూ" అంది ఆ అమ్మాయి.

విపుల్ సిద్ధార్థవైపు చూశాడు 'ఆ బాధ నీవే పడమన్నట్లు' అక్కడ నుంచి వెళ్ళిపోయాడు సిద్ధార్థ

ఇక తప్పదన్నట్లుగ, అజంత ఏ గదిలో వుందో వెతుకుతూ వెళ్ళాడు. అజంత అలసిపోయినట్లు చాపమీద పడుకుని వుంది తన తలపులన్నీ ఒక చోట కేంద్రీకరించినట్లు ద్వారంలో విపుల్‌ని చూసి లేచికూర్చుంది చిగురాకులా వున్న పెదవిని నొక్కిపట్టి ప్రశ్నార్థకంగ చూసింది వచ్చిన పని మర్చిపోయినట్లు నిల్చున్నాడు వెనుకనున్న స్టూడెంట్సు "మాస్టారూ" అని గొడవ చేశారు వారికి దారి ఇచ్చి. "నా స్టూడెంట్సు" అని చెప్పి, తప్పుకున్నాడు నమస్కారం చేసి, చాపమీద చోటుచేసి కూర్చున్నారు.

రసజ్ఞ మాత్రం బయటకు వచ్చింది ఇన్నాళ్ళూ చంద్రునికి వీనస్‌లా చేరువగ, మాస్టారి దగ్గరే వుండేది తనని కాదని, ఈ పంతులమ్మని చేపట్టాడు దాచుకోలేని ఈర్ష్య కలుగగా, క్షణం కూడ అక్కడ వుండలేనట్లు బయటకు విపుల్ వెంట వచ్చింది ఇంతసేపూ తను ఆపుకున్న ఉక్రోషం, వ్యధ ఏడ్పుగా మారింది విసురుగ వారు దిగిన సత్రంవైపుకు వెళ్లింది. పరచినహోల్డాలుపై కూర్చుని, చేతుల్లో ముఖం దాచుకుంది.

రసజ్ఞ వెంట వచ్చిన విపుల్. "రసజ్ఞా" అన్నాడు కలవరంగ.

తడిసిన కనురెప్పలు బరువుగా పైకి లేచాయి, ఆర్తితో చూస్తూ.

"మాస్టారూ. నిజంగా మీరు నా అందాన్ని గుర్తించలేదా? ఆవిడలా

నేను అందంగా లేనా?" నిలదీసి అడిగింది

"రసజ్ఞా, ఏమంటున్నావ్?" ఆశ్చర్యంగా అడిగాడు.

"నేనంటే మీకు ఇష్టం లేదనగలరా నన్ను అభిమానించే మీరు "

"అందం, అందానికి తగ్గ తెలివితేటలు వున్న స్టూడెంటు అంటే ఏ మాస్టారికి అభిమానం ఉండదూ?"

"కొన్నిసార్లు, కాదు పలుమార్లు నావైపు ఎలాగో చూసేవారు దానికి మీ జవాబు?"

అందమైన రసజ్ఞ తనను ఆకర్షించిన మాట నిజమే. కాని ప్రేమించానని చెప్పలేదు అజంత ఫోటోను, అజంతను చూపినపుడు తనలో రేగిన భావోద్రేకం మాటల కందనిది హృదయ స్పందనలో కలిగిన మార్పులు ఎలా చెప్పగలడు? 'రసజ్ఞా నీవు నా హృదయాన్ని ఆకట్టుకోలేక పోయావు' అని ఎలా చెప్పగలడు?

"రసజ్ఞా, పొరపడుతున్నావు నిన్నెన్నడూ ప్రేమించలేదు. ఒక విద్యార్థినిగా అభిమానం చూపాను" ఇలా ఒక స్టూడెంటు తనని సున్నిత ప్రశ్నలు వేయటం, తను సంజాయిషీ ఇవ్వటం కష్టంగ వుంది.

"ఏం ఎందుకు ప్రేమించలేకపోయారు? ఆవిడ ఇస్తున్నంత కట్నం మీకు ముట్టదనుకున్నారా? మీ ఖరీదు ఎంతైనాసరే, మిమ్మల్ని నా స్వంతం చేసుకునేదాన్ని మాస్టారూ!" మరల ముఖాన్ని చేతుల్లో దాచుకుంది

"రసజ్ఞా, నీవు చిన్నదానివి పెద్దమాటలు వాడకు నా మాటలు అర్థం చేసుకోవటానికి ప్రయత్నించు. నీవు కాలేజి బ్యూటీవి ఎందరో నిన్ను ప్రేమించి, నిన్ను అర్థించారు. వారిలో నీవు ఒక్కరిని కూడ కన్నెత్తి చూడలేదు' ప్రేమ వ్యక్తిగతమైనది నీకు నామీద వున్న అభిమానం, ఇష్టం- ప్రేమ అనుకుని పొరపాటు పడుతున్నావు వయస్సు అలాంటిది నీ కొరకు పుట్టిన వాడు నీ కంటపడగానే, నీ హృదయస్పందనలోని మార్పు చూపి, ఈనాటి నీ ప్రవర్తన నీకు హాస్యాస్పదంగ కనుపించి, 'ఎంత పిల్లిగ ప్రవర్తించాను' అనుకుంటావు.

"మాధ్వి నన్ను ప్రాణప్రదంగ ప్రేమిస్తున్నది రేపు తన భర్తను ప్రాణంకంటే మిన్నగ ప్రేమించగలదు రసజ్ఞా- నీకు మంచి భవిష్యత్తు వుంది. మాస్టారిగా నా ఆశీస్సులు నీకు ఎప్పుడూ వుంటాయి "

వెనక్కు తిరిగిన విపుల్‌ని చూసి "మాస్టారూ" అంది శోకదేవతలా వున్న రసజ్ఞను చూస్తుంటే జాలి కలిగింది. కన్నీళ్ళకు కరిగిపోయింది మనస్సు. కన్నీటిని తుడిచి బుజ్జగించాలని పించింది. కాని సమయం మంచిది కాదు. ముందుకు పడిన అడుగు వెనక్కు తీసుకున్నాడు.

''మాస్టారూ, మిమ్మల్ని ఎంతగానో మానసపూజ చేశాను. నా ప్రవర్తన పిల్లిగానే వుండొచ్చు నిజంగానే నా హృదయం గాయపడింది. ఏ కొన్ని క్షణాలో మీరు చూపిన చూపు ప్రభావం కావచ్చు. ఆ పాపం మీదే ''

''శపిస్తున్నావా రసజ్ఞా అదే పాపం అయితే, అందులో ఆమెకు భాగంలేదు'' వడివడిగా వెళ్ళిపోయాడు

విపుల్ మనస్సు వికలమైపోయింది. దూరాన సన్నాయి శుభసూచకంగ పలుకుతుంటే, రేపటి శుభసమయము గుర్తుకువచ్చి, మనస్సు నూరట చెందింది

*　　　　*　　　　*

మూడు ముళ్లువేసి, అజంతను తన దానిగా చేసికొని, అమ్మవారి గుడికి తీసుకొనివెళ్ళాడు. తనను తాకుతూ నిల్చున్న అజంతను, ''ఏమని ప్రార్థించావు?'' అని అడిగాడు

ఇక అర్థించటానికి కోరికలే లేనట్లు మనస్సు నిండుగవుంటే దేవికి అంజలి ఘటించింది తనను అడుగుతున్న భర్తవైపు ఓరగ చూసింది

''అజంతా, నాకు చాల సంతోషంగ వుంది. ఏమి కోరుకున్నానో చెప్పనా జన్మజన్మలకీ నీవే నా దానివి కావాలని, ముత్యాలలాంటి ముగ్గురే ముగ్గురు బిడ్డలు కలగాలని ప్రార్థించాను'' లోగొంతుకలో మృదువుగ ఇంగ్లీషులో చెప్పాడు

గులాబీ చెక్కిళ్ళు ఎరుపెక్కగా, అడుగులు తడబడినవి

''ఏం అంటున్నావు నాయనా, అమ్మాయి అంతగ సిగ్గుపడుతున్నది?'' అని ఓ ముత్తయిదువు అడిగింది కుతూహలంగ

''అమ్మాయినే అడగండి పెద్దమ్మా'' అన్నాడు చిరుదరహాసంతో.

పెళ్ళి విందు ముగుస్తూనే బంధుమిత్రులు ఎక్కడి వారక్కడికి వెళ్ళిపోయారు

''ఇక్కడ మిగిలిన పనులు తెముల్చుకునివస్తాం మీరు ముందు వెళ్ళండి తిరుమలకి'' అని సౌభాగ్యమ్మ చెప్పింది, వారికి యేకాంతం కలుగ చేయాలని

"అందరం ఒక్కసారే పోదాం'' అంది అజంత ఆ మాట విన్న విపుల్ అప్పటి కప్పుడే కారు తీసుకువచ్చి అజంతను రమ్మన్నాడు మరో మాట పలక్కుండ కారు ఎక్కిన అజంతను చూసి, తల్లి నవ్వుకుంది కన్నీళ్ళు అపుకుందామన్నా ఆగలేదు. చాటుగ మాటుగ తుడుచుకుంటూనే వుంది. కటకటాల వెనుక నిల్చుని మాధ్వి చూస్తూనే వుంది ఆ చిన్న హృదయం కూడ బరువుగ వుంది. పెళ్ళి తతంగంలో అన్నయ్య సరిగా

మాటాడనేలేదు. వదిన రాగానే తనను మరిచిపోతాడా నెగ్‌లెక్ట్ చేస్తే తాను భరించగలదా ఇక తన కెవ్వరున్నారు? వుబుకుతున్న కన్నీటిని ఆపుకోవ టానికి ప్రయత్నిస్తూ ఓ ప్రక్కకి తప్పుకుంది అన్నయ్య కారుతెచ్చి వదినని పిల్చుకుపోతున్నాడు తనని పిలవలేదు పిల్చినా తను వెళ్ళదు కానీ, పిలిచా డంటే ఓ తృప్తి

ఎటో చూస్తున్న మాధ్విని చూసి, ''చెల్లెమ్మా'' అంటూ వచ్చాడు. చెయ్యిపట్టుకొని, ''భోజనం చేశావా?'' అని అడుగుతూ, కారు దగ్గరకు తీసు కొనివెళ్ళాడు తలుపుతీసి ఎక్కమన్నాడు అజంత ఓ ప్రక్కన కూర్చుంది. క్రొత్తగా కట్టిన పసుపుతాడు అందానికి నిండుతనం చేకూర్చింది.

''మాధ్వీ రా'' అంది అజంత బ్రతిమాలే ధోరణిలో.

''అన్నాయ్ నేను తర్వాతవస్తా మీరు వెళ్ళండి'' చెయ్యివూపింది. ఇపుడు మనస్సు తేలికైంది.

స్వార్థంతో చిన్నచిన్న విషయాలను మరిస్తే, అవి లోపాలై తాపాలను కలిగిస్తాయి నూతన భార్యతో ఏంకాంతంకోరి, మాధ్వి అడ్డు అని పిలవ కుంటే, ఆ బలమైన కోరికలోవుండే తపన, పూర్తిగ ఎదగని మాధ్వి అర్థం చేసుకోలేక, అన్నయ్య నిర్లక్ష్యం అనుకుని, వదినమీద ఈర్ష్యకు నాంది పలుకుతుంది కోరికలకు కళ్ళెంవేసి చెల్లిని పిల్చాడు. అర్థం చేసుకొని సంతో షంగా వారిని పంపింది అందరూ అలా ప్రవర్తిస్తే, సంసారచక్రం ఒడి దొడుకులు లేకుండా గడిచిపోతుంది, సౌభాగ్యమ్మ అనుకుంటూ పైటతో ముఖం తుడుచుకుంది

'వదినకి ఎంత పిగ్గో' అనుకుంది, అప్పటికే అర డజను పెళ్ళిళ్ళు చూసొచ్చిన మాధ్వి ఒక పెళ్ళికూతురు తలెత్తి, తన స్నేహితులను చూపి నవ్వుతూ, పెళ్ళితంతు జరుగుతుండగానే మాట్లాడుతూ, పెండ్లికొడుకు అంత సేపు కూర్చోలేక బాధపడుతుంటే, అతనికి దిండు తెప్పించింది అమ్మ లక్కలు బుగ్గలు నొక్కుకున్నారు అది తలచుకుని నవ్వుకుంటూ, సౌభాగ్యమ్మ వెనకాలేవెళ్ళి పెట్టెమీద కూర్చుంది

''నా మహారాణి బంగారుతల్లి'' అంటూ అరటిపండు చేతిలో వుంచింది

''ఏంటమ్మా! నల్లపిల్లని తెగ పొగిడేస్తున్నావు?'' చాపమీద పడు కుంటూ అన్నాడు సిద్ధార్థ

''ఓయ్ బుద్ధూ, సారీ సిద్ధూ వెరీసారీ సిద్ధార్థగారూ నా జోలికి రాకు, కోపంవస్తే మంచిదాన్ని కాను.''

''అన్ని సారీలు ఎందుకు, నేను కేర్ చెయ్యనులే? కానీ పెద్దవాడ్ని,

మర్యాదగ "బావ" అను."

"పాపం! అశ "

వారి తగాదాలకి, క్రొత్తగా యేర్పడిన బాంధవ్యానికి మురిసిపోతూ "మహారాణి, ఆ చదువుకునే పిల్లలందరికి చీర, రవికెలు అందాయి కదూ!" అంది సౌభాగ్యమ్మ.

"రసజ్ఞకు పట్టుచీర ఇవ్వమన్నారు."

"రస-జ్ఞ్వాట్ వండర్‌ఫుల్ నేమ్!"

"ఆ వండర్‌ఫుల్‌నేమ్ మీకు క్రొత్తగ నామకరణంచేసింది, "విలన్" అని."

"ఓహో అయితే ఆ హీరోయిన్ పని పట్టించాల్సిందే" అన్నాడు నిద్రకు వుపక్రమిస్తూ

"ఇపుడు నిద్రపోతున్నావా? ఇక లేచేసరికి లైట్లు వేస్తారు ఒకేసారి పైకి వెళ్లాక పడుకోకూడదూ!"

"లైట్లు వేశాక వెళ్దాం దీపాల వెలుగులో తిరుపతి ఎలా వుంటుందో మహారాణి చూపించమంది" కొంటె నవ్వు నవ్వుతూ, సిద్ధార్థ గట్టిగా కళ్లు మూసుకున్నాడు

*　　*　　*

కారు వెనుకసీటులో వున్నది ఇద్దరే అయినా, చోటు చాలనట్లు, ఇరుక్కుని కూర్చున్నారు అజంతవైపు అద్దందింపే నెపంతో పైన వాలాడు విపుల్. ఆ స్పర్శకి వళ్లంతా విద్యుత్తు ప్రవహించింది మోచేయి ఛాతీకి తగులుతుంటే చేతులు అడ్డుపెట్టుకుంది

కారు ఎక్కువగ మెలికలు తిరుగుతూవుంది కళ్ళు తిరిగినట్లయి, కళ్లు మూసుకుంది "ఇరవైకిలో మీటర్లు అప్పుడే వచ్చేశామా" అనుకుంది

ఎంక్వయిరీ ఆఫీసుదగ్గర కాటేజి తాళం తీసుకుని, కాటేజికి వచ్చారు. డ్రైవరు సూట్‌కేస్, బాగ్ లోపలపెట్టాడు

బాగా ఎండగావుంది ఆ సంగతి వారికేమీ పట్టలేదు మైకుల్లో ఏవో ప్రకటనలు వినిపిస్తూనే వున్నాయి అవి వారి చెవుల్లో దూరటంలేదు గార్డెన్స్ వైపు నడిచారు

పొదల ప్రక్కన అజంతని ఫోటో తీశాడు ఆ పొదలు లవర్స్‌కి అనువైనచోటు. బోగన్‌విల్లా, అంబ్రెల్లాల కత్తిరించబడి, కూర్చోటానికి తిన్నె అమర్చారు కెమెరాపట్టుకునిపోతున్న ఓ యువకుడ్ని పిలిచి "బ్రదర్" అంటూ తన కెమెరాఇచ్చి, అజంత చెయ్యిపట్టుకుని పోజిచ్చి నిల్చున్నాడు ఆ బ్రదర్ వినుకోకుండ, రెండు మూడు పోజులు అతనేచెప్పి, కెమెరా

క్లిక్ మనిపించాడు. థాంక్స్ చెప్పి, లాన్ లో గూర్చున్న తర్వాత, అజంత చేయందుకుని, అరచేతి రేఖలు చదువుతున్నట్లు చూసి, ముద్దుపెట్టుకున్నాడు. "ఎవ్వరైనా చూశారేమో'నని బెరుగ్గా అటు ఇటు చూసింది

"ఎవ్వరూ చూడలేదు" విపుల్ అంటే అజంత నవ్వింది

అంతలో మరో జంటవచ్చి అటుప్రక్క కూర్చున్నారు శూన్యప్రపంచంలో వారిద్దరేవున్నట్లు, కన్నుల్లో కన్ను లుంచారు

"ఇక లాభం లేదు" విపుల్ భుజా లెగురవేస్తూ లేచి, అజంతకు చెయ్యి అందించాడు

మెల్లెక్కి, మండపం వైపుపోతూ భుజాలమీదనుంచి చూశాడు. అతను ఆమె ఒళ్లో తలపెట్టుకుని పడుకున్నాడు

చంద్రగిరి లో యదృశ్యాన్ని చూశారు ఆ బాటనుంచి పైకి క్రొత్త కుండలు అవలీలగ మోసుకొస్తున్నారు పడతులు

ఏదో మరిచిపోయినట్లు, ముఖ్యమైన వస్తువేదో వెతుకుతున్నట్లు, జేబులు తడుముకొని "అయ్యో" అంటూ కాటేజీవైపు వెళ్లసాగాడు గబ గబ అజంత అతన్ని అనుసరించింది

గదిలోకివెళ్ళి సూట్ కేస్ తీసి వెతుకుతున్నాడు

"ఏమిటి వెతుకుతున్నారు?" ప్రక్కనవచ్చి నిల్చుని అడిగింది

చటుక్కున వెనక్కితిరిగి గట్టిగా కౌగిలిలో బిగిస్తూ, అధరాలకోసం వంగుతూ, "వీటికోసం" అన్నాడు మత్తుగ అతని గాఢపరిష్వంగనలో ఇమిడిపోయింది

ఎప్పటికో ఆ సుదీర్ఘ చుంబనంనుండి తప్పించుకొని "ఏయ్" అంటూ కన్నులమీద ముద్దిడుకున్నాడు అజంత కన్నులు విప్పింది ఆ ధవళనేత్రాలు మత్తుగ, కనుకొలకుల్లో దీపాలు వెలుగుతున్నట్లు కాంతిగవున్నాయి

"నీ కన్నుల వెలుతురులో నే కన్నులు తెరిచాను,

కన్నులు తెరిచి నే నిది భూలోకమనే మరిచాను"

లోగొంతుక బొంగురుపోగా అతని కంఠం మత్తు పానీయం సేవించినట్టు ముద్దగ పలికింది అజంత కన్నులు మరీ పెద్దవిచేసింది అధరాలు కాస్త విడివిడగ అధరాలను అందుకున్నాడు, పన్ను చురుక్కుమనగా "అబ్బా" అంది.

"నీ పెదవులు కరిచాను నను నేనే మరిచాను, మరిచి ఇంద్రలోక సుధా మాధురిలో నిలిచాను"

తల ప్రక్కకు తిప్పింది చిరుకోపంగ

ఆమె చెక్కిలికి చెంపచేర్చి, "నీ చెక్కిలి నొక్కినాను నీ హిమగిరి

క్కి-వాను, గాలివేయ శివునిలా నాట్యమాడినాను ''
అతని మెడలో ముఖం దాచుకొంది అతని చేతులు మెల్లగా క్రిందకి
ారి నడుమును చిక్కించుకున్నాయి ఇంకా దగ్గరకు చేర్చుకొని
''నీ నడుము చుట్టినాను, నింగికొనలు ముట్టినాను, ప్రణయ కళాసీమ
ోని పంచాస్త్రం కొట్టినాను'' అలా అంటూనే అవలీలగ ఎత్తి, పడకపై
ఁడుకోబెట్టాడు అజంత లేచే ప్రయత్నంలో వుండగా, తలను వక్షస్థలమం
ుంచి, కన్నులు మూసుకున్నాడు ఆమె హృదయస్పందన వింటూ
''నీ కౌగిలి చేరినాను, నే కన్నులు మోడ్చినాను
లోకమ్మున కోటి కోటి నా కమ్మలు చూపినాను ''
ారి కలయికకు అది సమయం కాదని, అతన్ని లేపటానికి ప్రయత్నిస్తూ,
'ఆశుకవిత్వమా! ఎంత బాగా చెప్పారు!'' అంది.
ఆమె ఎదపైనుండి నవ్వుతూ, ''బాపిరెడ్డిగారి, ''నీవూ - నేనూ''
అనుభవంతో కాని ఆ గేయ మాధుర్యం తెలిసింది కాదు ''
కోటి కోరికలతో అజంత వైపు చూశాడు అతని గుండె వేగం
ింటుంటే ఆమెకు భయం వేసింది. ''భాస్కరుడు సంధ్యను చేరుటకు
సమయం కాలేదు ''వాటిలో మనకేల'' అన్నట్టుగ చూశాడు
అజంత వీపు నిమురుతూ, ''రా ప్రతిబంధకాలన్నీ వుండగూడదు.
ంపుల్‌గా వుండాలి ఒకే గౌను-జిప్-అలా ఉంటే ''
సిగ్గుగా ముఖం అతని ఎదలో దాచుకుంది

* * *

అలసిపోయి పడుకున్న సిద్ధార్థకి మెలకువ వచ్చేసింది, దూరాన్నుంచి
సన్నాయి వినిపిస్తుంటే, కళ్ళువిప్పాడు తను పడుకున్న హోల్డాలు తప్ప
అన్నీ సర్దివున్నాయి ఆవులించి టవలు, సోపు పట్టుకొని బాత్‌రూమ్ వైపుకు
వెళ్ళాడు హాల్లో కళ్యాణమండపాన్ని అలంకరిస్తున్నారు
చెవిదగ్గర ట్రాన్సిస్టర్‌పెట్టుకొని, అరవపాటను ఆనందిస్తూ, పెళ్ళి
ాళ్ళు చేసే గలాటాని నవ్వుతూ గమనిస్తూ వుంది, ఓ బెల్‌బాటమ్స్ వేసు
సన్న పిల్ల సున్నితమైన పొడుగాటి మెడ, మరీ అందంగవుంది పొట్టి
ఁడలు, రెండు చెవులదగ్గర రిబ్బను పువ్వులాపెట్టింది ఆ నిల్చున్న
సంగిమ గూడ నచ్చింది ఆ ఛాయ తెలుపు కాకపోయినా, ఆ అమ్మాయి
చర్మం మెరుస్తున్నట్లు శుభ్రంగవుంది ఈల అప్రయత్నంగా వచ్చేసింది ఆ
అమ్మాయి పిల్చినట్టుగ ఇటు తిరిగి నవ్వింది, నవ్వటమే గాకుండా, ''లేచావా
కుంభకర్ణా, సారీ'' అంది
''మాధ్వీ నువ్వా!''

"ఎవరనుకుని ఈలవేశావు?"

"పట్టు పరికిణీలో వుంటావనుకున్నా కానీ, ఈ బెల్స్‌లో వుంటా వనుకోలేదు "

"సరే- త్వరగ తెముల్చుకుని రావాలి మనవాళ్ళందరు వెళ్ళిపోయారు. మీతో పెట్టుకుంటే కాదని, మీ నాన్న, మా నాన్న తలనీలాలు అర్పిస్తారు. స్వామి పుష్కరిణిలో స్నానాలుచేసి, ఇక అమ్మ మిమ్మల్ని నా కస్టడీలో వుంచి వెళ్ళారు" కన్నులు పెద్దవిచేసి, 'జాగ్రత్త' అన్నట్టు చూసింది

"ఏంచేస్తాం. కాలం మారిపోయింది" భుజాలు ఎగురవేస్తూ బాత్ రూమ్ వైపు వెళ్ళాడు

సిద్ధార్థ వచ్చేలోపల పెట్టెలు, తట్టలు కారు డిక్కీలో పెట్టేసింది సామాను మోసుకుపోతున్న మాధ్విని చూసి, 'పిచ్చిపిల్ల' అనుకున్నాడు. పంచెకట్టి, తెల్లటి జుబ్బాపై జరీకండువా చుట్టుకుంటూ వచ్చాడు కారు దుమ్ము కొట్టుకొని, అలసిపోయినట్లుంది "బుద్ధూ- ఈ కారు కొండ ఎక్కుతుందంటావా?"

"నా కారు రాజాభేటా" స్టీరింగ్ ముందు కూర్చున్నాడు ఫ్లాస్కులో నుంచి కాఫీ పోసి ఇచ్చింది "థాంక్యూ" అంటూ అందుకున్నాడు

ముందు కూర్చుని, "ఆ. రైట్ రైట్" అంది

"నీవూ వెళ్ళకపోయావా" అన్నాడు

"మీరేగా- అన్నీ చూపించుకుంటూ తీసుకు వెళ్తానన్నారు అమ్మతో" అంది.

"ఒక గైడుని ఏర్పాటు చేసుకోలేకపోయావూ?"

"మీరు చదువంతా వెలిగించింది ఇక్కడే కదా. ఆ మాత్రం తెలియదా అనుకున్నా. నిజంగానే బుద్ధువనుకో లేదు."

"నీ జడలు నేను నిద్రపోయేవరకు పొడుగ్గా వున్నట్టు గుర్తు అంతలోనే అంత పొట్టిగ అయ్యాయా. ఎలా వేశావు?"

"ఎటూ ఉద్యోగం లేదుగా ఇలాంటి విషయాలపై రీసెర్చి చేయ కూడదూ?"

"బాబో ఈ పిల్లతో మాట్లాడలేము."

"ఏ బుద్ధూ- నా పేరు మాధ్వి "

"మాధ్వి అంటే మకరందమా?"

"మత్తు "

"అయితే వద్దు" స్పీడు ఎక్కించాడు దారి పొడుగునా ఏదేదో మాట్లాడుతూనే, అలలలలుగా నవ్వేస్తూనే వుంది.

''కాస్సేపు వూరుకో. నేను మాట్లాడుతాను'' అన్నాడు

''ఆ కొండల వరుసలు చూశావా- అవి నల్లమల కొండలు. తిరుపతి కొండపేరు 'శేషాచలం'. ఎందుకు ఆ పేరు వచ్చిందంటే- ఈ నల్లమల కొండల వరుసలు శ్రీశైలం నుంచి తిరుపతివరకు చూస్తే విశ్రాంతిగ పడుకున్న పాములాగ వుంటాయి. తోకపై శ్రీశైలం, శిరస్సుపై తిరుమల వెలిశాయి తిరుమల ఏడు కొండలపై వుంది శేషుని ఏడు తలలు నేలపై వాల్చి పడుకున్నట్లుగ వుంటుంది. ముందుకు పొడుచుకు వచ్చిన ఆ ఎర్రని రాయి శేషుని ముక్కు అంటారు అలా గమనిస్తే ఏడు ముక్కులు చూడ వచ్చును. ఆ ఏడు కొండలు వృషభాద్రి, అంజనాద్రి, నీలాద్రి, గరుడాద్రి, నారాయణాద్రి ''

అలా చక్కగా చెప్పుకుపోతున్న సిద్ధార్థను ప్రశంశా పూర్వకంగా చూసి, అల్లరి చేయటం, మధ్యలో మాట్లాడ్డం మానేసింది మాధ్వి

ప్రొద్దు ఏటవాలింది ఆకాశం ఫిబ్రవరి నెలలా అటు చలిని వదల కుండ, ఇటు ఎండను అందుకున్నట్టుగ వుంది

రైల్వేస్టేషన్ మలుపులోవున్న కూల్‌డ్రింక్ షాపు ముందు కారు ఆపి, ''గోల్డ్‌స్పాట్ ఆర్ కోకో'' అన్నాడు

''రెండు ఐస్‌క్రీమ్'' అంది

''నా కొద్దు ''

కిలకిల నవ్వుతూ ''రెండూ నాకే!''

''బాబోయ్ ఏం తిండిరా'' అన్నాడు దిగుతూ

సర్వ్‌చేసే పిల్లవాడు మాధ్వినే చూస్తూ నిలబడ్డాడు

''ముక్కుమీద గుద్దిరానా?'' అన్నాడు సిద్ధార్థ ముందుకు వంగి

''తమ్మయా! అక్కలాగ కనుపిస్తున్నానేమో'' కిలకిల మంది

ఐస్‌క్రీమ్ తింటుంటే, కోకో కోలా సిప్‌చేస్తున్న సిద్దార్ధ, ''ఇలా తింటానికి ప్రత్యేకంగ మనమింకో రోజు వస్తే మంచిది మాధ్వీ చూస్తా నంటూ, తింటుంటే, టైం చాలదు '' అన్నాడు

'' ఆ వెధవ తొందరగ ఇచ్చి చస్తేగా'' అని త్వరగ ముగించి లేచింది. డబ్బులు చెల్లించాడు సిద్ధార్థ మాధ్వి కౌంటర్ దగ్గరకువెళ్ళి ప్రొప్రయిటర్‌తో, ''ఆ పిల్లాడు వచ్చినవాళ్ళని చూస్తుంటానికి, సర్వ్ చేయ టానికి మరొక పిల్లాడ్ని పెట్టుకోండి'' అని నవ్వుతూ చెప్పింది ఎప్పటి నుంచో తెలిసినవాడికి చెప్పినట్లు చెప్పుతుంటే కళ్ళప్పగించి చూస్తుండి పోయాడు అతను

''ఏమిటి మాట్లాడుతున్నావ్?'' అన్నాడు సిద్ధార్థ.

"వ్యాపార విషయంలో సలహా ఇచ్చాను" అంది

రోడ్డు విశాలంగ వుంది అంతకు ముందువోయిన బస్సును కలుసు కోవాలన్నంత తొందరగ వెనుక మరొక బస్సు దూరానికి కొండమీ పోతున్న బస్సులు బొమ్మల్లా కనుపిస్తున్నాయి

సిద్ధార్థ నేరుగా కపిలతీర్థానికి తీసుకొనివెళ్ళాడు మనుషులకంటే ఎక్కువగ కోతులు, వాటితో సమానంగ భిక్షువులు వున్నారు ఆ కొండ ఆ శేషుని మొదటితల అనుకోవచ్చు పది మీటర ఎత్తునుంచి నీళ్ళు జలపాతంల పడుతున్నాయి ఆ నీటికి కోనేరు కట్టారు జతలు జతలుగ ఆ నీటిధార క్రింద స్నానం చేస్తున్నారు కోనేటిలో పిల్లలు ఈదుతున్నారు

బుట్టలోనుంచి అరటిపళ్ళు తీసి, కోతులను పిలిచింది మాధ్వి అరటిపళ్ళ అందుకొని వెళ్ళాయి కొన్ని కోతులు మాధ్వి వెంటపడ్డాయి, భిక్షవేస్తేగాని వదలని భిక్షగాళ్ళలా పరుగెత్తి సిద్ధార్థ ప్రక్కన వచ్చి నిల్చుంది మగవాడ్ని చూసి మెల్లగ తప్పుకున్నాయి

"అమ్మాయిలను చూస్తే కోతులకి కూడ అలుసే" అన్నాడు.

పైసాకోసం వచ్చి నిల్చున్నాడు ఓ పిల్లవాడు

పర్సు తియబోతున్న మాధ్వితో, "ఇదో ఇక్కడ వున్న వాళ్ళందరికీ ఇవ్వగలిగితే, వీడికి వెయ్యి, వీడికి వేసిన తక్షణం, బాడుగకోసం పరుగెత్తుకు వచ్చే రిక్షావాళ్ళతో నిన్ను చుట్టేస్తారు" అని దడిపించాడు

ఆ పిల్లవాడి సత్తుగిన్నెలో ఐదుపైసలు వేసింది బిలబిలమంటూ వచ్చింది ఓ ఫామిలీ వచ్చిన వాళ్ళందరికీ వేసింది నవ్వుతూ

"అయిందా దానం" అన్నాడు

పేరు మాత్రం సిద్ధార్థ. మనస్సు ఎంత కఠినం.

"మీకు ఎప్పుడైనా ఇలాంటి అవకాశం వస్తే, దానం చెయ్యండి. ప్రయాణాలు చేసేటప్పుడు ఈ సదవకాశం వస్తుంది కుంటి గ్రుడ్డికి ఓ అయిదో పదో వేయండి "

"ఎందుకూ?" అన్నాడు అమాయకంగ.

"పుణ్యం సంపాదించుకోరూ? "

"దానంలో కూడ స్వార్థం వుంది చూశావూ? తోటి మానవుడిమీద జాలితో కాదు దానం చేసేది. రూపాయంత పాపంచేసి, పైసా ఇచ్చి పుణ్యం కొంటానికి. లాభసాటి బేరమే!"

"ఉద్యోగం కూడ లేదు, చేసి చూడరాదూ!" అంది.

"నీమాట వింటే అయినట్టే!"

"మరి మీరు చెప్పండి" అంది

''ఇక్కడ కపిలమహర్షి శివుని ప్రతిష్ఠించి తపస్సు చేసుకున్నాడట. బ్రహ్మ ఆవు రూపంలో వచ్చి పాలు ఇచ్చేవాడట. యాత్రికులు ముందుగ ఇక్కడకు వచ్చి, కపిలేశ్వరుని దర్శించి, ఈ దారినే తిరుపతికి వెళ్లేవారు ''

''మీరు గైడుగా ఎందుకు ప్రయత్నించకూడదూ?''

''నెలకొకసారి లేక ప్రతి సంవత్సరం వచ్చేవాళ్ళకి గైడు ఎందుకు?' అన్నాడు

ఓ టూరిస్టు బస్సు వచ్చింది బిలబిలమంటూ అమ్మాయిలు దిగారు. కారుకి అనుకొని వాళ్ళని చూస్తూ నిల్చున్నాడు ఇప్పుడిప్పుడే కదిలేట్లు లేడు. వాళ్లు టవల్స్ పట్టుకున్నారు ఇక స్నానాలు మొదలు పెట్టితే

చెయ్యి గిల్లుతూ, ''జై, కృష్ణభగవాన్లూ ' అంది

''ఐస్క్రీమ్ తినఃచ్చావు కాదు టైమ్ లేదంటూ అమ్మాయిలను చూస్తానికి టైమ్ వుందా?''

ఉస్సురంటూ కారులోకి వచ్చాడు

అలిపిరికి వచ్చి చెట్టుక్రింద ఆపాడు

''టోల్‌గేటు నుంచి పోతే ఘాట్‌రోడ్డు మీదుగ ఇరవై కిలోమీటర్లు ప్రయాణం చేస్తాం. అటుగ వుంది కాలిబాట ఆ కాలిబాటను, పైనున్న గాలిగోపురం కట్టినది మా జిల్లావాడు ''

''మీ వంశస్తుడా?'' ఆసక్తిగా అడిగింది

''ఎం చుట్టరికం కలిపేద్దామనా!'' అని నవ్వి, ''కుమార అనంతరాజా (కడప జిల్లా) ఆ గోపురాన్ని కట్టించారు ఈ సోపానమార్గం దూరం తగ్గించింది, పదకొండు కిలోమీటర్లు మాత్రమే ''

మెట్లమీద అలసిపోయినట్లు కూర్చున్నారు కొందరు రద్దీగ వున్న రాచబాటలో మెట్లమీద ఎక్కేవాళ్లు, దిగేవాళ్లు, అగని ప్రవాహంలో వున్నారు

''ఆ మెట్లమీదున్న గుడి ఎవరిది?''

''ఆ వడ్డికాసులవాడి పాదరక్షలు వున్నాయి అంటే కొండపైకి ఆ దారిన చెప్పులతో పోకూడదని అర్థం పూర్వం యూరోపియన్లు, రెవిన్యూ ఆఫీసర్లు, ప్రత్యేకి అనుమతి తీసుకొని వెళ్లేటప్పుడు, వారు కూడ చెప్పులు వదిలేవారట పూర్వం అస్పృశ్యులకు దేవాలయ ప్రవేశం లేనప్పుడు, వారు ఆ స్వామికి పాదుకలుచేసి, మేళతాళాలతో వూరేగించి, స్వామికి సమర్పించి పూజచేసేవారు ఇది దాటి, ఆ కొండ ఎక్కే అర్హతలేదు వారికి పూజారి ఆ స్వామి పాదుకలు వారి తలకు తాకించి ఆశీర్వదించేవాడట ''

''ఈ కాలంలో పుట్టినవారు అదృష్టవంతులు'' నిట్టూర్చింది మాధ్వి.

'మాధ్వికి నిట్టూర్పు కూడ తెలుసా?' అనుకున్నాడు

''గురువారం రాత్రి—పూలంగి సేవ తర్వాత స్వామివారు వచ్చి, ఈ చెప్పులు వేసుకొని, మంగాపురం, పద్మావతీదేవి దగ్గరకు వెళ్తాడట ''

''ఇది హాస్యాస్పదంగ లేదూ- కరివేపాకు లేదని, ఇంత అరణ్యంలో నుండి దేవిని తిరిగి నారాయణవనానికి పంపాడని, ఇంత సిల్లీగా ఎలా కల్పించి చెప్పారో- ఈ తరం వాళ్లు దాన్ని ఎలా నమ్ముతున్నారు?'' అంది మాధ్వి

''అందుకే అది పుక్కిటి పురాణం'' అన్నారు ప్రవేశ రుసుము చెల్లించి కారు ముందుకు పోయింది

''ఈ రోడ్డు 1944లో వేశారు విదేశీయుల చేతిమీదుగా ఈ పని జరిగింది మొదట యాత్రికులుగాని, బస్సులుగాని ఈ బాట మీదుగ రావటానికి భయపడ్డారు నీగ్రోలు ఎక్కి బస్సులో తిరిగారు ఏ కీడూ రాదని, అప్పుడు ప్రయాణం చేశారు ఈ ఘాట్ రోడ్డుపై ''

''ఇంతకీ గుడి ఎప్పుడు కట్టించారో'' అంది మాధ్వి

''వేంకటేశ్వర మహాత్యం చదవలేదూ- ఈ స్వామి విగ్రహం- స్వామి పుష్కరిణి ఒడ్డుపై నున్న చింతచెట్టు క్రింద ఓ పుట్టలో వుందని తొండమాన చక్రవర్తి తెలుసుకొని ఆలయం కట్టించాడు. ప్రస్తుత ఆలయానికి 8వ శతాబ్దంలో పునాది పడ్డది తర్వాత ఒక్కొక్కటి అభివృద్ధి చెందుతూ వచ్చింది ''

మొదటి కొండ దాటి రెండవ కొండకు వెళ్లేటప్పుడు వినాయకుని విగ్రహం కనుపించింది

''కొబ్బరికాయ కొట్టావా?'' అన్నాడు

''ముందుగ వెళ్ళిన అమ్మ మన తరపున కూడ కొట్టేసి వుంటు'దని ''దండం పెట్టుకోలే దేమి'' అని అడిగింది మాధ్వి

''నాస్తికుడ్ని కాదుగానీ, దారిని కనుపించే ప్రతి రాయికి, చెట్టుకి మాత్రం దండం పెట్టను, నీవు పెట్టుకుంటే నా కభ్యంతరం లేద''న్నాడు సిద్ధార్థ

రెండవ కొండ మెలికలకు ప్రసిద్ధి అతి జాగ్రత్తగ, మెల్లగ నడుపసాగాడు సిద్ధార్థ చివరి మెలిక తిరుగుతూ, ''ఏడు'' అని లెక్క పూర్తి చేసింది మాధ్వి

మూడవ కొండకు సగం దూరం వచ్చి ఆగారు. ప్రక్కకోన చూపించి, ''దీన్ని అవ్వాచారికోన అంటారు. ఇక్కడ నుంచి చూస్తే తిరుమల గోగర్భ ఆనకట్ట కనుపిస్తాయి, ''చూశావా'' అన్నాడు.

చల్లనిగాలి రివ్వున వస్తుంటే స్కార్ఫ్ కట్టుకుంది రోడ్డు ప్రక్కనే

ఏపుగ పెరిగిన వృక్షాలు. వాటికి అల్లుకున్న రకరకాల పువ్వులు. పోనుపోను అవ్వాచారి కోన అగాధంగా కనుపిస్తూ వుంది

నాల్గవ కొండకు ముందుగా వున్న ఆర్చిని చూపించి, దీనికో మహత్యం వుందంటూ చెప్పసాగాడు, సిద్ధార్థ. ఈ రోడ్డువేసిన గానన్ అండ్ డంకర్లీ, కంపెనీ వారు ముందు ఇక్కడ ఆర్చిని కట్టారు దానిమీద తిరుమలకి దారి- కట్టినది అని ఆ కంపెనీ పేరు వ్రాసుకున్నారు ఇంగ్లీష్ అక్షరాలలో కట్టినదే తడవుగా ఈ ఆర్చి కూలిపోయింది మరలా కట్టారు. మరలా పడిపోయింది ఎన్నిసార్లు కట్టినా పడిపోతూనే వుంది విసిగి వది లేసిన ఆ ఆర్చిని, దేవస్థానం వారు కట్టించి, దానిపై వేంకటేశ్వర స్తోత్ర శ్లోకం- "వినా వేంకటేశం ననాధో ననాథః సదా వేంకటేశం స్మరామి-స్మరామి" అని వ్రాశారు అప్పటి నుండి ఈ ఆర్చి తలెత్తి నిల్చింది

నాల్గవ కొండ శిఖరంపై ఘంట మంటపం వుంది విజయనగర సామ్రాజ్యపు చివరి దశలోని రాజులు చంద్రగిరి కోటలో తలదాచుకున్నారు.

గుడిలో స్వామికి మహా నైవేద్యం అర్పించినట్లు గుర్తుగ గంట మ్రోగించగా, ఆ ఘంటారావం విని, ఘంట మంటపంలోని వ్యక్తి, ఆ గంటను మ్రోగించే వాడట ఆ గంటను విన్న తర్వాతనే చంద్రగిరిలో నున్న శ్రీ రంగనాధ యాదవరాయలు భోజనం చేసే వాడట "

ఐదవ కొండకు వచ్చారు. బాట తడిగావుంది. ప్రక్కనున్న కొండల అంచుల నుండి నీటి ధారలు వూరుతూ, పన్నీటి జల్లులా పడుతున్నాయి. ఐదు ఆరు కొండల మధ్య, జీను పరిచినట్లు స్వతఃసిద్ధమైన వంతెనుంది. ముందుగా చిన్న గోడలో సప్తకన్యలు (అక్కమ్మ దేవతలు) వున్నారు. అక్కడ చాలమంది గుమిగూడారు కొబ్బరికాయలు కొట్టుతున్నారు విగ్రహాల కున్న కుంకుమ తీసి నుదుట దిద్దుకుంటున్నారు "ఈ విగ్రహాలు సోపాన మార్గంలో వుండేవి. ఈ ఘాట్ రోడ్డు వేసేటప్పుడు చాలా ప్రమాదాలు జరిగి, నష్టం సంభవిస్తూ వుండేదట అపుడు ఈ సప్తకన్యలకు గుడికట్టి. ప్రతిష్టించిన తర్వాత, రోడ్డు తేలికగా వేయగలిగారని చెప్పుకుంటారు "

ఆరవ కొండను సమీపిస్తుండగా, "గోవిందా, గోవిందా- వడ్డికాసుల వాడా" అన్న నినాదాలు ఎక్కువయ్యాయి గట్టిగా, ఆ దేవుడిని పిలుస్తు న్నట్లుగా అరవసాగారు. పాదయాత్రికులు

అది మోకాళ్ళ పర్వతంగా ప్రసిద్ధి పొందినది. అక్కడ స్టీప్‌గా నున్న మెట్లు ఎక్కలేక, కాళ్ళ నొప్పికి, కాలు పట్టుకొని ఎక్కుతారు

అక్కడ 'శ్రీరామానుజ గుడి' అనే చిన్న మంటపం వుంది. అక్కడో చింతచెట్టు క్రింద శ్రీ రామానుజ- రామాయణం చదివే వారట

అక్కడ యాత్రికులు విశ్రాంతి తీసుకుంటూ, కన్నుల పండుగగ వున్న ప్రకృతిని ఆస్వాదిస్తున్నారు.

అక్కడి నుండి కాలిబాట చీలిపోయింది. కారు ఏడవ కొండ ఎక్కే ముందు, ఎడమ చేతివైపున్న అరణపు పెట్టెలను చూపాడు సిద్ధార్థ మాధ్వికి. ఆ కొండపై రాళ్లు పెద్దపెద్ద పెట్టెలు ఒకదానిపై నొకటి అమర్చినట్లున్నాయి.

"ఇక్కడే పద్మావతితో వస్తూ, ఈ శిఖరంపై విశ్రాంతి తీసుకుంటూ కూరలోకి కరివేపాకు లేదని, తెలుసుకున్నాడు శ్రీనివాసుడు. చంద్రగిరి, మామండూరు అడవుల్లో దొరికే కరివేపాకు ఈ అరణ్యంలో లేవు. అందుకే మన పురాణ పురుషులు ఆ కథని కల్పించి వుండవచ్చు."

"తనతో తెచ్చుకున్న అరణపు పెట్టెలను ఇక్కడ వుంచి, తిరిగి పుట్టింటికి వెళ్ళివస్తూ, మంగాపురానికి వచ్చే వేళకి తెల్లవారి పోయింది. అప్పటికే అలసి పోయిన పద్మావతి భర్తపై కోపంతో అక్కడే వుండి పోయింది."

"మంచి పనిచేసింది" అంది మాధ్వి

సిద్ధార్థ, మాధ్వి ఏడవ కొండ వేంకటాచలం చేరుకున్నారు. ఆ ప్రదేశం దీపాల వెలుగులో మేరు పర్వతంలా మెరిసి పోతూవుంది.

* * *

గోవింద గో విందా గోయిందా

ఆ గోవిందుని నామస్మరణములో ఆదియందు జలార్ణవమున ఓంకార దము ప్రజ్వరిల్లినట్లు భక్తుల హృదయాలు పారవశ్యముతో తేలిపోతుండగా ంగారు వాకిలి దాటి గర్భగుడిలో ప్రవేశించారు.

భక్తుల కభిముఖంగ నిలువెత్తు కలియుగ పురుషుడు వరదహస్తుడు, ద్మావతీ వల్లభుడు పద్మముపై నిలుచున్నాడు.

బంగారు కవచం, పసిడి ఆభరణాలతో కిరీటధారి అందాన్ని చూచుటకు ండు కళ్ళూ చాలడంలేదు. తన భక్తుల ఎడ ఎనలేని కృపతో వారినే గాస్తూ పలుకరిస్తున్న కమలనయనకు నామం అడ్డొస్తూంది. పులకాంకితులైన క్తుల హస్తాలు ఫాలభాగం పైకి లేచాయి.

తనను దర్శించవచ్చిన వారిని చూసి సంతుష్టుడై నవ్వుతూ పలుక స్తున్నట్లున్నాడా స్వామి.

"భక్తుల కళ్ళకి వారి వయస్సుకి తగ్గట్టు అంత ఎత్తులో కనుపిస్తాడట వామి...నాకు మాత్రం కనుపించడంలేదు" అంది సిద్ధార్థను పొడుస్తూ ధ్వి.

"అల్లరి మానేస్తే కనుపిస్తాడేమో!"

"కిరీటంనుంచి పద్మంవరకు తొమ్మిదడుగులు వుంటే, ఆయన మాత్రం ఏడడుగులు వున్నట్లుంది - నేను అంత ఎత్తున్నానా?"

"నీవు అమ్మాయిలను చూసి ఈల వేశావు కదూ. అందుకే నీకు కని పించలేదు."

మెత్తగ నవ్వుతూ, వెనకాలవాళ్ళు తోస్తుంటే ముందు ముందుకి వెళ్ళారు

సముద్ర అలలువలే భుజాలమీదకు జారిన జటాజూటాలు "ఓం-నమశ్శివాయ" అను అద్భుత మంత్రాన్ని వుపదేశిస్తున్నాయి.

నీలివర్ణ వటపత్రశాయి శంఖచక్రధారి విష్ణువును హృదయంలో చిత్రించుకుంటూ పాపభీతితో పారవశ్యంతో శరీరం గగుర్పొడిచింది.

పునుగు తైలం పూయబడిన విగ్రహం వెన్నలా జారిపోతున్నట్లు భ్రాంతి గొలుపుతున్నది. విశాలమైన ఛాతి - సింహరాజ మధ్యమ - నాగ భూషణధారి, గంభీరుడ్ని చూసి పులకించిపోయారు.

పుష్పాలంకృతుడైన దివ్యమంగళ మనోహరమూర్తి అందచందాలు వర్ణించ ఎవ్వరి తరము. స్వామి "స్వయంభూ"ను దర్శించి, పునీతులై, హారతి కళ్ళ కద్దుకుని శరగోపం పెట్టించుకోవటం అన్నీ నిముషంలో జరిగి పోయాయి. తనివి తీరనట్టు తిరిగి తిరిగి చూస్తూ అయిష్టంగ కదిలి పోతున్నారు.

వైజయంతీమాలలో కూర్చబడిన పూలజీవితం ఒక్క రోజే అయినా స్వామిని అలంకరించి ధన్యమైనవి

అంతవరకు తనని అంటిపెట్టుకొని, ఆ జనరనుంచి తప్పించుకు తీసుకువస్తున్న విపుల్‌వైపు చూసింది అజంత

నవరత్న ఖచిత కిరీటధారి శ్రీనివాసుడా తన విపుల్, లక్ష్మిని హృదయంపై నిలుపుకున్నా ఒంటరిగానే వెలిశాడు తిరుమలపై.

ఏకపత్నీవ్రతుడు రామునిలాంటివాడా తన విపుల్ రజనీకరుడైన రామభద్రునితో వనవాసంచేసినా జానకికి ఎడబాటు తప్పలేదు.

అష్టభార్యలతో భోగభాగ్యాలతో తులతూగిన మధురమైన మాధవుడు కానే కాడు. మరి మరి తన విపుల్ ఎవ్వరు? మనసున్న మనిషి - తన భర్త. అది చాలు తనకు.

కాంతివంతమైన చూపులతో తననే వోరగ చూస్తున్న అజంత చెయ్యందుకున్నాడు.

ఆరీ ఆరని జుట్టు నుదుటికి అంటుకుంది. పసుపు పచ్చని పట్టుచీరలో శరీరవర్ణం కలిసిపోయింది. ప్రతిమ మానలక్షణంతో అందంగా మలచబడిన

విగ్రహంలాంటి అజంతను తృప్తిగా చూసుకుంటూనే వున్నాడు.

పరిసరాలు గుర్తించి అలవోకగా తలదించినది.

*     *     *

గుంపులోనుంచి బయటకు వచ్చాక చూసింది మాధ్వి - నాన్నగారి, వెంకటపతి మామయ్యగారి గుండ్లు. క్రొత్త నోటులా రెపరెపమంటున్నాయి. కిలకిల నవ్వింది.

"బుద్దూ - మీర్లూ చేసుకోకూడదూ" అంది.

"ఓ కె" అన్నాడు. కళ్లు పెద్దవిచేసి చూసింది.

"వస్తావా?" అన్నాడు.

"ఓ కె." అంది.

తలనీలాలు తీయు స్థలానికి బయలుదేరారు.

"కాకికి మెతుకులు విదల్చనివారు నిలువుదోపిడీలు ఇస్తున్నారు, మన దేశంలో మానవత్వంకంటే దైవభక్తి, మూఢనమ్మకాలు పై ఎత్తులోనున్నాయి."

"వెంట్రుకలు అర్పించటం మూఢభక్తి కదూ, అందుకే మిషనరీ టీచర్లు హేళన చేస్తారు" అంది మాధ్వి.

"ఈ ఆచారం ఎప్పుడు ఎలా మొదలైందో కాని, ఓల్డు టెస్టు మెంటు రోజుల్లోనే వుందని ఆ నవ్వినవాళ్ళకి చెప్పు. పూర్వం, ఓ మనిషిని అవమానించాలంటే, బోడిగుండు చేసి వూరేగించేవాళ్లు. తలవెంట్రుకలు మనిషికి గర్వకారణం, అందాన్నిస్తాయి. తనను తాను అతి తక్కువ చేసుకుంటూ, నీ ముందు అతి అల్పుడను, నీ కొరకు ఎలాంటి అవమానమైనా సహించగలను' అని వెంట్రుకలు అర్పిస్తాడు. ఏమైనా వాటివలన విదేశీ మార్కెట్టు సంవత్సరానికి కొన్ని లక్షల రెవెన్యూ వస్తుంది, అది చాలదా మనకి" అన్నాడు సిద్ధార్థ.

"చిన్న పిల్లలకి పురుటి వెంట్రుకలు తీస్తే బ్రెయిన్ డెవలప్‌మెంటు బాగ వుంటుందట మరి."

"తీసిన క్షణంనుంచి పెరుగుతాయి కనుక ఈ తెలివైన మానవులు సులభంగ ఇచ్చేస్తున్నారు. ఒకసారి తీస్తే మరలా రావంటే ఎంతమంది ఇస్తారో చూడాలని వుంది" అన్నాడు సిద్ధార్థ.

కపిలతీర్థం దగ్గర చూసిన అమ్మాయిలు ఎదురువచ్చారు. వాళ్ళలో ఎర్రచీర కట్టుకొని, అజంతా కప్పులోనున్న ఆవిడ, గబగబ ముందుకు వచ్చి "హాయ్ సిద్ధార్థ" అంటూ పలుకరించింది. సూర్యుని చూపి పూర్తిగా వికసించిన చెంగల్వలా వుంది.

''వాసంతీ'' అన్నాడు సంతోషంగ.

తాను లెక్చరర్ననీ, బాటనీ స్టూడెంట్సుని ఎక్స్‌కర్షన్‌కు తీసుకొచ్చానని చెప్పింది

వాసంతి పొట్టిగానున్నా ముచ్చటగా వుంది. ఇంటర్‌లో క్లాస్‌మేట్‌గా నున్నప్పుడు సన్నగా, సిగ్గుసిగ్గుగా, స్నేహితుల వెనుక దాగుకుంటూ వెళ్లేది. ఇపుడు పరిపూర్ణవతిగ, చదువుకున్న విజ్ఞానంతో రీవిగ వుంది. ఎంత మార్పు' అనుకున్నాడు.

వాసంతి కళ్ళెత్తి చూస్తూ ''మీరూ మారిపోయారు. ఏం చేస్తున్నారు- ఈ అమ్మాయి ఎవరూ - చెల్లెలా'' అంది.

బెల్‌బాటమ్స్, పైజామాల్లోనున్న అమ్మాయిలు రీవిగ వుంటే, సిద్ధార్థ చూసినపుడల్లా చీరలు కట్టినవాళ్లు పైటలు సర్దుకుంటున్నారు.

'చీరలు కట్టినవాళ్ళెందుకో పాపం పైటలు సర్దుకుంటారు' అనుకున్నాడు సిద్ధార్థ

''ప్లాంట్ కలెక్షన్‌కి ఎక్కడికి పోతున్నా'రని అడిగాడు.

'శేషతీర్థం వెళ్ళాలనుకుంటున్నాము'' చెంపలమీది జుట్టు సరిచేసుకుంటూ అంది వాసంతి.

''అమ్మాయిలందర్నీ ఎస్కార్టు చేస్తూ వెళ్ళటం కష్టం. బాగా తెటసిన వాళ్ళని తీసుకెళ్ళితే మంచిది. నీటిలో మాత్రం దిగకండి. బాగా లోతున్న మడుగులున్నాయి. తెప్పమీద వెళ్ళొచ్చు, మీ పిల్లలకి జాగ్రత్తని చెప్పండి. ఆ ప్రక్క నాగుపాము వుంది ''

''మేడమ్ అక్కడికి వద్దు'' అని పిరికిపిల్లలు గోల చేశారు కొందరు అక్కడికే వెళ్దామని, మరికొందరు వద్దని, అక్కడే తగాదాలకి దిగారు. సిద్ధార్థ నవ్వుతుంటే, ''నారదులవారు నవ్వుతున్నారు'' అంది మాధ్వి.

చివరికి పాపనాశనానికి పోదామని తీర్మానించారు.

''మీరు వస్తారా?'' ప్లీజ్ రమ్మన్నట్లుగా చూపింది వాసంతి.

''విత్ ప్లెషర్'' అన్నాడు.

''బుద్ధూ - వెంట్రుకలు అర్పిస్తానని బయలుదేరారు. అమ్మాయిలను చూసి ఆ సంగతి మర్చిపోయినట్లుంది'' అంది మాధ్వి.

క్రాఫ్ సరిచేసుకుంటూ, ఇబ్బందిగ ముఖం పెట్టి, ''ఇంకా నయం గుండు చేసుకోలేదు'' అన్నాడు.

''అమ్మకి చెప్తాను'' అంటూ బెదిరించింది.

చిన్న పిల్లవాడిని దడిపించినట్లు బెదిరిస్తుంటే, మీసాలు సరిచేసుకొని పెద్దగా నవ్వాడు.

"వెళ్దాం రా, మనకోసమే ఎదురుచూస్తున్నారు. బాబోయ్, ఎంతమంది అమ్మాయిలు?" అంటూ బస్‌వైపు నడిచాడు.

ఫ్రంట్‌సీట్లలో ఎదురెదురుగా కూర్చున్నారు, వాసంతి, సిద్ధార్థ. ఎన్నో కబుర్లు చెప్తూ, మధ్య మధ్య వాళ్ల క్లాస్‌మేట్స్ గురించి అడుగుతూంది. వాసంతి గుర్తు చేస్తే కాని, తన క్లాస్‌మేట్స్ గుర్తుకు రావటంలేదు సిద్ధార్థకు. విచిత్రంగ అమ్మాయిలు మాత్రం గుర్తున్నారు.

మాధ్వి పిల్లల్లో కలిసిపోయింది. తనుకూడ పద్మావతీ కాలేజిలోనే జాయిన్ కావాలంటూ, హాస్టల్ మీల్స్ గురించి, రూల్స్ గురించి అడిగేస్తూ, అప్పటికే వారితో స్నేహం కట్టేసింది. వాళ్ళ రూల్స్ విని చప్పరించింది. 'మా హాస్టల్లో వుండి ఆ తిండి తిన్నవాళ్లు, ఢోకాలేకుండా ఎక్కడయినా వుండగలరు' అని చెప్పి వాళ్లను నవ్వించింది

తిరుమలకి తూర్పుగ ఒక కిలోమీటరు దూరంనున్న గోగర్భం వెళ్ళారు. అక్కడ నీళ్లు రాళ్లమధ్యగా ప్రవహిస్తున్నది. ఆ నీళ్లకి అడ్డ కట్ట కట్టి రిజర్వాయర్ ఏర్పాటుచేశారు. అక్కడనుంచి పాపనాశనానికి ఆనకట్ట మీదుగా వెళ్లారు.

పాపనాశనానికి వెళ్లేముందు ఆకాశగంగను చేరారు. రోడ్డునుంచి క్రిందకు 30 మీటర్లు దిగారు అందరికంటె ముందు మాధ్వి దిగింది. సిద్ధార్థ, వాసంతి బస్సులోనే వుండిపోయారు. ఒకరిద్దరు అమ్మాయిలు కామెంట్సు విసిరి, 'మాధ్వి వుందే' అని అనుకుంటుంటే, మాధ్వి పకపక నవ్వేసింది వాళ్ళ జోక్స్‌కి.

అమ్మాయిలు ఎంతకీ పైకి రాకుంటే బోయ్ బోయ్‌మని హారన్ కొట్టాడు డ్రైవరు.

పాపనాశనం చేరుకున్నారు. అక్కడ వున్న టీ అంగడిలో దూర్కి, టీ తాగారు శనక్కాయలు కొనుక్కున్నారు. కోతులకి వేస్తున్నారు కొందరు, మరికొందరు మూడు మీటర్ల ఎత్తునుండి పడే నీటిధార క్రింద చేరి, యాత్రికుల్లో కలిసిపోయారు.

పుస్తకాల పురుగులు కొందరు ప్రక్క అడివిలోకి వెళ్ళారు ప్లాంట్ కలెక్షన్‌కి. అందులో ఒకమ్మాయి పాము కరిచినట్లు కెవ్వుమంది, సైకస్ చెట్టుమిని చూపి.

"అబ్బా - నాకు స్పెసిమన్ దొరికిందే" అంటూ, ఆ చుట్టుప్రక్కల తిరిగి మేల్‌కోన్స్, ఫిమేల్‌కోన్స్ కలెక్ట్ చేసింది.

కొండ ఎక్కిన సిద్ధార్థ, తన వెనుక వచ్చిన వాసంతికి, మరి ఇద్దరు అమ్మాయిలకు ట్రీఫెరన్స్ చూపించాడు. ఈకల్లాంటి ఆకులు త్రుంచు

వైపు చూశాడు. దీర్ఘంగ సిద్ధార్థనే చూస్తున్న వాసంతి పట్టుబడిన దానిలా చూపు మరల్చుకుంది.

తడి బట్టల్తో బస్సు ఎక్కారు స్టూడెంట్సు. మాధ్వి గబగబ వచ్చి, సిద్ధార్థ పైకండువా లాగేసుకొని, తల, ముఖం తుడుచుకుంది.

"మారు బట్టలు లేకుండా ఎందుకు తడిశావు?" అన్నాడు సిద్ధార్థ.

నోటికి వచ్చిన మాట అనబోయి, ఆపుకుంది మాధ్వి వాసంతిని చూసి.

చివరగా, తుంబుర తీర్థం చూసి పోదామన్నారు. పాపనాశనంనుండి తూర్పుగ ఎనిమిది కిలోమీటర్లు తిరిగి ప్రయాణం చేశారు. ప్రకృతి ఎంతో సుందరంగ వుంది. అందరూ మాటలు మాని ఆ ప్రయాణంలోని సుఖానుభూతిని పొందసాగారు. తుంబుర తీర్థం కొండలో బాగా లోతుగనున్న లోయనుంచి ప్రవహిస్తూ గుహలోంచి బయటకు వచ్చినట్లుంది.

"ఆ గుహ ముఖ ద్వారం నుంచి అర్థ కిలో మీటరు ఆ ఇరుకు సందులోనుంచి పోతే, తీర్థం పుట్టుక చూడొచ్చు" సిద్ధార్థ మాటలు విని, "మేడమ్ పోదాం, పోదాం" అని అరిచారు, అప్పటికే ప్రకృతి సౌందర్యంలోని మాధుర్యం తల కెక్కిన అమ్మాయిలు.

"మీరేమంటారు?" అన్నట్టుగ చూసింది వాసంతి.

"ఎప్పుడనుకుంటే అప్పుడు పోవటానికి కుదరదు. ఇక్కడ చిరుతలు, ఎలుగుబంట్లు వుంటాయి" అన్నాడు. కేకలు వేస్తూ అమ్మాయిలు బస్సు ఎక్కారు.

"నిజమా?" అడిగింది మాధ్వి. ఆరి ఆరని బట్టల్లో పరుగుల్లో అలసిపోయిన ముఖం ఎర్రగ కందినది.

"మాధ్వి నిజంగా ఒక చిరుతను పట్టుకొస్తే కానీ నమ్మదు"అన్నాడు సిద్ధార్థ.

"మాధ్వి-పేరు క్రొత్తగా వుంది" అంది వాసంతి.

మాధ్వి కళ్ళ వైపు చూస్తూ, 'అబ్బ! ఎంత చక్కటి కళ్ళు-ఆ కనురెప్పలు బిరుసుగ వెనక్కి తిరిగివున్నాయి' అనుకుంది.

"సిద్ధార్థ, పేరు పాతదే కదూ మేడమ్" అంది మాధ్వి, సిద్ధార్థ వైపు చూస్తూ.

వాసంతి బస్సు ఎక్కుతూ, "మీరు దూరము, దిక్కులతో సహా చెపుతున్నారు. రీసెర్చి చేయలేదు కదా!" అంది.

దానికి జవాబు మాధ్వి ఇచ్చింది, "ఏ కాలేజి అమ్మాయిలు పిక్‌నిక్‌కి

వచ్చినా, అతనూ, అతని స్నేహితులు వెంటబడి వచ్చేవారట.''

అమ్మాయిల నవ్వులతో బస్సు అదిరిపోయింది. నవ్వుతూ చూపిన వాసంతి చూపులనుంచి చూపులు మరల్చుకున్నాడు సిద్ధార్థ.

'నల్లపిల్ల' అని లోలోపల తిట్టుకున్నాడు.

చీకటిపడ్డ తర్వాత గదికి చేరుకున్నారు సిద్ధార్థ, మాధ్వీలు.

''ఎప్పుడు తిన్నారో, ఎక్కడ తిన్నారో!'' అంటూ సౌభాగ్యమత ఆకుల్లో ప్రసాదం వేసిచ్చింది.

''అమ్మా-ఆ బుద్ధూగారికి ఆకలి లేదట.''

స్నానంచేసి వస్తున్న సిద్ధార్థను చూస్తూ, ''ఎందుకని'' అని అడిగింది సౌభాగ్యమ్మ.

''అబ్బో! అబ్బో! ఎంతమంది అమ్మాయిలు! చిన్ననాటి స్నేహితురాలు వాసంతిని చూశాడుగా!''

సౌభాగ్యమ్మ పకపక నవ్వుతూ. ''అవునా బాబూ!'' అంది. ఆవిడ నటు వోనిచ్చి, ''వాసంతి బాగుంది కదూ!'' అన్నాడు మెల్లగ.

''పేరు బాగుంది. స్టైల్‌గా తయారయింది కనుక బాగుందనిపిస్తుంది. ఫాషన్స్, కొందరిలోని లోపాలను కప్పివేస్తాయి. అందానికి నిర్వచనం మా వదిన'' అంది మాధ్వి.

అప్పుడు జ్ఞాపకం వచ్చినట్లు, ''అన్నయ్య, వదిన ఎక్కడ'' అంది.

''ఏ చెట్టు పుట్టలు పట్టుకు తిరుగుతున్నారో'' అన్నాడు సిద్ధార్థ.

*　　*　　*

కారియర్స్ తెప్పించుకుని భోజనాలు చేశారు. సౌభాగ్యమ్మ మజ్జిగ మాత్రమే తాగుతూ ''బాబూ మీ నాన్నగారు, అన్నయ్యగారు చిన్న పిల్లల్లా తిరుగుతూ, కంటికే కనిపించలేదు. నన్ను ఏకాంతసేవకి తీసుకుపోతానన్నారు'' అంది.

''అన్నీ క్రొత్త గుండ్లే, మరి ఇందరిలో వారిని పట్టుకోవటము కష్టమే'' అంది మాధ్వి.

అందరి ముఖాల్లో నవ్వులు వెలిశాయి.

''అమ్మా-మీ బుద్ధుగారిని తీసుకు వెళ్ళండి. ఆ అమ్మాయిలకి ఎంత బాగా చూపించారని.''

సౌభాగ్యమ్మకి కూతురి పెళ్ళిలో ఏ చింతాలేని మనస్సు దేవుని మీదకు పోయింది.

''ఈ రోజు సుప్రభాతానికి నన్ను లేపలేదెందుకని? రేపు లేపాలి. వేంకటేశ్వర మహత్యంలోని యాదవ వంశస్థుడ్ని చూడాలి'' అంది మాధ్వి.

"ఆహా! ఏమి కోరిక" అన్నాడు సిద్ధార్థ.

"కోరిక మరి. సుప్రభాతం కాగానే బంగారు తలుపులు తీసి, మొదట స్వామి దర్శనం చేసుకునేవాడు గొప్పవాడుకాదా?" అంది.

"ఏకాంత సేవలో తాళ్ళపాక వంశస్థుడు గానం చేస్తాడు, అతన్ని చూడవా?" అన్నాడు సిద్ధార్థ.

"ఆ సంగతి నాకు తెలియదు" అంది మాధ్వి

"అతను మా జిల్లావాడే-వారిది తాళ్ళపాక, స్వామి మీద ముప్పై రెండువేల కీర్తనలు వ్రాశాడు. స్వామి పవళించి వుండగా, గానము చేస్తాడు."

"అయితే తప్పక చూడాల్సిందే-" అంది మాధ్వి.

లాన్‌లో పేము కుర్చీలలో వున్న విపుల్-అజంతలు, వుదయిస్తున్న చంద్రుని చూస్తున్నారు.

సౌభాగ్యమ్మ బయలుదేరుతూ, వారిని కూడ రమ్మంది.

"నేను రాలేను, మీరు వెళ్ళండి" అంది అజంత.

సౌభాగ్యమ్మకు తెలుసు, నిజంగానే అజంత అలసిపోయిందని. కాని శుభకార్యం జరుగలేదు. ఇలా ఒంటరిగ వదిలితే, పిల్లలు తొందర పడతారేమొ, ఇక్కడ దంపతులు కలుసుకోకూడదంటారు' అనుకుంటూ, విపుల్‌ని రమ్మన్నది. విపుల్‌కి లేవక తప్పలేదు.

ఊయల మంచంపై, ముఖమల్ పరుపు పరిచి, స్వామి వుత్స విగ్రహాన్ని పడుకోబెట్టారు. పాలు, అరటి పండు స్వామికి అర్పించారు. సన్నాయి వాయిద్యం మొదలైంది.

విపుల్ మెల్లగా లేచి, లోలోన నవ్వుకుంటూ బయటకు వచ్చాడు. నిన్నటినుంచి వారికి ఏకాంతం దొరకనేలేదు. ఈ చాదస్తాలతో చచ్చి పోతున్నాను అని విసుక్కున్నాడు. అజంత కాటేజిలోనే వుంది. ఈ అవ కాశాన్ని ఇచ్చిందని మురిసిపోయాడు.

ప్రేమ- కోరికలో హృదయవేగం హెచ్చింది. కాటేజికి వెళ్ళి, తలుపులు దగ్గరగా వేసి, పడక చెంతకు చేరాడు.

అజంత కడుపుపై దిండు నుంచుకొని పడుకొని వుంది. ఆ మగత నిద్రలోని సౌందర్యం, రెప్పల నీడ వింతగ వుంది. మెల్లగ దిండు తీశాడు. కళ్ళు విప్పింది. కన్నులు నిద్రలో ఎరుపు రంగును పుంజుకొని మనో హరంగా వున్నాయి. ఆమె నవ్విన నవ్వు నీరసంగా వుంది. చేతుల్లోకి తీసుకున్నాడు. అజంత శరీరం వణుకుతుంటే మరీ దగ్గరగ అదుముకున్నాడు.

ఆమెకు కలిగిన వుద్వేగంలో కడుపులో సన్నసన్నగా బయలుదేరిన నొప్పి వుధృతమైంది. ఆ బాధకి మెలికలు తిరిగి పోసాగింది.

''అజంతా- ఏమిటి!'' అన్నాడు మెల్లిగ.

''నొప్పి- కడుపులో'' అన్నట్టుగా చూపించింది.

''అలాగా'' అన్నాడు ఏమి చేయాలో తోచక.

అతని కళ్ళల్లో నిరాశ ద్యోతక మవుతూంది. ''క్షమించండి. మీ ఆనందాన్ని పాడుచేశాను.'' అంది ఆయాసంగ. మగతగ కళ్లు మూసుకు పోయాయి.

గాబరాగా బయటకు వచ్చి, రోడ్డుపై పడుకున్న దేవస్థానం మనిషిని అడిగాడు''ఇక్కడ డాక్టరున్నాడా!'' అంటూ. ఉన్నాడని తెలుసుకొని వెళ్ళాడు. అంతలోకి సౌభాగ్యమ్మ వాళ్ళు వచ్చారు.

డాక్టరు వచ్చి ఇంజక్షన్ వేసి ''ఎందుకైనా మంచిది, రూయా హాస్పిటల్‌కు తీసుకెళ్ళమని'' సలహా యిచ్చాడు. అప్పటికప్పుడు తిరుపతికి ప్రయాణం కట్టారు.

పెద్ద డాక్టరువచ్చి పరీక్షించాడు. అప్పటి నుంచీ ఏవేవో-ఇంజక్షనులు వేస్తూనే వున్నారు. అన్ని పరీక్షలు జరిపి, కడుపులో కాన్సర్ వుందని చెప్పారు. అందరు షాక్ కొట్టినట్లు స్థంభించిపోయారు.

ఏడ్వటానికి కూడ భయపడింది, సౌభాగ్యమ్మ.

''పాతిక నిండని అమ్మాయికి కాన్సరా, వట్టిదే, వట్టిదే, బాగా పరీక్షించండి డాక్టర్'' అని విలపించింది. సిద్ధార్థ వంచిన తల ఎత్తలేదు. విపుల్‌కి శూన్యంలో ఏ ఆధారం లేకుండా వ్రేలాడు తున్నట్లువుంది. 'అంత వరకు అందంగ కనుపించిన ప్రపంచం వట్టి బూటకం. అంతవరకు బంగారు వూయలలో వూపినట్టు వూపి, అగాధంలోకి తోశారు. ఎవ్వరు? వీళ్ళే- నన్ను మోసగించారు. కడుపులో పుట్టెడు జబ్బు పెట్టుకొన్న అమ్మాయికి పెళ్ళి చేశారు. వారి మంచితనం వెనుక ఎంతకుట్ర, ఎంత దగా. తన బంగారు జీవితాన్ని బలిగొన్నారు. అతనికి కలిగిన దుఃఖాన్ని కసిగా మార్చుకున్నాడు.

''సస్పెక్టెడ్ కాన్సర్ అయినా రిస్క్ తీసుకోకూడదు. అంతగ ముదరక మునుపే ఆపరేషన్ చేస్తే మంచిది'' అన్నాడు డాక్టరు.

''పిల్లలు పుట్టే అవకాశం వుందా?''

డాక్టరు జాలిగా నవ్వాడు వారి అమాయకత్వానికి. "గర్భ సంచిలోనే కురుపు, అది పూర్తిగా తీసివేయాలి. ఆపరేషన్‌కు తయారు కావాలి'' అంటూ అక్కడి నుండి వెళ్ళిపోయారు.

అందరూ కుమలికుమిలి దుఃఖిస్తున్నారే కాని, ఆపరేషన్‌కు వప్పు కున్నామని ఏ ఒక్కరూ చెప్పలేదు. సౌభాగ్యమ్మ ''అమ్మాయిని మరొక

పెద్ద ఆస్పత్రికి తీసుకుపోదాం'' అంది ఏడుస్తూ.

సిద్ధార్థ డాక్టరు రూముకి వెళ్ళి. ''బాంబే కాన్సర్ హాస్పిటల్ కైనా, లేక మరెక్కడకైనా వెళ్ళమంటారా సలహా ఇవ్వండి డాక్టర్'' అన్నాడు. డాక్టరు ఆలోచిస్తున్నట్లు తలూపాడు.

అంతలో ప్రక్కవార్డు నుంచి, బాధగా పెద్దగా ఏడ్పు వినిపించింది. ఆ ఏడ్పు విన్న డాక్టరు ముఖం నల్లగా మారిపోయింది.

''కమాన్ ...'' అంటూ సిద్ధార్థని తీసుకొని వెళ్ళాడు. ఆ గదిలోని అమ్మాయికి మాధ్వి వయసుంటుంది. చక్కని తెలుపు. చూడ గానే అందగత్తె అనిపిస్తూంది. చిక్కిపోయిన ముఖంలో కళ్ళు మరీ పెద్దవిగ విశాలంగ వున్నాయి. ఆ బాధ అంతా కళ్ళలోనే ప్రతిబింబిస్తూ వుంది.

కూర్చున్న ఆ అమ్మాయి డాక్టర్‌ని చూడగానే, ''డాక్టర్- కిల్‌మి- కిల్‌మి-'' అంటూ ఏడ్చేసింది.

''రజనీ- వూరుకో,'' అని, నర్స్‌కు ఇంజక్షన్ వేయమని చెప్పాడు. తర్వాత కాసేపటికి ఆ అమ్మాయి పడుకుంది.

ఆ గదిలోనే ఒకమూల ముఖాన్ని చేతుల్లో కప్పుకుని కూర్చున్న ఆమెను చూశాడు సిద్ధార్థ. సిద్ధార్థ, డాక్టరు కన్సల్టింగ్ రూమ్ కొచ్చారు.

''చూశావా- ఆ అమ్మాయి నా స్నేహితుని కూతురు. మోకాలు దగ్గర కణితలా వచ్చింది. "అది కేన్సర్ అని, వెంటనే కాలు తీసేస్తే మంచిది. ఆలస్యం చేసి, రక్తంలోకి పోయిన తర్వాత అదీ చేయటానికి వీలుండదు" అని చెప్పా.

''అమ్మాయికి కాలుతీస్తే ఎలాగ, కాన్సర్ కాదేమో'' నంటూ అక్కడా, ఇక్కడా త్రిప్పి. చెప్పిన వైద్యాలన్నీ చేసి, చివరికి నా దగ్గరకే వచ్చారు. అప్పటికే చేయి దాటిపోయింది. ప్రాణంపోయేదాక మత్తులో వుంచటమే నేను చేయ గలిగింది" చెప్పుతుంటే డాక్టరు కళ్ళల్లో నీరు గ్రిరున తిరిగింది.

సిద్ధార్థ ముఖాన్ని చేతుల్లో వుంచుకున్నాడు. అతని భుజాల కదలికను బట్టి అతను ఏడుస్తున్నాడని డాక్టరు గ్రహించాడు. దుఃఖం వుపశమించిన తర్వాత సిగ్గుగా ముఖాన్ని పైకెత్తాడు.

డాక్టరు అప్పుడే జ్ఞాపకం వచ్చినట్లు ''ఏదో కాన్ఫరెన్సుకు న్యూ యార్కునుండి డాక్టరు దీమోడర్ మిల్లర్, కాన్సర్ స్పెషలిస్టు మద్రాసుకు వచ్చారు. ఆయన వొపీనియన్ కావాలంటే తీసుకోవచ్చు'' అన్నారు.

మద్రాసుకు వెళ్ళి, ప్లెయిన్‌లో డాక్టరును తీసుకు వచ్చాడు.

"ఆపరేషన్ చేయండి. పిల్లలు లేకుంటే పోయింది. నా బిడ్డ నాకుం

టుంది. బిడ్డలు లేనివాళ్ళు ఎంత మంది లేరు లోకంలో'' అంది పూరట చెందిన సౌభాగ్యమ్మ. విపుల్ మనస్సు నిర్వికారంగ వుంది. అజంతకు ఆపరేషన్ చేసి పడకమీదకు చేర్చారు. అజంతకు తెలివి వచ్చేంత వరకు దగ్గరే వున్నాడు. అజంత కళ్ళు విప్పింది. కాని విపుల్‌ని చూచేందుకు ధైర్యం చాలలేదు.

విపుల్ అజంత చేతిని తీసుకొని ముఖానికి చేర్చుకున్నాడు. అప్పటి వరకు బిగబట్టిన దుఃఖం ఆగనంది. అతని కన్నీటితో అజంత చేయి తడిసి పోతూంది.

''భగవంతుడు కొంతయినా కనికరించాడు. అమ్మాయి అయినా దక్కింది.'' అని సత్యనారాయణ కొడుకుని వోదార్చాడు.

'అజంత దక్కింది' కాని తన బాధ ఎవరికి అర్థమవుతుంది. జీవిత మంతా తనూ, అజంతా, పిల్లలు లేకుండా గడపాల్సిందేనా- తనలాంటి కొడుకు తనకు కావాలను కున్నాడు.

అజంతను-తన పిల్లలకు తల్లిగా ఎన్నో తీయని వూహల్లో వూగి పోయాడు. 'అవన్నీ ఇక ఎండమావులే ' తండ్రి వెంట వెళ్ళిపోయాడు విపుల్.

మాధ్వి అన్నయ్య ముఖం చూడలేక తప్పుకుంది. బంగారన్నయ్యకి ఎందుకీ శిక్ష? అణువణువు ప్రేమను నింపుకొని, యితరులకు ప్రేమను పంచిపెట్టి అన్నయ్యకు ఎందుకిలా జరిగింది తాను అదృష్ట విహీన పుట్ట గానే తల్లిని పోగొట్టుకొంది. అరిందలా, తన చేతులారా అన్నయ్యకు ఈ విధిని నిర్ణయించింది. తన పాపానికి ప్రాయశ్చిత్తంలేదు. వెక్కి వెక్కి ఏడుస్తున్న మాధ్విని దగ్గరకు తీసుకొని ''చెల్లెమ్మా మనకు ఎంత వరకు ప్రాప్తమో, అంతే దక్కింది'' అన్నాడు విపుల్.

*　　　　*　　　　*

రెండు నెలల తర్వాత అజంతను ఆస్పత్రి నుండి డిస్చార్జి చేసారు. విపుల్ అజంతను చూడ్డానికి రాలేదు సరికదా లెటర్ కూడ వ్రాయలేదు

మధురమైన జీవితం కలగా కరిగిపోయింది తనను అతను చేర దీస్తాడా ? ఆలోచనలతో అజంత బుర్ర వేడెక్కిపోయింది. తన జీవి తాన్ని కాలాపికే వదిలేసింది

అమ్మాయి జబ్బు దాచి, తమను మోసగించారని, విపుల్, సత్య నారాయణ, తమని దూషిస్తారేమోనని భయపడ్డారు వెంకటపతి, సౌభాగ్యమ్మ.

''భార్య కావాలనుకుంటే వస్తాడు, మనబిడ్డ మన దగ్గరే వుంటుంది'' అని వెంకటపతి భార్యను ఓదార్చాడు.

*　　　　*　　　　*

అజంతను చూద్దామని వున్నా వెళ్ళలేకపోయాడు. విపుల్ కలగా జరిగిపోయినా, ఏవో మధుర స్మృతులు, కలవరింత కలిగిస్తూనే వున్నాయి. కాని వెళ్ళి చూడ్డానికి మనస్సు మొండికేసింది. ఇంట్లో ఒంటరి జీవితం భరింప లేకున్నాడు మాధ్వి కాలేజికి వెళ్ళిపోయింది. సత్యనారాయణ ఏదో స్వామి దగ్గరకు వెళ్ళారు

చీకటి మెల్ల మెల్లగా గదిలోకి వస్తున్నా లైటు వేసుకోవాలనిపించ లేదు.

గదిలో లైటు వెలిగింది. కళ్ళు తెరిచి, అక్కడ రసజ్ఞను చూసి, లేచి నిల్చుని, కూర్చోటానికి కుర్చీ చూపించాడు మౌనంగ.

"మాస్టారూ" అంది రసజ్ఞ పలకరింపుగ.

'తనను పరిహసించటానికి రాలేదు కదా' అనుకుంటూ, "రసజ్ఞా-ఏ పాప మెరుగని అజంత శిక్ష అనుభవించింది, నీ శాపం ఫలించింది. "

"అలా అనుకుంటే మీరు నన్ను క్షమించండి మాస్టారూ . క్షణి కోద్రేకంలో అలా అన్నాను "

"క్షమ నీవు చేసిన నేరమేమిటి రసజ్ఞా? ప్రేమించటం నేరము కాదే?"

"నా మీద కోపంలేదా మాస్టారూ..."

"పిచ్చి పిల్ల" నవ్వాడు.

విపుల్ నవ్వుచూసి, రసజ్ఞ మనస్సు ద్రవించిపోయింది. ఎంత ట్రిమ్‌గ వుండేవారు. క్రొత్తగా చోటు చేసుకుంటున్న మీసాలు, పెరిగిన గడ్డం లోతుకుపోయిన కన్నులు చూసి నిట్టూర్చింది.

కాస్సేపు కాలేజి కబుర్లు, పాఠాల విషయము మాట్లాడింది.

"మాస్టారూ-నామీద కోపం లేకపోతే, నాకు ఓ గంట ట్యూషన్ చెప్పండి "

"ఇది తనకు పరీక్ష కాదుగదా " సాలోచనగా రసజ్ఞ వైపు చూశాడు.

రసజ్ఞ నవ్వు ముఖంలో "నాకే కాదు మాస్టారూ-విరిజ, వనజకూడ వస్తామన్నారు" అంది.

విపుల్‌కి ఒప్పుకోక తప్పలేదు.

* * *

రోజులు గడుస్తున్నాయి. రాత్రి వచ్చి నిద్ర పుచ్చితే. పగలు నిద్ర నుండి లేపుతుంది. అలా కాలం మానవుల్ని నడిపిస్తుంది. అజంత యాంత్రికంగ జీవితాన్ని నెట్టేస్తూంది.

మానసిక బాధ కృంగదీస్తున్నా, శారీరకంగ ఆరోగ్యం చేకూరింది. మనస్సు నిత్యం విపుల్ మీదే లగ్నమవుతూ వుంది. విపుల్ రాలేదు, కనీసం ఉత్తరం కూడ వ్రాయలేదు! భర్తే అయినా, తను అవసరం లేదనుకున్న భర్త ఇంటికి పోవటానికి అభిమానం అడ్డొస్తూ వుంది. చేస్తున్న వుద్యోగానికి రాజీనామా ఇచ్చింది. మరో చోట ఉద్యోగానికి ప్రయత్నించాలనుకుంది.

బాల్కనీలో కూర్చుని, ఆలోచనల్లో మునిగిపోయిన అజంత, సిద్ధార్థ వచ్చి ప్రక్కన నిల్చున్నది గమనించనేలేదు. ఒళ్ళో తెరిచి పెట్టుకున్న నవల వుంది కానీ, పేజీలు మాత్రం త్రిప్పుటలేదు. ఎప్పటినుంచో చూపు ఆ పేజీమీదే వుంది.

చిక్కిపోయి, మరీ టీనేజ్ పిల్లలా వుంది. అజంత పెళ్ళయిన అమ్మాయంటే ఎవ్వరూ నమ్మరు. ఎలా నమ్ముతారు? ఒక్కరోజైనా కాపురం చేస్తేగా! చెల్లెలిపై ప్రేమతో హృదయం మూలిగింది.

"అజంతా!"

ఎంతో నెమ్మదిగా పిల్చినా, వులిక్కిపడింది. ఒళ్లో పుస్తకం క్రింద పడిపోయింది సిద్ధార్థ వైపు చూసిన అజంత కళ్లల్లో నీళ్లు, దగ్గరగా కుర్చీ లాక్కొని కూర్చున్నాడు. తెచ్చిపెట్టుకున్న నవ్వుతో, "ఎప్పటికో ఇంటికి వచ్చి, ఇలా దడిపించటమేనా నీ పని" అంది.

"ఒంట్లో ఎలా వుంది? ఇంకా బలమే రాలేదు." క్రింద పడిన పుస్తకాన్ని తీసుకొని, అట్టమీది బొమ్మ చూస్తున్నాడు.

"నాకేదైనా ఉద్యోగం చూడు. ఇంట్లో మరీ బోర్‌గ వుంది" అంది.

"ఉద్యోగమా! విపుల్ దగ్గరికెళ్లవా?" ఆ ప్రశ్న క్రొత్తగా వుంది అజంతకు. ఇంత అమాయకుడా సిద్ధార్థ! నీరసంగ నవ్వుతూ, "అతను పిలవందే" అంది.

'పిలిస్తేనే పోవాలి, ఇంత అభిమానమా ఈ ఆడవాళ్లకి' అనుకున్నాడు.

గోడమీదున్న పెయింటింగ్ కళ్లబడింది - అదొక వనం, అనసూయ, ప్రియంవదలతో వెళ్లుతున్న శకుంతల, వెనుకనున్న దుష్యంత మహారాజును చూడాలనుకుంటుంది. వెనక్కి తిరిగి చూడ్డానికి అభిమానం అడ్డొస్తూంటే, కాలికి ముల్లు గ్రుచ్చుకున్నట్లు అభినయిస్తూ వెనక్కి తిరుగుతుంది

అన్నగా తనకు బాధ్యత వుంది, ఏం చేయాలి?

"ఆ విపుల్‌ని తన్ని లాక్కురమ్మంటావా" అన్నాడు పళ్లు బిగబట్టి. అలా అన్న సిద్ధార్థని చూసి నవ్వింది. ఇంత మృదుమధురంగ వున్న అజంతను పెళ్లి చేసుకొని, వదిలిన విపుల్ మూర్ఖుడు. ఉన్న ఒక్క చెల్లి

జీవితం మ్రోడువారిపోతే, అన్న కెలా వుంటుందో అతని కెలా తెలుస్తుంది. తెలియజెప్పాలి. ఎలా? ఎలా?

పనిపిల్లవాడు ఆ రోజు వచ్చిన ఉత్తరాలు తెచ్చి ఇచ్చాడు. ఆత్రుతగా అందుకుంది, విపుల్ వ్రాశాడేమోనని. అతని ఉత్తరంకోసం నిరీక్షించటం అలవాటైంది అజంతకు.

మాధ్వి వ్రాసిన ఉత్తరం అది. అయినా విపుల్ దగ్గరనుంచి వచ్చి నంత సంతోషం కలిగింది.

ప్రియ బాంధవీ - వదినా,

మిమ్మల్ని చూసి చాలకాలమైనట్లు వుంది. అప్పుడే ఆరు నెలలు గడిచిపోయాయి. వదినా - ఈ హాస్టల్ మీల్సు ఫరవాలేదు, అయినా, వచ్చీ పోయి ఈ గరల్స్ హాస్టల్సన్నీ ఒకేలాగుంటాయి.

నాన్నతోకూడ పర్మిషన్ లేకుండా మాట్లాడకూడదు. అలా రూల్స్‌తో కొందరు బాధపడుతూంటే, ఆ రూల్స్ మనకి కాదని కొందరు తిరుగు తుంటారు. పిక్చర్‌డే నెలకొకసారి వుంటుంది. కాని సినిమా పిచ్చి వున్న వాళ్ళు, మ్యాట్నీలకి, మార్నింగుషోలకి (దొంగ సినిమాలకి) పోతుంటారు.

మేము పిక్చర్‌కు వెళ్తున్నట్లు ఎలా తెలుస్తుందో కాని థియేటర్ దగ్గర మమ్మల్ని రిసీవ్ చేసుకోవటానికి నిల్చునివుంటారు అబ్బాయిలు. దాని వల్ల వారికి కలిగే ఆనందమేమిటో వారికే తెలియాలి.

వెనకాల సీట్లలో కూర్చుని, సీటు ముక్కలు కోసి, అమ్మాయిల మీదికి విసిరేస్తారు. మొదట మొదట మెత్తగ వచ్చి పైన బడితే కప్పల వర్షం అని కెవ్వుమన్నాం. అలా మంచి సీట్లను నిర్దయగా ఎలా కోసి వేస్తారో! క్రిమినల్ మైండ్ కదూ?

ఇక మమ్మల్ని సినిమాలకి తీసుకెళ్ళరేమో? మేము వస్తున్నామని తెలిసి, ముందుగానే థియేటర్‌లోకి వెళ్ళి, ఒక్కొక్క సీటు వదిలి కూర్చుం టారు అబ్బాయిలు. అంటే ఒకబ్బాయి, ఒకమ్మాయి కూర్చునేలాగ, మేనే జరు వచ్చి, ఆ అబ్బాయిల్ని రిక్వెస్టుచేసి. సీట్లు ఖాళీ చేయించే లోపల సినిమా బిగిన్ చేస్తారు.

ఆంధ్రదేశంలోని గర్ల్ ఒక్క సినిమా చూడాలంటే ఎంత అవస్థకు గురి కావల్సి వస్తుందో చూశావా వదినా? మన రాష్ట్రం ఎపుడు బాగుపడు తూంది. రాజకీయాల్లో మేమున్నామంటారు స్టూడెంట్సు. ఒకరు పెట్టుకున్న తగాదాకి, మేమున్నాం అంటూ అందరూ పోయి, వాళ్ళ ప్రాపర్టీని ధ్వంసం చేసి వస్తారు. అందులో న్యాయం ఎంత వుంది? ఇతరులకి కష్టం కలి గించని అల్లర్లు ఎన్నయినా చేసుకోవచ్చు. డీ మోరల్స్‌లోకి దిగిజారిపోతేనే

బాధగా వుంటుంది. భావి భారత భవిష్యత్తు ఎలా వుంటుందోనని బెంగగా వుంది.

ఈ ఉత్తరం పడుకొని వ్రాస్తున్నాను. ఎందుకంటే కాళ్ళు స్వాధీనంలో లేవు. తిరుమలకి నడచిపోయాము. హుషారుగా ఎక్కినా, వచ్చేప్పుడు బస్సులో వచ్చాము. బుద్ధూగారు అడుగడుగునా జ్ఞాపకం వచ్చారు. ఆ మరచిపోయాను-మిస్ వాసంతి ఒకటే కలవరిస్తూవుంది.

పదేపదే అడుగుతూంది. ఒక ఉత్తరం వ్రాయాలట అంటే వదినా-మన బుద్ధూని ప్రేమిస్తున్నట్లే కదూ, పరీక్షలు కాగానే నేనక్కడికే వస్తాను. వాసంతిని రమ్మంటే వచ్చేలాగుంది. కాని, చెంపలు వేసుకుంటున్నాను, బాంధవీ. ఎందుకో నీకూ తెలుసు. అమ్మ ఎలా వుంది? ఆ రోజు శుక్రవారం అభిషేకం చూడాలనుకుంది. నేను ఈ ట్రిప్పులో ఫ్రీగా స్వామి దర్శనం కొట్టేశాను. కాళ్ళీడ్చుకుంటూ, మేము వెళ్ళేటప్పటికి సుప్రభాతం, విశ్వరూప దర్శనం ముగిశాయి.

దర్శనానికి క్యూలో నుంచోవాలి, గురువారం రాత్రి స్వామి అలివేలు మంగాపురానికి వెళ్ళి అలసిపోయి వచ్చారట, అందుకు అభిషేకానికి తయారు చేస్తున్నారు, మా గుంపు దిగాలుపడి వున్నాం.

అంతలో పట్టు పంచెలు కట్టి. పెద్ద పెద్ద బొజ్జలున్న వి. ఐ. పీసు కాబోలు, ధీమాగ లోపలికి వెళ్తున్నారు. నా ప్రక్కనున్న సరోజ చెయ్యి పట్టుకొని (అది వొట్టి ఛాదస్తురాలు. ఇప్పటినుంచే స్నానాలు, వ్రతాలు, పూజలు చేస్తుంది) వి. ఐ. పీల వెంట పడ్డాను. వాళ్ళకి నేనెవ్వరో తెలియదు. దేవస్థానం వుద్యోగస్థులు నా ధీమా చూసి వాళ్ళమ్మాయి అనుకున్నారు. వి. ఐ. పీ. లతోటి సకల మర్యాదలు పొందుతూ గర్భగుడి ప్రవేశించాను. సరోజతో అపుడు చూశాను స్వామిని ఏ అలంకరణలు లేకుండ, నాలో కూడ భక్తి పారవశ్యం కలిగి, రెండు చేతులు పైకెత్తాను. అభిషేకం చేసేప్పుడు ఆభరణాలు ఏవీ లేవు కాని, శంఖు చక్రాలున్నాయి. అవి ఎందుకు తీయలేదని ఓ పిల్ల పూజారిని అడిగాను. అతను మంత్రంలా చెప్పాడు, అసలు విగ్రహానికి శంఖు చక్రాలు చెక్కలేదని.

అభిషేకం చేసేప్పుడు స్వామి నామం పూర్తిగ తీసి వేశారు.

ఆ నామాన్ని స్వామి పాదాల వద్ద వుంచి, మహా ప్రసాదంగా భక్తులకు ఇచ్చారు. అభిషేకం అయిన తర్వాత, పల్చగా నామం పెట్టి, నూలు గుడ్డ మొలకు చుట్టి అభిషేక దర్శనం ఇచ్చారు. సరోజ భక్తి మైకం వచ్చి పడిపోయింది.

అమ్మకి, వెంకటపతి మామయ్యకి నమస్కారములు అవి ముగించి,

పి. యస్. గుర్తు ప్రక్కన వ్రాసినది, చదివిన అజంత ముఖంలో రంగులు మారాయి. ఉత్తరంలోకి చూస్తుండి పోయింది. ఆ ఉత్తరం అందుకొని చదివాడు సిద్ధార్థ. "రసజ్ఞ-మీకు గుర్తు వుండి వుంటుంది. పట్టు చీర కూడా పెట్టాం అన్నాయ్‌తో మరీ సన్నిహితంగ వుంటుంది. అన్నయ్య మనస్సు తెలుసుకునేటంత వయస్సు, మనస్సు నాకు లేదని మీకు తెలుసు."

సిద్ధార్థ ముఖం బిగుసుకుంది. ఆ ఉత్తరాన్ని నలిపి, వుండగా చుట్టి కసిగ విసిరి కొట్టాడు.

* * *

సంధ్య చిక్కనవుతూ వుంది. మనస్సును చుట్టుకున్న బాధలా బూడిద రంగులో వుంది ఆకాశం. మిణుకు మిణుకు మంటూ ఏకాకిగా వుందో నక్షత్రం. అలా ఒంటరిగ వున్న నక్షత్రం అజంత దయనీయమైన ముఖాన్ని గుర్తుకు తెస్తున్నది

సిగరెట్టు మీద సిగరెట్టు కాలుస్తూ సిద్ధార్థ ఆలోచిస్తున్నాడు. అజంతకు వచ్చిన సమస్యను ఎలా విడదీయాలి విపుల్‌ని పెళ్ళి తన్నినా, అజంతకు సంతోషం కలుగదు-కోర్టుకు లాగుదామా అంటే మరో పెళ్ళి చట్ట బద్ధంగ చేసుకొనవచ్చు.

"మీ నాన్నగారు వెళ్ళారు, కాని అబ్బాయి పలకలేదట. జబ్బు సంగతి తెలిసీ- మనము త్వరత్వరగ పెళ్ళి ముగించుకున్నా మనుకుం టున్నాడట."

అజంత ఎక్కడ వింటుందోనని మెల్లగ చెప్పింది సౌభాగ్యమ్మ.

ఇంతమంది బాధ విపుల్ ఒక్క తృటిలో తీసి వేయగలడు. ఆ శక్తి అతని కుంది. తోబుట్టువు నిరాశగా, నూరేళ్ళ జీవితం ముగిసిపోయినట్లుగ ఉదాసీనంగ వుంటే కలిగే బాధ అతను వూహించ గలిగితే-అతనూ ఓ చెల్లికి బంగారన్నయ్య అక్కడ ఆగిపోయింది సిద్ధార్థ ఆలోచన.

అతని వూహ అతనికే భయంకరంగ కనుపించసాగింది, కాని చేయక తప్పదు. బిడ్డలా చూసుకొన్న చెల్లి కష్టపడితే అతని మనస్సు గిలగిల లాడుతుంది. అప్పుడు తనకు మనశ్శాంతి లేకపోయినా, తృప్తి మిగులు తుంది. కాలుస్తున్న సిగరెట్టు విసిరేశాడు. కార్పెట్టు మూలగ కాలి, నల్లగ మచ్చ పడుతూంటే చూస్తూ కూర్చున్నాడు.

అనుకున్నదే తడవుగ కారు తీసుకొని బయలుదేరాడు.

* * *

పరీక్ష రోజులు. లాన్‌లో చెట్లక్రింద, టెర్రస్ మీద ఎక్కడ చూసినా అమ్మాయిలు వున్నారు, చేతిలో పుస్తకాలతో, కొందరు పుస్తకాలు వాళ్ళో

వుంచుకొని వాదించుకుంటున్నారు. మరికొందరు బట్టీ పడుతున్నారు. మరి కొందరు కొనుక్కున్న రేగిపళ్ళో, వేరుశనగ కాయలో తింటున్నారు.

అశోక చెట్టు క్రింద కూర్చుని వుంది మాధ్వి, సరోజ దీపారాధనచేసి, దండం పెట్టుకుని, పువ్వు ఒకటి పట్టుకొచ్చి మాధ్వి కిచ్చింది.

ఈ పిల్ల కేమిటో దైవభక్తి పిచ్చి.

"మంచి మొగుడు కొరకేనా?"

"ఛీ పో" అంది సరోజ. "నీవూ ఓ పేరంటాలుగా వెలుస్తావులే, నీ పతిభక్తిలో, చదువుకో. తర్వాత హాస్యాలాడుదువుగాని."

"సరూ! చదువుకోబుద్ధికాలేదు."

"ఏం ప్రేమలో పడ్డావా?"

"ప్రేమా-అలాంటి పిచ్చి పన్లు మనకు లేవు. మా వదిన వకటే జ్ఞాపకం వస్తూంది. తొందరపడి ఉత్తరంలో ఓ మాట వ్రాశాను. పోస్టు చేశాక అనిపించింది, అలా వ్రాయకుండా వుంటే బాగుండేదని. అన్నీ తొందరపాటు పనులు, మా వృద్ధనారి అంటుండేది 'దుడుకు పిల్ల' అని."

"మీ వదిన చాలా అందంగ వుంటుదన్నావు కదూ! పైగా వాళ్ళిద్దరు ప్రేమించుకున్నారు కదా!"

"మా అన్నయ్యకి పిల్లలంటే మోజు. ఎక్కడ చిన్నపిల్లల్ని చూసినా, ప్రపంచాన్ని మర్చిపోతారు. నన్నెంతో ముద్దుగ పెంచాడు. అలాంటి అన్నయ్యకి స్వంత పిల్లలు కావాలని వుండదూ-అసలు వదినకి పిల్లలు పుట్టరు. అందుకే అన్నయ్య మనస్సు నొప్పి పడింది. అన్నయ్య మనస్సు మంచిదే, వదిన మీద అలిగాడు అంతే. ..ఈ తప్పంతా నాది. వాళ్ళ పెళ్ళయ్యే దాకా వూరుకోలేదు. కొన్నాళ్ళు ఆగివుంటే బాగుండేది. అప్పుడు పిల్లలు పుట్టరని తెలిసినా, ప్రేమ పిచ్చిలో చేసుకొనే వారేమో నా పాపానికి ప్రాయశ్చిత్తం లేదు."

"వుంది" అంది సరోజ.

"సరూ!" బ్రతిమాలింది మాధ్వి.

"నీకు బావ వున్నాడు కదూ?"

కిలకిల నవ్వింది మాధ్వి. "బావా లేడు గీవా లేడు."

"మీ వదిన అన్న 'బుద్దూ' అంటావే, అతను లేడూ?"

"బుద్దూ కాదే! సిద్ధార్థ" కిలకిలమంది మాధ్వి.

"నవ్వు ఆపు ముందు. మీకు పెళ్ళయి, పిల్లలు పుట్టితే, మీ అన్నయ్యకి ఇచ్చెయి పుట్టగానే. రక్త సంబంధం కనుక నీ పిల్లల్ని ప్రేమించి, వారికి పిల్లలు లేరని మరిచిపోతారు ..కన్నప్రేమ కంటే పెంచిన మమకార

మెక్కువ అంటారు ."

ఆలోచనలో పడింది మాధ్వి.

"ఆస్తి పరులపాలవుతుందనే బెంగ వారికుండదు. నీవు మరొకర్ని పెళ్ళిచేసుకుంటే, రక్తసంబంధం, కాదు గనుక మీ వదినకు అంత ప్రేమ వుండదు. ఏమంటావ్! నా సలహా పాటించు" ఆరిందలా అంది సరోజ.

"మైగాడ్ సరూ! ఇంత బుర్ర నీ కెక్కడిది?"

"మాధ్వీ తింటూ ఆడుతూ, పాడుతూ వుండటమే నీకు తెలుసు. తక్కిన ప్రాపంచిక విషయాలను గురించి ఆలోచించే తీరికాలేదు. భగవంతుని ధ్యానించుకుందామన్న ధ్యాసాలేదు."

"అసలు విషయం వేరు. సరోజ అమ్మ దగ్గరే కాలం అంతా గడిపి, అమ్మలక్కల కబుర్లు చిన్ననాటి నుంచి చెవిలో వేసుకుంది. పదహారేళ్ళకే ముత్తయిదువులా మాటాడుతుంది, అని నవ్వుకున్నా, మాధ్వి మరి ఆలోచిస్తూనే వుంది.

"మాధ్వీ! నిన్ను వాసంతి మిస్ పిలుస్తున్నారు."

ఓ అమ్మాయి మాధ్విని వెతుక్కుంటూ వచ్చి చెప్పింది.

"ఇదొక బోర్" అంటూ లేచింది. పుస్తకం మూస్తూ విజిటర్స్ గదిలోకి వెళ్ళి వాసంతి కొరకు చూసింది.

ఆశ్చర్యపడ్డట్టు క్షణం నిల్చుండిపోయింది.

పొడుగాటి జడ- ఎదమీదనుంచి క్రిందికి కుచ్చుగా వ్రేలాడుతూంది. రేగినజుట్టు, నీలి జార్జెట్ చీర, అదే రంగు పొట్టిచేతుల రవిక, నీలికలువలా సున్నితంగ వుంది. పొడుగ్గా వుండటంతో, నడుము మరీ సన్నగ వుంది. 'ఆరునెలల్లో మాధ్విలో ఎంత మార్పు' అనుకున్నాడు వాసంతి ప్రక్కన కూర్చున్న సిద్ధార్థ. ఎందుకో అతని గుండె వేగంగా కొట్టుకుంది.

మెత్తగ వచ్చి కూర్చున్న మాధ్విని చూస్తూ 'తన ప్లాను ఫలిస్తుందో లేదో' అనుకున్నాడు. చూడగానే "ఏయ్ బుద్ధు" అని నాలుక కరుచుకుంటుం దేమో ననుకున్నాడు. ఆ అల్లరి పిల్లను నమ్మించగల ననుకున్నాడు.

వాసంతి ఓరగ సిద్ధార్థను చూస్తూ వుంది. ఈ ఛాన్సు పోగొట్టుకో కూడదు. ఎలాగైనా అతన్ని ప్రేమలోకి దించాలన్న ప్రయత్నంలో వుంది వాసంతి.

'తనూ, సరోజ అనుకున్న మాటలు వాసంతి మిస్‌కు తెలిస్తే' సన్నని నవ్వు కదిలింది మాధ్వి అధరాలపై.

"వదిన బాగుందా?" అని అడిగింది.

"నిన్ను తీసుకు రమ్మంది."

మాధ్వి ముఖం సంతోషంతో విప్పారటం చూసి, సిద్ధార్థ గిల్టీగ ఫీలయ్యాడు.

''రేపుకూడ ఎగ్జామ్ వుంది. ఎల్లుండివరకు వుంటారా నా కొరకు.''

''మీ వదినగారి కొరకు వుండక తప్పదు'' అన్నాడు సిద్ధార్థ, పెదాలను వంకరగపెట్టి నవ్వుతూ.

"రేపు మార్నింగ్ నాకేమీ వర్క్ లేదు. మీరు రావచ్చు'' వాసంతి, పైట చెఱుగులోని దారాలు లాగుతూ అంది.

''ఇప్పుడే వస్తా" నంటూ రూమ్‌కి వెళ్ళిన మాధ్వి, మరో ఐదు నిముషాలకి వచ్చింది.

''మాధ్వీ అతిథి మర్యాద చెయ్యాలిగా'' అంటూ గబగబ తన రూమ్ కెళ్ళింది వాసంతి.

''బుద్ధూ! సారీ . బావా అని పిలవనా!'' అంటూ జాగ్రత్తగ మడతపెట్టిన కాగితం చేతికిచ్చి, ''ఎలా చెప్పాలో తెలియక వ్రాసిచ్చాను'' అంది మాధ్వి.

చదువుతున్న సిద్ధార్థ మధ్యమధ్య ఆశ్చర్యంగ మాధ్విని చూస్తున్నాడు. ఐతే మాధ్వి అతన్నే చూస్తుంది. నిశ్చలంగ గాడ్రేజి కుర్చీలో కూర్చుని చదవటం పూర్తిచేసి, మాధ్విని చూసి, అతిహాసం చేశాడు సిద్ధార్థ.

భయంగ దిక్కులు చూస్తూ, "ఏంటా నవ్వు- విలన్‌లా! ఆపు '' అంది.

వెదకబోయిన తీగ కాళ్ళకు చుట్టుకొన్నట్లుంది సిద్ధార్థకి. తనను తాను సంబాళించుకొని మెల్లగ అన్నాడు, ''ఇవన్నీ నేను ఆలోచించలేదు కాని నీవు మరీ చిన్నదానివి మాధ్వీ. నన్ను పెళ్ళిచేసుకోవటం నీ కిష్టమేనా '' వ్యంగ్యమైన నవ్వు అతని పెదవులను వదిలిపోలేదు. బిగ్గరగా, మరీ బిగ్గరగా నవ్వాలని వుంది సిద్ధార్థకు. సినిమాలోని విలన్‌లు ఎందుకలా బిగ్గరగా నవ్వుతారో ఇపుడు తెలిసింది.

''అనేగా వ్రాశాను. అన్న, వదినల కొరకు నేను ఇలా చేయక తప్పదు. మీ చెల్లెలు కొరకు మీరు నన్ను చేసుకోక తప్పదు.''

''మైగాడ్ మాధ్వీ. నిన్ను భార్యగా ఎపుడూ తలంచలేదు.''

"ఇపుడు తలచండి ఫర్వాలేదు. నేనేమీ విష్టిని కాను.''

''విష్టా? ఆ మెవరు?'' ఆశ్చర్యంగ అడిగాడు సిద్ధార్థ.

''బుద్ధూ'' అంటూ కిలకిల నవ్వింది. అలలలలుగా వచ్చే మాధ్వి నవ్వు అతన్ని ఎప్పుడూ ఆకర్షించుతూంది. నవ్వు తమాషాగా, ఇంపుగా ఉంటుంది. ''సూర్యం కూతురు'' అంటూ మరీమరీ నవ్వింది. తానుకూడ నవ్వుతూ,

''చెప్పి తర్వాత నవ్వకూడదూ'' అన్నాడు.

''ముందు ఆ ఉత్తరానికి సమాధానం కావాలి?''

''నీవే చెప్పావుగా- అజంత కొరకు తప్పదని, ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నావని ''

''సీరియస్‌గా అడుగుతున్నా?''

''సరే. సీరియస్‌గా చెపుతున్నా'' అన్నాడు.

''మరి అమ్మతో, వదినా వాళ్ళతో ఎలా చెప్పటం?'' అంది మాధ్వి.

''ఉత్తరాలు వ్రాయి నాకు వ్రాసినట్టుగ.''

''నామాట వింటారో లేదో'' దిగులుగ అంది.

''ఆ భయం నీకు వుంటే, నేను చెప్పినట్లు వింటావా?''

''పెళ్ళి చేసుకుంటానంటే, ఎన్నిచెప్పినా వింటాను.''

లోలోన కసిగ నవ్వుకున్నాడు సిద్ధార్థ. 'పపుల్ నీ చిన్నారి చెల్లి బంగారు భవిష్యత్తు మట్టిపాలు చేస్తాను. నీ కళ్ళముందు నిల్చుని భీకరంగ నవ్వుతాను.'

''మరి వాసంతికి చెప్పకు ఆ ఉత్తరం సంగతి'' వాసంతి వస్తుంటే గబగబ చెప్పింది మాధ్వి.

సర్వెంటు పట్టుకొచ్చిన డ్రింక్స్‌ని ముగ్గురూ కూర్చుని తీసుకున్నారు

''మిస్ వాసంతీ- మిస్ విష్టి ఎవరూ?'' అని అడిగాడు సిద్ధార్థ

మాధ్వి, ''ఇక వెళ్తాను. విజిటర్స్ టైమ్ అయిపోయింది'' అంటూ లేచింది నవ్వుతూనే.

వాసంతి తేలిగ్గా వూపిరి పీల్చుకుంది.

''ఐతే, వస్తాను'' అని సిద్ధార్థ బయలుదేరాడు. గేటువరకు వెళ్ళి సాగనంపి వచ్చింది వాసంతి. ఏమిటేమిటో వూహిస్తూ, కలత నిద్ర పోయిందా రాత్రి.

*　　　　*　　　　*

వాసంతి రమ్మన్నట్టుగా, సరిగ్గా పదిగంటలకు వచ్చి రోడ్డుపై వుంచాడు కారును సిద్ధార్థ. అప్పటికే రోడ్డును చేరుకుంది వాసంతి. ఎస్. వి. లో కాఫీ తాగి, కారును చంద్రగిరి వైపు పోనిస్తూ, "మంగాపురం, కళ్యాణ వేంకటేశ్వరస్వామి దగ్గరకు వెళ్దామా?'' అన్నాడు. ఆ మాటకే పులకించి పోయింది వాసంతి.

'ఇలాంటివాళ్ళు మోసపోతుంటారు. తమమీద, తమ అందంమీద నమ్మకం ఎక్కువ, వయస్సు అలాంటిది, పెరుగుతున్న వయస్సుకి భయపడి

యోగ్యుడైన బ్రహ్మచారి కనుపిస్తే వలలో వేసుకోవాలని చూస్తూ, వలలో చిక్కుకుంటారు.

పెళ్ళయినా, భార్యని వదిలి ధీమాగా వున్నాడు విపుల్. అజంత అలా వుండలేకపోతూంది. ఆ మూడుముళ్ళతోనే బంధిస్తారు స్త్రీ జీవితాన్ని. మగవాడికో న్యాయం, స్త్రీకో న్యాయం.

ఈ పెళ్ళిళ్ళు ఆచారాలు, కట్టుబాట్లు రాకముందు, పెళ్ళి కాకముందే పిల్లల్నికన్నా తప్పుగా ఎంచేవారు కాదట,పైగా అలాంటివారిని గౌరవించేవారట. మనిషికి స్వార్థం ఎక్కువై, తను ఎంచుకున్న స్త్రీ, మరెవ్వరికీ దక్కరాదన్న స్వార్థంతో శాసనాలు చేయించాడు. ఇది ఒకవిధంగా మంచిదైనా, కొన్ని మార్పు లవసరం. స్త్రీకి న్యాయం చేకూర్చాలి.' అలాంటి ఆలోచనలలో వుండి ప్రక్కనున్న వాసంతితో మాట్లాడలేకపోయాడు సిద్ధార్థ.

"కళ్యాణ వేంకటేశ్వరుని గురించి విన్నానుకానీ, చూడలేదు. ఆ పూజారి దక్షిణప్రాంతం వాడట కదా- స్వామి కలలో కనిపించాడని ఏదో చెపుతుంటారు నిజమేనా" అంది వాసంతి, మాటలు కలుపుతూ.

"చాలమందికి అక్కడో వేంకటేశ్వరు డున్నాడని తెలియదు. ఆ గుడి శిధిలమైపోయింది. ఎక్కడివాడో అతను, నక్షత్రాన్ని చూసి జ్ఞానులు యేసుక్రీస్తును వెదుక్కుంటూ వచ్చినట్లు, కలలో గాంచిన ఆధారాల ప్రకారం ఈ ప్రాంతాలకి వచ్చి, శిధిలాలలో వున్న వేంకటేశ్వరుని కనుగొని, ఆ శిధిల గోడల్లోనే పూజలు మొదలుపెట్టాడు.

ఆర్కియాలజీ వాళ్లు వచ్చి, ఆ శిధిలాలపై రీసెర్చి చేస్తున్నామంటూ, ఆయన పూజలకు అభ్యంతరం చెప్పారు. తొమ్మిది అడుగుల సుందర విగ్రహాన్ని వదిలిపెట్టక కోర్టుకు వెళ్ళాడు. "స్వామి కలలో కనుపించి, పూజలు జరుపమన్నాడని, ఎక్కడో పుట్టి, ఎక్కడో పెరిగిన తనకు ఈ ఆధారాలు స్వామే చూపించాడని, తనను నమ్మమని చెప్పుకున్నాడు. కోర్టు వాళ్ళు నమ్మక తప్పలేదు. తర్వాత ఎ. వి. కె. రంగారావు చాల శ్రద్ధ వహించి, తిరుణాల యేర్పాటు చేశారు. ఆ నోట ఈనోట ఈ కళ్యాణ వేంకటేశ్వరుని శక్తి ప్రాకిపోయింది.

పురాణాలు తిరగవేసి, స్వామి వివాహమైన వెంటనే తిరుమలకి పోక, కొన్నాళ్ళు ఇక్కడున్నాడని తేల్చి చెప్పారు.

దేవస్థానంవారు స్వాధీనం చేసుకున్నారు. భక్తులకు, డబ్బుకి కొదువ లేదు కనుక, వన్ క్లాసు మందిరం తయారయింది. భక్తులకి ప్రసాదాలు దొరుకుతున్నాయి.

స్వామిని దర్శించుకొని, హారతి తీసుకొనివచ్చారు. అత్యంత భక్తి భావంతో నమస్కరిస్తున్న వాసంతిని చూశాడు. ఏమని వేడి వుంటుంది- సిద్ధార్థలాంటి భర్తను ఇవ్వు అని మ్రొక్కుకొని వుంటుంది. మాధ్వి సిద్ధార్థ మనస్సును ఒప్పించి, నన్ను చేసుకొనేలా చేయమని దేవుని అడుగు తుంటుంది. మరి స్వామి ఎవరి కోరిక నెరవేరుస్తాడు.

దొంగ దొంగతనానికి పోతూ, పట్టుబడకుండా చేయమని ప్రార్థిస్తాడు. సొమ్ముగల ఆసామీ తనను కాపాడుమని అడుగుతుంటాడు.

భక్తులు ఇలా ఒక్క పనికి అన్ని రెకమండేషన్లు తెస్తూ- ఆయన్ని ఇబ్బందుల్లోకి తోస్తుంటారు. దేవుడు కాబట్టి, సంజాయిషీ ఇచ్చుకునే అవ సరం లేదు. ఆయన పని ఆయన మెల్లగా చేసుకొని పోతుంటాడు. న్యాయ స్థుడు జయిస్తాడు, అన్యాయస్థుడు దేవుడిని పూజింప నవసరంలేదు. ఏవిటో అన్నీ తికమకలు. అవన్నీ తలుస్తూ వున్న మతి పోగొట్టుకొనేదానికన్న, పూరకుండుట మంచిది'' అనుకుంటూ సిద్ధార్థ కారు దగ్గరకు వచ్చాడు.

వాసంతిని కారులో కూర్చోమని చెప్పి, మరల గుడివైపుకు వెళ్ళి, పూజారితో ఓ అర్ధగంట మాట్లాడి, వచ్చి, ''సారీ-లేటయింది'' అన్నాడు.

ఇదే 'సారీల' తమాషా- చేయవలసిన పని చేసేసి 'సారీ' అంటారు. కాలు త్రొక్కేసి 'సారీ' అంటారు. అక్కడికి ఆ సారీతో కాలునొప్పి మాయ మైనట్లు. ఈ సారీలను కారీ చేయటానికి ఎన్ని లారీలు కావాలో! 'సారీ' అన్న వెంటనే, అన్నవాడికో జల్లకాయ కొట్టేస్తే సరి, అనుకుంది వాసంతి.

జాగ్రత్తగ హాస్టలుదగ్గర డ్రాప్‌చేసి వెళ్ళాడు సిద్ధార్థ. మాధ్వి అన్నట్టు ఈ సిద్ధార్థ నిజంగానే బుద్ధూ. ఎంతో థ్రిల్‌గ వుంటుందని, రాత్రంతా వూహించుకొని వెళ్ళి, బోర్ కొట్టించుకొని వచ్చాను.

గదిలోకి డల్‌గా నడిచింది.

*  *  *

చలిగా వుంది. ముడుచుకొని పడుకుంటూ, దుప్పటి పైకి లాక్కుం టున్న మాధ్వి ఉలికిపడి లేచింది, బాబోయ్ ఎనిమిది ఐంది అనుకుంటూ. వణికిపోతూ చన్నీళ్ళ స్నానం చేసింది. బుద్ధూ తొమ్మిది గంటలకంతా వచ్చెయ్యమన్నాడు.

సాయంకాలం ఇచ్చిపోయిన జరీ వెంకటగిరి చీర మడతలు విప్పుతూ, 'ఇంత మంచి చీర ప్రయాణానికి ఎందుకూ, నైలాన్ చీరైతే నలక్కుండా బాగుంటుంది కదా' అని పెట్టెలో పెట్టేస్తూ 'ఈ చీర కట్టుకు రమ్మన్నాడు. చెప్పినట్లు వినకపోతే వాసంతి మిస్‌ను ప్రేమించేస్తాడు' అనుకుని జానెడు

వెడల్పున జరీ వున్న ఆ చీరనే కట్టుకుంది. తలారబెట్టుకోవటానికి టైమ్ లేదు. వదులుగ జడవేసుకొని, సూట్ కేస్ పట్టుకుని హాస్టలునుంచి బయటకు వచ్చింది. తనకోసమే చూస్తున్నాడు సిద్ధార్థ. వెళ్ళి కూర్చోగానే కారు స్టార్ట్ చేశాడు.

స్నేహితులకు టాటా చెపుతున్న మాధ్విని, ''ఇక చాల్లే- సరిగ్గా కూర్చో'' అన్నాడు విసుగ్గా. అపుడు చూసింది సిద్ధార్థను. తలార స్నానం చేసినట్లున్నాడు. శేలిగ్గా వున్న వెంట్రుకలు గాలికి కదులుతున్నాయి. పంచె కట్టు, సిల్కు జుబ్బాలో స్వచ్ఛంగ కనుపించాడు.

''బుద్ధూ- పెళ్ళికొడుకులా వున్నావ్'' అంది.

''లా- ఎందుకు పెళ్ళికొడుకునే. నీవు పెళ్ళికూతురివి.''

"నేనా"- తమాషాగా నవ్వుతూ, ''ఇలా వస్తున్నాం ఏమిటి?'' అంది.

''నీకు కళ్యాణ వేంకటేశ్వరుని చూపిద్దామని .'' పూలపొట్లం చేతి కిచ్చాడు. కనకాంబరాలు, మరువం వేసి అల్లిన మాల. తలలో తురుముకుంది.

ఆ తరువాత అంతా కలలాగ జరిగిపోయింది. 'కల గంటున్నానా- ఏ క్షణాన మెలకువ వస్తుందో'- మేల్కొనాలన్న ప్రయత్నంలో వుంది మాధ్వి. తన మెడలో పచ్చని తాడు చూస్తుంటే, కల కాదు, తనకు స్వామి సన్నిధిలో సిద్ధార్థతో వివాహం జరిగినది యదార్థమని తెలుస్తుంది. జ్ఞాపకం లేని అమ్మ, అన్నయ్య, నాన్నగారు జ్ఞాపకం వచ్చారు. రెండు చేతుల్లో ముఖం దాచుకుని, వెక్కి వెక్కి ఏడుస్తున్న మాధ్విని చూశాడు సిద్ధార్థ. కిలకిల నవ్వుతూ, అంద రినీ నవ్వింపజేస్తుండే మాధ్వి ఏడుస్తుంది. ఈ ఏడ్పు తను కాదు. విపుల్ చూడాలి అనుకున్నాడు.

మాధ్విని హింసించి, విపుల్‌మీద కక్ష సాధించాలని తలచే ముగ్ధ లాంటి మాధ్విని పెళ్ళి చేసుకున్నాడు. తనది ఒకటే లక్ష్యం- తన చెల్లెలి జీవితం పాడైంది. ఆ బాధ ఎలాంటిదో ప్రాక్టికల్‌గ విపుల్‌కు తెలియ చెప్పడమే.

కాని తనమీద నమ్మకంతో, అమాయకంగ పీటలమీద కూర్చున్న మాధ్వికి మూడు ముళ్లు వేస్తుంటే, శరీరం వింత అనుభూతితో పులక రించింది. తనలోని శక్తి మాధ్విలోకి పోతున్నట్లనిపించింది.

దేవుని ముందు ప్రమాణంచేసి, తనదాన్నిగా చేసుకున్నాడు. ఈ మాధ్వి తనిది, తనేమి చేసుకున్నా అడిగేవాళ్లు లేరు. ఇంత హక్కు ప్రపం చంలో మరి దేనిమీద వుండదేమో! అలా అనుకుంటే ఏదో తృప్తి, ఆనందం కలిగాయి.

"మాధ్వీ" అన్నాడు లాలనగా.

ముఖాన్ని పైకెత్తి, కన్నీటితో వున్న ఆ కళ్లు చూశాడు. రెప్పలు తడితో నిగనిగలాడుతున్నాయి. పైకి వంగిన రెప్పలు ముద్దొచ్చాయి. ఆ కళ్ళను అప్రయత్నంగ ముద్దు పెట్టుకున్నాడు. ఆశ్చర్యపోయినట్లు, ఏదో క్రొత్త విషయం స్ఫురించినట్లు కళ్ళు పెద్దవి చేసింది.

"ఎందుకు యేడుస్తున్నావు?"

"ఏడుపు వచ్చింది."

"నీ ఇష్టప్రకారమేగా పెళ్ళి చేసుకున్నాను."

"ఎవ్వరూ లేకుండ, ఇలా చేసుకుంటారేమిటి?" అంది బుంగ మూతి పెట్టి.

'ఒక్కొగానొక్క చెల్లి, చెప్పా చెయ్యకుండ చాటుగ పెళ్ళి చేసుకుంటే ఎలా వుంటుంది? ఇంటి పరువు కాస్త పోతుంది. ఆ తర్వాత మొగుడొదిలేసి నీ చెల్లి ఇంటికి వస్తే. ఆ ఇంటి మగవాళ్ళు తలెత్తుకోగలరా? పౌరుషం వున్నవాళ్లు ఆత్మహత్య చేసుకుంటారు—' పెద్దగా నవ్వాడు సిద్దార్థ.

ఉలిక్కిపడింది మాధ్వి. "బుద్ధూ, ఆ విలన్ నవ్వు ఆపు" అంది.

"నేను నీ మొగుణ్ణి. బుద్ధూ, మొద్దూ అనకూడదు" అన్నాడు.

"ఏమనాలి?"

"యీవండీ!"

"యీవండీ!" కిలకిల నవ్వింది.

ఇలా నవ్వే పిల్లని ఎలా హింసించాలి. మాధ్విని చూసేకొలది, ఇదివరకు కనుపించని అందాలు కంటికి స్పష్టంగా కనుపిస్తున్నాయి. ఆ ముక్కు సూటిగ, మరీ నాజూకుగా వుంది, ఆ పెదాలు కుంచెతో గీసినట్లున్నాయి. తనకంటె ఎంత చిన్నది. 'ఇంత చిన్నపిల్ల తన భార్య—మైగాడ్ .' దగ్గరకు వచ్చి, మాధ్వి చేతిని తన చేతుల్లో ఇముడ్చుకున్నాడు.

*　　　　*　　　　*

వారంరోజులు ఇట్టే గడిచిపోయాయి. దాంపత్య జీవితంలో అడుగు పెట్టిన మరురోజే మాధ్విలోని స్త్రీ పూర్తిగ మేల్కొంది. భర్త అన్న పదంలో ఎంత శక్తి, ఎంత మాధుర్యం ఇమిడి వుంది. తనకంటూ ప్రత్యేకంగ ఏమీ లేకుండ భర్తకు అర్పించినపుడు- భక్తుడు దేవుని కళ్ళారా చూసిన అనుభూతి కలుగుతుంది.

పెళ్లయిన రోజు ప్రేమలోని మాధుర్యం పూర్తిగ అనుభవించింది.

తల్లిలేని తనను ఎందరు ఎంతగ ప్రేమించినా, ఇంకా ఏదో కొరతగ వుండేది.
ప్రాణపదంగా చూసే అన్నయ్య వున్నా, వదిన ప్రేమలో పడి తనను ఉపేక్షిస్తా
డేమో, అది తను సహించగలదా అనుకుంటూ, అన్నీ తేలికగా తీసుకోవ
టానికి అలవాటు పడుతూ, ఇంకా దేనికోసమో నిరీక్షిస్తూ వుండేది.

ఆ నిరీక్షణ కర్థం ఇపుడు తెలిసింది. తన వాళ్ళని వదిలి, వెనుక
ముందు లాలోచించక, భర్త అన్న నమ్మకంతో వచ్చేసింది.

ఆ రోజే అందరికీ ఉత్తరాలు వ్రాశానన్నారు.

సాధారణంగ మాధ్వికి అయిదు గంటలకే మెలకువ వస్తుంది.
క్రొత్తగా కాలేజీకి వెళ్ళిన రోజుల్లో, ఐదు గంటలకే లేచే బాధలేదు. నిజం
మహారాణిలా ఏడుకో ఎనిమిదికో లేచి, అందరిలాగా ఉరుకులు పరుగుల
మీద క్లాసులకి వెళ్ళాలనుకుంది. కాని పాత అలవాటు పోలేదు.

పూర్తిగ మెలకువ వచ్చిన మాధ్వి ఆలోచిస్తూ వుంది. ప్రక్కలో
వున్న సిద్ధార్థ కదిలాడు. ఆప్యాయంగ చెయ్యి చాపి, గుబురుగ వున్న
జుట్టులోకి వ్రేళ్ళు పోనిచ్చింది. సుతారంగ చెంపల్ని తడిమింది. గరికల
మొలుస్తున్న గడ్డం, చక్కిలి గింతలు పెట్టినట్లయింది దృఢంగ, బలంగ
వున్న ఆ చేతులు ఎంత సున్నితంగ స్పృశిస్తాయి. ఆ చేతులు తనని ఎప్పుడు
రక్షిస్తాయి. ఆ చేయిని పట్టుకొని, చెంపకు చేర్చుకొని, మరల నిద్రలోకి
జారిపోయింది.

*   *   *

పది రోజుల తర్వాత, ఓ ప్రొద్దున. జూలాజికల్ పార్క్ రెస్ట్‌హౌస్‌లో
కేన్ ఛెయిర్‌లో పడుకుని వున్నాడు సిద్ధార్థ. ఎదురుగా వున్న అద్దా
బీరువాలాంటి గూడులో వున్న తెల్లగ, వెన్న ముద్దలా నున్న పక్షులు జంట
జంటలుగా వచ్చి ఎగురుతూ, మాటి మాటికి ముద్దు పెట్టుకుంటున్నట్లు
ముక్కులు రాచుకుంటున్నాయి.

అపుడపుడు కర్ణకఠోరంగ కీర్‌మని, ఒంటరిగ నున్న చిలుకలాంటి
మక్కాన్ పక్షి అరుస్తూ వుంది. చూపులకు ఎంతో అందంగ వుంది, కాని
దాని అరుపు అసహ్యంగ వుంది. దాని అరుపు వింటుంటే సిద్ధార్థకి విపుల్
గుర్తుకు వస్తున్నాడు. అందం చూసి మోసపోకూడదు. అందంకంటే
ఆత్మ సౌందర్యం ముఖ్యం.

కాని, తను చేయబోతున్న దేమిటి? అసహనంగ అటూ ఇటూ క
లాడు కుర్చీలో. మాధ్వి స్నానం చేస్తున్నది. "మాధ్వి" అంటూ గొ
క్కున్నాడు. ఈ రోజు మాధ్విని పంపేస్తున్నాడు. విన్ననే విపుల్

ఉత్తరం వ్రాశాడు.

ఏమీ తెలియని మాధ్విని శిక్షించాల్సి వచ్చినందుకు మనస్సు కోతగ వుంది. ఆ మనస్సును మరిపిద్దామని కళ్ళను చుట్టూ వున్న అందాలను చూడమన్నాడు.

మిరాలం టాంక్ ఒడ్డుకి లాగి వుంది పడవ. ఆ బోటు షికారులో పసిపిల్లలా ఆనందించింది మాధ్వి. ఆ ఒడ్డునే జపాన్ మోడల్‌లో నున్న చెక్క ఇంట్లోనుంచి కదిలి రానంది అలాంటి ఇల్లు కట్టించమంది వూర్లో నది ఒడ్డున.

"బోట్ హౌస్ వద్దూ" అన్నాడు.

"బాగుంటుంది, కాని మన వూర్లో ఏరు నిండుగ ఎప్పుడూ ప్రవహిస్తుండదుగా" అంది.

తాను వేళాకోళానికి అన్నవి కూడ పిచ్చిగ నమ్మేస్తుంది. నాలుగైదు అడుగులు వెడల్పున్న తాబేలుని చూపి ఆశ్చర్యంగ ఆనందంగ కేక పెట్టి, తన చెయ్యి వూపేసింది. "బుద్దూ ఇలాంటి తాబేలుని నేను చూడనేలేదు" అంది. తనూ ఇదే మొదటిసారి చూడటం, కాని, నవ్వి వూరుకున్నాడు.

రోజుల తరబడి చింపాంజీల దగ్గర కూర్చోమన్నా, కూర్చునేలా వుంది. ఇంటికి వచ్చిన క్రొత్తవారిని చూపి, చిన్న పిల్లలు అతిగా చేసినట్లు అవి ఊయల వూగి, మొగ్గలు వేసి, చేతికందిన పుస్తకాన్ని చదువుతున్నట్టు నటిస్తుంటే, ముచ్చట పడిపోయింది. కటకటాలనుంచి ముఖం బయట పెట్టి, పళ్ళికిలించి, చెయ్యి చాపిందో కోతి, ఏమైనా పెట్టమని. ఓ బిస్కెట్ పాకెట్ ఆంతా పెట్టేసింది

దూరాన గంటలు విన వచ్చాయి. పులుల కోసం మాంసము వేసి వాటిని పిలుస్తున్నారు. ఆ గంట విని ఎక్కడెక్కడున్న పులులన్నీ అక్కడికి చేరుకుంటాయి. ఆ గంట వినగానే ఆ పులులకి నోట నీరూరుతుందట.

వాటి స్వేచ్ఛకు భంగం కలుగకుండ, వాటిని అడవిలో వదిలి, వాటిని కాపాడుతూ, తరిగిపోతున్న అడవి సంపదపై జాగ్రత్త వహిస్తున్నారు.

"ఇంతవరకు బోనుల్లో వున్న జంతువులను చూశాం. ఇపుడు బోనుల్లో మనుషులుండి, పులులను చూస్తున్నాం" అంది మాధ్వి గేమ్ సాంక్చురిలో వేన్‌లో నుండి స్వేచ్ఛగ విహరిస్తున్న పులులను చూస్తూ.

ఒక పులి వ్యాన్ వెంటబడి గాండ్రించింది.

మాధ్వి దానిని మురిపెంగ వెక్కిరించింది.

కాని, పార్కులో తిరుగుతూ, దూరంనుంచి భయంకరంగ పరుగెత్తు

కొస్తున్న హైనాను చూసి, కెవ్వు మంటూ తనను కరుచుకుపోయింది.

"ఏయ్-పిచ్చీ చూడు" అంటూ హైనాకి, చూడటానికి వచ్చిన వారికి మధ్య నున్న కందకాన్ని చూపించాడు.

"బుద్ధూ-ఈ యేర్పాటు బాగుంది. ఇక్కడి జంతువులు సంతోషంగానే వున్నాయి" అంది.

"కానీ గిండీ పార్కులోని జంతువులు రెస్ట్‌లెస్‌గ స్వాతంత్ర్య వాయువుల కొరకు ఆరాటపడుతున్నట్లున్నాయి" అంది మాధ్వి.

అలా మాధ్వి గురించి ఆలోచిస్తూవున్న సిద్ధార్థ ఎదుటకు వచ్చింది మాధ్వి తలార బెట్టుకుంటూ. పట్టుకుచ్చులా వున్న వెంట్రుకలు దొరక పుచ్చుకొని, కళ్ళలోకి చూస్తూ, "మాధ్వీ నీలో ఇంత అందం వుందనుకోలేదు. జుంటె తేనెలా మధురంగ వున్నావు" అన్నాడు.

మాధ్వి నవ్వేసి, దగ్గరకు వచ్చి, సిద్ధార్థ ముఖాన్ని చేతుల్లోకి తీసుకొని, "మీరు తెల్లగ, అందంగ వుంటారు. మీ ముక్కు నాకు ఇష్టం, మీ కన్నులు మరీ ముద్దు వస్తాయి" అంటూ ఆ కళ్ళమీద ముద్దు పెట్టుకుంది.

* * *

అన్ని జాగ్రత్తలు చెప్పి, మాధ్విని ట్రైన్ ఎక్కించాడు. సిద్ధార్థని కరుచుకుపోయింది. మాధ్వితోపాటే తనూ ట్రైన్ ఎక్కి కూర్చున్నాడు. "మీ బంగారన్నయ్యకి టెలిగ్రాం ఇచ్చాను, నీవు వస్తున్నట్లు" అన్నాడు.

"నాకు భయంగ వుంది నాన్న, అన్నయ్య వాళ్ళేమంటారో- మీరూ రాకూడదూ, ఆ కారు రిపేరు అయ్యాకనే వెళ్దాం" అంది.

ప్లాట్‌ఫారమ్ వైపు చూస్తూ "నాకు కొన్ని పనులున్నాయి. విజయవాడ వెళ్ళాలి. నీవు ట్రైన్ దిగగానే, ఈ అడ్రెస్‌కు టెలిగ్రాం ఇవ్వు" అని, టెలిగ్రాం ఎలా వ్రాయాలో వ్రాసిచ్చాడు.

"డబ్బులు సరిపోతాయా?" అంటూ పర్స్‌లోంచి వందరూపాయల కాగితంతీసి మాధ్వి హేండ్‌బాగ్‌లో పెట్టాడు.

"బుద్ధూ- పెళ్లి చేసుకుంటే ఇంత బాగుంటుందని తెలిస్తే, ఎప్పుడో పెళ్ళి చేసుకొనేదాన్ని. హాయిగ డబ్బు ఖర్చుపెట్టేస్తూ, జల్సాగ తిరిగేదాన్ని" కిలకిల నవ్వింది

ఆ నవ్వులో క్రొత్త పెళ్ళికూతురిలా దేదీప్యమానంగ వెలిగిపోయింది మాధ్వి ముఖం. నీలివర్ణం వదిలి, పసుపు పచ్చరంగు చోటు చేసుకుంది. జీవితం అంటే ఏమిటో తెలుసుకున్న ఈ మాధ్వి క్రొత్తది.

రైలు కదిలింది. మాధ్వి కంటిలో నీరు చూశాననుకున్నాడు సిద్ధార్థ.

'దూరం అవుతున్న మాధ్విని శాశ్వతంగ దూరం చేసుకుంటున్నానా' అన
కున్నాడు. చెయ్యి వూపుతూనే వుంది మాధ్వి. గిరుక్కున వెనక్కి తిరి
గబగబ వెళ్ళిపోయాడు.

*　　　*　　　*

ప్లాట్‌ఫారమ్ మీదనున్న విపుల్ ముందుకుపోతున్న రైలు పెట్టెల్లో
ఆత్రుతగ చూస్తున్నారు.

రైలు పూర్తిగ ఆగనేలేదు. ''అన్నాయ్'' అంటూ దూకింది.

''చెల్లెమ్మా'' అంటూ ముందుకు వచ్చాడు. విపుల్ నలిగిపోయి
చిక్కిపోయాడు. కళ్ళు ఎర్రగ వున్నాయి, సిద్ధార్థ ఉత్తరం అందుకొన్నప్పటి
నుంచి, అతని మనసు మనసులో లేదు. సిద్ధార్థ ఎక్కడవున్నా, దొర
పుచ్చుకొని, పీక నులమాలన్నంత కోపంగ వుంది. 'స్కౌండ్రల్' నోటి
వచ్చిన బూతుమాటలు మనసులో అనుకోకుండా వుండలేకపోయాడు
ఉత్తరం చదివిన నాన్న నిమ్మకు నీరెత్తినట్లు వున్నాడు. మనసున్నవాడె
భార్యను దూరం చేసుకోడు. అలా చేసినవాడు మనిషికాడు, అలాంటివాడి
దూరం అయితేనే మంచిది. ఏది జరిగినా మన మంచికే అనుకోవాలి' అంటు
ఫిలాసఫీ మొదలెట్టాడు.

చిన్నారి చెల్లెలి జీవితం పాడైపోయింది. కళ్ళు తెరవకముందే నలి
వేయబడ్డది అని ఏడుస్తున్న విపుల్‌కి తండ్రి మాటలు చికాకును కలిగించాయి

అంతటి దుర్మార్గుడు చెల్లిని ప్రాణాల్తోనైనా వదిలాడు. అందుకు
సంతోషించాలి అనుకుంటూ స్టేషన్‌కు వచ్చాడు.

మాధ్వి ఎలా కనిపిస్తుందోనని, పీడిత హృదయంతో వున్నాడు
విపుల్. క్రొత్త అందాలతో వెలిగిపోతూ, నవ్వుతూ, ఎప్పటిలా, 'బంగారు
అన్నాయ్' అంటూ భుజంమీదకు వచ్చేసింది. బాహ్యప్రపంచాన్ని మరి
కాసేపు పొదివి పట్టుకున్నాడు.

జట్కాలో కూర్చుని, ప్రవాహవేగంగ ఒకటే వాగుడు. త
చూచినవన్నీ చెప్పింది.

"ఎగ్జిబిషన్‌లో జెయింట్‌వీల్ ఎక్కాను. అబ్బా '' అప్పు
చూసింది, అన్నయ్య తన మాట వినటంలేదని."అన్నాయ్! ఒంట్లో బాగులేదా!
నుదుటిమీద్ధ చేయివేసి చూసింది. ''అయ్యో, వెచ్చగా వుందే, నీవు ఎం
కొచ్చావు స్టేషన్‌కి, నేను రాలేకపోయానా? నాన్నగారున్నారా, లేక బా
దగ్గరకు వెళ్ళారా- నాన్నగార్కి మరీ బాబా పిచ్చి ఎక్కువైంది అన్నయా
మరో సంవత్సరానికి నాన్న ఆశ్రమంలో వుంటే ఆశ్చర్యపడక్కర లేదు.

అమాయకంగ వున్న ఈ చిన్నపిల్లను ఎలా మోసం చేయగలిగాడు ఆ దుష్టుడు- ఎందుకలా చేశాడు. విపుల్ పెదాలు బిగించి మాధ్విని చూశాడు. పొడుగాటి మెడలో చేంతాడంత లావున వుంది పసుపుత్రాడు. దానికో ఐదు పైసలంత తాళిబొట్టు.

హృదయం బాధగ మూలిగింది. తన చెల్లికి తనకున్నదంతా ఇచ్చి చేద్దామనుకున్నాడు. ఆ తాడు చేతుల్లోకి తీసుకొని త్రెంపబోయాడు.

"అన్నయ్యా" అంది గాభరాగా.

"అది తీసెయ్—లేకుంటే దాచెయ్యి" అన్నాడు కర్కశంగ.

అన్నయ్యకు కోపంగ వుందని గ్రహించుకొని, "బంగారన్నయ్- క్షమించు. ఇక నీకు తెలియకుండ ఏ పనీ చెయ్యను" అంది.

ఈ సంగతి పైకి పొక్కనీయకూడదు. ఈ పెళ్లి సంగతి ఎవ్వరికీ తెలియదు కాబట్టి, మాధ్వి ఎప్పటిలా చదువుకుంటుంది. ప్రపంచాన్ని విజ్ఞాన నేత్రాలతో చూస్తుంది మగవాడికో న్యాయం, ఆడదానికో న్యాయం లేదని, భగవంతుని దృష్టిలో అందరూ ఒక్కటేనని, మగవాడికి లేని శీలం, ఆడదానికేనా, అది స్వార్థపరులు పెట్టిన నీతిశాస్త్రమని గ్రహించుకుంటుంది.

వంచింపబడిన స్త్రీకి పాపం చుట్టుకొంటుందనటము హాస్యాస్పదము. శీలం, గుణం, స్త్రీ పురుషు లిరువురికి సమానమే అని తెలుసుకున్న నాడు స్త్రీకి ఇన్ని సమస్యలుండవు.

మనస్సు, శరీరము ఎదిగిన తర్వాత, మాధ్వి జరిగినదంతా ఓ పీడ కల అనుకుని, నచ్చినవాడ్ని చేసుకుంటుందన్న తీర్మానానికి వచ్చాడు విపుల్.

మాధ్వి ఆ రోజునుంచి, ప్రతి నిముషం, సిద్ధార్థకొరకు ఎదురు చూడ సాగింది. ఇల్లంతా సర్దింది. వస్తే ఎలా మర్యాద చేయాలో, ఏ వంటలు చేయించాలో, లేక స్వయంగ వంట చేసిపెట్టాలి ఇలా పలు రకాలుగ ఆలోచిస్తూ వుంది

"చెల్లెమ్మా- నీ కాలేజి ఎప్పుడు?" అడిగాడు విపుల్.

చెప్పి, లోలోన నవ్వుకుంది.

"రేపే మరి తయారు కాలేదే. టికెట్లు బుక్ చెయ్యాలి" అన్నాడు.

"అన్నాయ్- బుద్ధు రానీ "

నలిగి నలిగి జేబులోవున్న ఉత్తరాన్ని మాధ్వికిచ్చాడు. యథాలాపంగ అందుకొంది

"నీ చెల్లి జీవితం ఎలా అయిందో, అవుతుందో చూడు. దిక్కులేని పిల్లలా లేచివచ్చి పెళ్ళి చేసుకుంది. నీ పవిత్రమైన పువ్వులాంటి చెల్లి నలిగి

పోయి నీ దగ్గరకు వస్తుంది, పెళ్ళయిన వారంరోజులకే భర్తచేత వదిలి వేయబడి. పదహారేళ్ళకే విధవకంటే హీనంగ బ్రతుకుతుంది. అది చూసి ఆనందిస్తావో, నవ్వుకుంటావో "

ఇక చదవలేక, చదివినది అర్ధం చేసుకోవటానికి ప్రయత్నిస్తూ, "అన్నయ్యా" అంటూ గావుకేక వేసింది.

తన ముందే కుప్పగా కూలిపోయిన, మాధ్విని ఎత్తుకొని, మంచంపై పడుకోబెట్టాడు. ఆ షాక్ నుంచి తేరుకొని, కళ్ళు తెరిచింది. ఆ చూపులు పిచ్చిగా, ఎటో చూస్తున్నాయి.

* * *

హోటల్ కి వచ్చి, సూట్ కేస్ సర్దుకుంటున్న సిద్ధార్థకి మంచంప్రక్కన పడి వున్న జాకెట్టు, బ్రేసియర్ కనుపించాయి. గబుక్కున తీశాడు. అవి మాధ్వివి హృదయంలో బాధ శూలంలా గ్రుచ్చుకుంది. సింథాల్ పౌడర్ వాసన తేలికగా వస్తునే వుందా గదిలో.

ఆ ఉత్తరం చదివి, ఆ ఫూల్ విపుల్, మాధ్విని ఏమన్నాడో. ఈ బాధలన్నిటికీ మూల కారణం ఆ వెధవ. అజంత కాపురం చక్క పడా లంటే ఇదే మార్గం

అలా సరిపెట్టుకున్నా, ఎక్కడకు వెళ్ళినా, ఏం చేసినా, మాధ్వి తన కళ్ళ మీద ముద్దు పెట్టుకున్నదే, పదే పదే గుర్తుకు వస్తున్నది. రైలు ఎక్కే ముందు చేతికి అంటుకుపోయింది ఇంకా ఆ స్పర్శ అక్కడే వుంది।

"బుద్ధూ, బుద్ధూ" అని పిలుస్తున్నట్లే, భ్రమ గొల్పుతూ పిచ్చివాణ్ణి చేస్తున్నాయి.

ఇంతలావు, ఇంత పొడుగు పెద్ద మనిషిని, ఎలా మార్చగలిగింది. అంతటి శక్తి ఆ పిల్ల కెక్కడిది. పది రోజుల్లో, పది జన్మలకు సరిపడ్డ జ్ఞాపకాలు తన వెనుక వదిలి వెళ్ళింది.

విపుల్ మనస్సు మారే వరకు, ఈ దేశంలో వుండకుండా, ఎక్కడి కైనా వెళ్ళిపోవాలని, యు. ఎస్. ఏ. కి పాస్‌పోర్టు కోసం వ్రాశాడు. డబ్బు, తక్కిన యేర్పాట్లకోసం ఇంటి ముఖం పట్టాడు

ఇంటికి చేరేటప్పటికి రాత్రి పది గంటలైంది. అందరూ గాఢ నిద్రలా వున్నట్లు ఇల్లంతా నిశ్శబ్దంగ వుంది. కారు షెడ్‌లో పెట్టాడు.

సామాను తీసే ఓపిక లేదు.

బయటనున్న పాలేరు తలుపు తీశాడు మెల్లగా, పైకి, తన గదికి వెళ్ళాడు. తలుపు ప్రక్క స్విచ్ కొరకు తడిమి, స్విచ్ వేసి. తలుపులు

దగ్గరగ వేశాడు. స్టాండు దగ్గరకు వెళ్ళి బట్టలు మార్చుకొని, పడక దగ్గరకు వచ్చి ఆగిపోయాడు, కంటికి కనిపిస్తున్న దృశ్యం చూసి.

పడకలో వున్న మాధ్వి కళ్ళు విప్పారించి చూస్తున్నది. ఆ కళ్ళలో ఎన్నో ప్రశ్నలు, ఎన్నో అనుమానాలు అర్థిస్తున్నాయి-కోపంగా వున్నాయి.

అక్కడ తన గదిలో పడకపై మాధ్వి వుండటము ఎంతో సహజమన్నట్లుగ కూర్చుని, "మాధ్వీ" అన్నాడు. ఆ పిలుపు కోసమే తన ప్రాణం వున్నట్లు, రెండు చేతులూ చాపింది. ఆ చేతుల్లో అంత మనిషి కరిగి పోయాడు ఆ సింగిల్ మంచంలో సర్దుకుని పడుకుంటూ.

"మాధ్వీ-ఎపుడు వచ్చావు?" అన్నాడు.

"నాతో మాటాడకు ." అంది.

"అరె-ఏడుస్తున్నావా?" అన్నాడు జుట్టుపట్టి ముఖం వెనక్కి త్రిప్పి "ఇదో-ఏడ్వటం నాకిష్టం లేదని చెప్పాగా-ఏదైనా సహిస్తాను కాని, ఆ కన్నీళ్లే నన్ను ఇరిటేట్ చేస్తాయి" అన్నాడు.

"బుద్ధూ-" అంటూ ఛాతీలో ముఖం దాచుకుంది.

"బుద్ధూ-నేను చచ్చిపోతా-"

"ఎందుకూ?" అన్నాడు నవ్వుతూ.

"అన్నయ్యకు అలా ఉత్తరం వ్రాశారెందుకూ-నిజంగ-నిజంగా మీకు నా మీద ప్రేమలేదూ బుద్ధూ-నాకేం తెల్సు, సర్వస్వం మీరే అనుకొని ప్రేమించాను ఇపుడు ఇలా నన్ను శిక్షిస్తే పాపంకదూ? నన్ను పంపించెయ్యకు బుద్ధూ ప్రతిమలాడుతున్నట్లు,అలా చిన్నపిల్లలా అడుగుతుంటే సిద్ధార్థకి నవ్వూ, కోపం వచ్చాయి. తాను చేసిన మోసానికి తిట్టడం దూషించటం కూడ తెలియని పిల్లని ఎంత కష్టపెట్టాను ' ముగిపెంగ చెయ్యి పైనవేసి తల నిమురుతూ, "నా ప్లాను అంతా పాడుచేశావు. ఏడుస్తూ కొన్ని రోజులు మీ బంగారన్నయ్య దగ్గరే ఉండకపోయావా! తెలిసివచ్చేది నా చెల్లి ఎంత బాధ పడుతుందో." పైకిలేచి ఆశ్చర్యంగ చూసింది, "బుద్ధూ, మీ ప్లాను తెలియక ఎంత బాధపడ్డాను. నిజం తెలుసుకోకుండా చచ్చిపోయి వుంటే " అంది.

"ఆ పిచ్చిపనులు నీవు చేయవులే, అసలు నీకు అభిమానం, పౌరుషం వుంటేగా- వుంటే, అలా వదిలేస్తే, సిగ్గులేకుండా వస్తావా" అన్నాడు.

ఆ మాటలకి పైనబడి కొడుతుందేమోననుకున్నాడు, పకపక నవ్వింది. "ఓయ్ బుద్ధూ! మంచివాళ్ళకి మంచిగా, చెడ్డవాళ్ళకి చెడ్డగా, రౌడీలకి వాళ్ళకి మించిన రౌడీలగ వుండాలి. అదే నా మతం. మీకు వుంటేగా అదే అభిమానం, నాకు వుంటానికి. మీరు మంచివాళ్లయితే, పెళ్లిచేసుకొని,

ప్రేమించటం నేర్పి, అలా వదిలేస్తారా- హీనంగ బ్రతుకమని శపిస్తారా- మంచివాళ్ళు అలా భార్యలను వదలరేట'' అంది.

''ఆ సంగతులన్నీ మీ బంగారన్నయ్యకి చెప్పక పోయావా?'' వ్యంగ్యంగ అన్నాడు.

''అది వాళ్ళ విషయం అట- వాళ్లే చూసుకుంటారట'' అని మాధ్వి పకపక నవ్వి, ''అందుకే మన విషయం ఏమిటో తెలుసుకుందామని వచ్చాను'' అంది. ''కాలేజినుంచి ఇటు వచ్చాను'' అని గిలిగింతలు పెట్టినట్లు నవ్వ సాగింది మాధ్వి ..

అలా అర్ధరాత్రి మాధ్వి నవ్వు విని, అజంత భయపడి పరుగునవచ్చి, చివరి మాటలు విన్నది. వచ్చినంత త్వరగా వెళ్ళింది.

* * *

విపుల్ క్లాసు తీసుకుంటుండగా, పోస్ట్‌మాన్ ఎక్స్‌ప్రెస్ డెలివరీ ఉత్తరాన్ని ఇచ్చాడు.

''శ్రీవారికి- మీ సంతోషానికి ప్రతిబంధకంగా నేను వుండను. మీకు ఎలా నచ్చితే అలా చెయ్యవచ్చు. కాని నా యింటికి నన్ను దూరంచేస్తే ఇక నేను బ్రతుకలేను. రసజ్ఞకి నా శుభాశీస్సులు చెప్పండి.

మీ ప్రేమకు దూరమైన దురదృష్ట
జాతకురాలు 'అజంత'

ఆ ఉత్తరం ఎన్నో మధురస్మృతులను మోసుకు వచ్చింది. అజంత ఎన్నాళ్ళకి పిల్చావు. అప్పటికప్పుడే సెలవుపెట్టి ట్రైన్ ఎక్కాడు.

ఇంటి ఆవరణలోకి రాగానే, మేడవైపు చూశాడు. కిటికీ చువ్వలు పట్టుకొని, అజంత, తన కొరకే నిరీక్షిస్తున్నట్లు వుంది. ఎన్నాళ్ళనుండి అలా దారి కాస్తుందో! ప్రేమతో హృదయం కదిలిపోగా, చెయ్యి వూపాడు.

పరుగులాంటి నడకతో, ఒక్కోసారి రెండేసి మెట్లు ఎక్కుతూ, నేరుగ మేడమీదికి పోతున్న విపుల్‌ని చూసి, సౌభాగ్యమ్మ చిత్తరువే అయింది.

కొట్టుకునే గుండెలతో కిటికీదగ్గరే వుండిపోయిన అజంత, రొప్పుతూ విల్చుని తననుచూసి, చేతులు చాపిన విపుల్ గుండెపై వాలిపోయింది.

పరితప్త హృదయాలు సేదతీరాక, అతిమెల్లగా అంది అజంత. ''నన్ను మరిచిపోయా రనుకున్నాను-''

''అజంత, నీ పిలుపుకొరకు ఎదురు చూశాను. విన్ను మరవటమా . నన్ను నేను మరిచినప్పుడే కదా నిన్ను మరిచేది. ఈ ఆరునెలలు నీకు దూరంగ వుంది. శారీరకంగానే, మనస్సు నీ దగ్గరకే పరుగెత్తింది. నీ

ఆరోగ్యానికి భంగం రాకూడదు. సంవత్సరమైనా దూరంగ వుండాలన్నారు డాక్టరు. నీకు దగ్గరగా వచ్చి, వూరకుండలేను. నా చేతులు మంచివి కావని నీకు తెలుసుగా . నీవు వారిస్తున్నా, తిరుమలలో నిన్ను పొందాను. అందుకే శిక్ష పొందాము. అజంత'' అంటూ అక్కున చేర్చుకున్నాడు.

ఆ రోజు తోటలో తిరుగుతూ ''రసజ్ఞ'' అంటూ ఏదో అడగబోయి వూరుకుంది.

అతను ప్రశ్నార్థకంగ అజంతవైపు చూశాడు., వెంటనే నవ్వాడు. ''రసజ్ఞ- పేరు ఎంత మధురమో, అంతకంటే మంచి మనస్సు కలది.''

అజంత ముఖంలోని బాధ చూసి, నవ్వాపుకుంటూ, ''నా శిష్యురాలు మాత్రమే. నా అజంత నా మొదటి నా చివరి స్త్రీ కూడ. రసజ్ఞకు నీవు చాల ఋణపడి వున్నావు అజంతా. నా దుఃఖాన్ని పోగొట్టి, ధైర్యాన్ని ఇచ్చి, సత్యాన్ని గ్రహించేలా చేసింది.''

తన తొందరపాటుకు సిగ్గుపడినట్లు, తలవంచుకొని. ''మన్నించ'' మంది.

''నీవు ఆజ్ఞాపించేదానవు, మన్నించమనరాదు. ఈ కాలం వృధా అయిపోయింది. నిన్ను విడిచి ఇక క్షణంకూడ వుండను.''

''భాస్కరుడు సంధ్యను చేరుటకు ఇంకా ఎంతో వ్యవధి వుంది.''

''చూడు, ఎంత తొందరగ పోతున్నాడో మగవాడు'' అన్నాడు విపుల్ కొంటెగ, క్షణక్షణానికి తరిగిపోతున్న సూర్యుణ్ని చూసి.

ఇంట్లోకి వచ్చారు.

హాల్లో మాధ్వి గొంతు విని ఆశ్చర్యపోయాడు విపుల్. అంతగానూ ఆశ్చర్యపోయి ''అన్నాయ్'' అంది మాధ్వి.

విపుల్‌ని చూసిన సిద్ధార్థ పలుకరించకనే పైకి వెళ్ళాడు. అతన్ని చూడనట్లే వున్న విపుల్‌ని చూసి, అజంత, మాధ్వి కిలకిలమన్నారు.

* * *

అప్పటినుంచి కాలం మధురమైన గేయంలా సాగిపోయింది.

మాధ్వి ప్రక్కన చందమామలాంటి బాబు ఉన్నాడు. గదిలోకి సిద్ధార్థ రాగానే....

''బుద్ధూ'' పిలిచింది.

''మళ్ళీ ఏమొచ్చింది?''

''అన్నయ్యా, వదిన వెళ్ళిపోతారట-''

''పోతే??''

"బాబును ఇచ్చేస్తాను."

"అ ఏమంటున్నావ్ . పెళ్ళి చేసుకోమంటే చేసుకున్నాను. కాని బాబును ఇస్తానంటే వూరుకోను" బట్టలు మార్చుకుంటూ సాధ్యమైనంత కోపంగా అన్నాడు.

"ముందే మీకు వ్రాశానుగా!" బుంగమూతి పెట్టింది.

"అలా మూతి ముడవకు- కొరక బుద్ధేస్తుంది."

"నేను సీరియస్‌గా అడుగుతున్నా."

"వీలులేదని నేను మరీ సీరియస్‌గా అంటున్నా."

బాబు దగ్గరకు వెళ్ళి, "చూడరా కన్నా! నిన్నూ, నన్నూ వేరుచేసే అధికారం నల్లపిల్లకి ఎవరిచ్చార్రా?"

" మాధ్వీ- వీడు మీ అన్నయ్యలా వున్నాడని అంటున్నావ్ కాని. మీసాలుపెట్టి చూస్తే నా లాగే వుంటాడోయ్" అంటూ రబ్బరు కాలులా వున్న బాబు కాలును పట్టుకున్నాడు. జట్‌లా నీళ్లు వచ్చి సిద్ధార్థ చొక్కామీద పడ్డాయి. మాధ్వి పకపక నవ్వింది.

"ఇప్పుడే కదరా చొక్కా మార్చుకున్నాను. వీడికన్నీ అమ్మ బుద్ధులు వచ్చినట్లున్నాయి మాధ్వీ—"

"ఏమిటో కొడుకుతో మాట్లాడేస్తున్నావ్?" అంటూ విపుల్ వచ్చాడు.

మాధ్వి బాబును ఎత్తి విపుల్ కిచ్చింది, "బంగారన్నాయ్, బాబుని నీకు ఇస్తున్నాను. ఇంటికి తీసుకొని పో. వదిన సరేనన్నది" పేపరు చాటు చేసుకొని, ఉరిమి చూస్తున్న సిద్ధార్థవైపు అర్థిస్తున్నట్లు చూపింది.

"చెల్లెమ్మా! బాబును నా కివ్వడ మేమిటి? నీవు ఎంతో, వాడూ అంతే." తిరిగి బాబును మాధ్వి ఒడిలో వుంచి, తృప్తిగా చూస్తూ, "మాధ్వీ, నాకేదో లేదని నీవు బాధ పడుతున్నావ్. మనకొరకే పిల్లలు, పిల్లలకొరకు మనము కాదు. నీకెలా చెప్పాలి నా మనోభావాలు, పిల్లలు మధ్యలో వస్తారు. రెక్కలు రాగానే విడిచి వెళ్ళిపోతారు—చెప్పకుండా పెళ్ళిళ్ళుకూడ చేసుకుంటారు " అంటూ నవ్వాడు.

"చివరివరకు ఒకరికొకరుగా నిలిచేది ఆ ఇద్దరే. మన బ్రతుకు మనది. జీవితంలో ఒకభాగం పిల్లలు. వారు వుంటే సంతోషమే, కానీ, లేకపోయినా ఫర్వాలేదు. వృద్ధాప్యంలో మమ్మల్ని ఆదరించడానికి నీవు వున్నావుగా! నీవు నా బిడ్డవనే అనుకున్నా....పిచ్చితల్లి. మాకు పిల్లలు లేకున్నా—మా అనురాగానికి తక్కువలేదు. అజంత ప్రేమానురాగాలే నా జీవితాధారము. మాధ్వీ. . నీవు చిన్నదానివి. ఇంతకంటే నేను ఎక్కువ చెప్పలేను. అజంతను నీవు

నాకు చూపించినందుకు కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను ..'' మాధ్వి తల నిమురుతూ, ''వీడితో ఆడుకోవాలనిపించినప్పుడు తప్పక తీసుకుపోతాను. వీడికొరకు నీవు ఎంత వేదన పడ్డావు- అపుడు వీడిమీద విజంగ కోపం వచ్చింది.'' నవ్వి, బాబును ముద్దుపెట్టుకుని, అలాగే మాధ్వి చెంపపై ముద్దు పెట్టుకున్నాడు.

ఆ మాటలన్నీ విన్న అజంత ఎన్నడూ పొందనంత ఆనందాన్ని పొందింది.

విపుల్ అటు వెళ్ళగానే సిద్ధార్థ, మాధ్విని దరి చేర్చుకుని, ''మాధ్వీ- నీవు ప్రేమ స్వరూపిణివి. నీవు పెళ్లి చేసుకోమనగానే, చేసుకున్నాను- అందుకు ఓ చిన్న పాపాయిని ఇవ్వు—చాలు'' అన్నాడు.

సిద్ధార్థ మెడను కౌగలించుకుంది మాధ్వి. మాధ్వికి అందేలాగ క్రిందకు వంగాడు. ఆ కళ్లను ముద్దు పెట్టుకుంది.

ఆ రాత్రి సౌభాగ్యమ్మ భగవంతుని స్మరించి, భర్తప్రక్కన చోటు చేసుకుంది.

అజంత విపుల్ చేతిలో వొదిగిపోయింది.

మాధ్వి బాబుకు పాలు పట్టి, దిండ్లు అడ్డుపెట్టి, సిద్ధార్థ వీపును కౌ లించుకు పడుకుంది.

ఆ జంటలను చూసి, వీనస్ నక్షత్రం—తనకు అందీ అందనట్లున్న రేరాజును చూసి కన్నుగీటింది.



Edited and Published by V. Leelavathy Raghavaial
40/1 Moosasait Street, Madras-600 017 and Printed b
D. Hanumantha Rao, at Kranti Press,
12, Francis Joseph Street, Madras-600 001.

# వస్తుగుణ విశేషములు

**సుగుణ**

## పుగాకు

పుగాకును చుట్ట, బీడి, సిగరెట్ హుక్కా రూపములలో రకరకాలుగా పీల్చే అలవాటు ప్రపంచమంతటా వ్యాపించింది నేడు. అగ్బరు చక్రవర్తి కాలములో ఇదొక అపురూప ద్రవ్యముగను, నిషిద్ధ వస్తువుగనూ కూడ ఉండేదట జహంగీరు చక్రవర్తి కాలంలో కూడ పొగ చుట్టలను నిషేధించుటకు పెద్ద ప్రయత్నాలు జరిగాయట గాని లాభములేక పోయినదట.

ప్రస్తుతం దాని ప్రభావం చెప్పనలవి కాదు పాటకపు జనము మాట అటుంచి విద్యాధికులైన స్త్రీ పురుషుల్లో కూడ కొంత మంది పొగ త్రాగడాని కలవాటుపడి ఫ్యాషన్ క్రింద మార్చుకున్నారు. పోతే దీని మంచి చెడులు తెలుసుకుందాం.

మితముగ పొగపీల్చడంవల్ల వాతము, శ్లేష్మము తగ్గును, ఉబ్బసపు దగ్గు తగ్గును. జలుబును పోగొట్టును. సోమరితనము,బుద్ధి ప్రయాస, దేహప్రయాస వలన కలిగినబడలికను పోగొట్టును. (మితముగ వాడిననే )

పుగాకు చూర్ణము (ముక్కుపొడుము) పీల్చుటవల్ల నిద్రమాంద్యము పోగొట్టును. బుద్ధికి చురుకుదనము కలిగించును కాని దృష్టిబలము, ఘ్రాణేంద్రియబలము తగ్గించును.

చుట్ట పీకలు తెచ్చి కొబ్బరినూనెలోవేసి కాటుకవలె నూరి మానని పుండ్లకు వేసిన మానును.

పుగాకు కొబ్బరినూనెలో వేసి పిసికి వడగట్టి ఆ నూనెను తలకు పూసిన వెంట్రుకలు రాలిపోవుట, చుండ్రు మొదలైన దోషములు తగ్గును.

పుగాకు మెత్తగ నూరి కట్టిన చీము పట్టిన వ్రణములు, మురికి వ్రణములు మానును

పుగాకు, పచ్చి శీతాఫలపు ఆకు, హారతి కర్పూరము మెత్తగ నూరి కట్టిన పురుగులు పట్టిన వ్రణములలోని పురుగులు చచ్చి వ్రణములు మానును.

పుగాకు నూరి పట్టించిన చర్మవ్యాధులు, మొలగజ్జి మానును.

పుగాకు కాడలు కాల్చిన భస్మములో నూనె కలిపి రాసిన చిడుము, గజ్జి మొదలైన చర్మరోగములన్ని పోవును.

పుగాకునకు నెయ్యిరాసి గడ్డలకు కట్టిన (అంటించిన) గడ్డలు పగులును.

పుగాకువేసి కాచిన నూనె 5, 6 చుక్కలు చెవిలో పోసిన చెవిలో పోటు, చీము కారడము తగ్గును.

పిప్పిపన్నుకు పుగాకు నమిలిన తగ్గును.

చంటి బిడ్డల మలబద్ధమునకు, పాటి పుగాకు కాడ ఆసనములో పెట్టిన తక్షణమే విరేచనమగును. పాలుతాగు చంటి బిడ్డలకు కడుపుబ్బరము తగ్గించుట కిది ప్రధమ చికిత్స.

పుగాకునకు విరుగుళ్ళు పాలు, నెయ్యి, కొబ్బరినీళ్ళు.



# (క్రొత్త సీరియల్)

"మిష్టర్ సంపత్ ఎం. ఏ!"

హడావుడిగా లేచాడు. అతని అరచేతులు తడిగా ఉన్నాయి. ఏదో గాభరా! యెదురుగా ఉన్న స్ప్రింగ్ తలుపును ఆనుకొని ఉన్నాడో వ్యక్తి. అతని చేతిలో ఫైలులాంటి కార్టబోర్డ్ ఉంది. దాని వంకే దీక్షగా చూస్తున్నాడు. అతని నోరు యెండుకు పోతుంది.

"మిష్టర్ సంపత్ ఎం. ఏ"

ముందుకు వెళ్ళాడు. నేనే ఆ సంపత్‌ను అని చెప్పాలని ఉంది. నోట్లోనుండి మాట బయటికి రావటంలేదు. ఉద్యోగాల వేటలో మొదటి ప్రయత్నం ఇది.

"వెళ్ళండి" లోపలికి తర్జనితో చూపాడు.

## మిష్టర్ సంపత్ ఎం.ఏ

## మాదిరెడ్డి సులోచన

"థాంక్స్!" లోపల అడుగు పెట్ట బోయి ఆగాడు. తన టెస్టిమోనియల్స్ కూర్చున్న బల్లమీద వదిలి వచ్చానని తెలుసుకున్నాడు. వెంటనే వెనక్కు తిరి గాడు. తన పిరికితనానికి సిగ్గుపడ్డాడు. కాలేజిలో, యూనివర్సిటీలో ఫ్రాంక్‌నెస్‌కు మారుపేరు తను. ధైర్యం తెచ్చుకుని, ముఖానపట్టిన చమట ఒత్తుకున్నాడు.

గదిలో అడుగు పెట్టి అక్కడున్న నల్గు రికి నమస్కరించాడు. నర్వస్‌గా చేతిలోని ఒయోడేటాగల పెద్ద బ్రౌన్ కవర్ వారి ముందుంచాడు.

"బి, సీటెడ్ ప్లీజ్!"

ఒకతను కుర్చీ చూపాడు. మెల్లగా కూర్చున్నాడు. మరోసారి రుమాలుతో మెడక్రింద, నుదురు తుడుచుకున్నాడు.

"మీ పేరు తెలుసుకోవచ్చా?"

"ష్యూర్! నా పేరు సంపత్‌కుమార్."

ఒక బట్టతల వేసిన ప్రశ్నకు జవాబు చెప్పాడు.

"ఎం. ఏ.లో మీ గ్రూపు?" మరొక తను తన చేతిలోని ఫైలువంక చూస్తూ అడిగాడు.

"చరిత్ర! ఐమీన్ హిస్టరీ." ధైర్యా నికి విర్వచనగా తన్ను చెప్పుకునేవారు.

ఏమయింది? తడబడి పోతున్నాడేం!

"మీ అభిరుచులేమిటి?"

"చదవటం. ఆడటం " యెందుకు పోయే పెదవుల్ని నాలుకతో తడుపుకున్నాడు.

"ఐసీ! ఎవరి రచనలంటే ఇష్టం?"

"ఒకరిదని లేదు. అందరవి చదువుతాను."

"ఇంగ్లీషులో వచ్చిన పుస్తకాలు చదువుతారా?"

"ఉపన్యాసకుడిగా ఉండటానికి ఈ అర్హతలు అన్నీ ఉండాలా?" అని అడగబోయి మాట మింగేశాడు.

"వీలున్నప్పుడల్లా చదువుతుంటాను."

"మీకు ఎం. ఏ. లో ఫస్ట్‌క్లాసు రానట్టుంది". .క్యాజువల్‌గా అడిగాడు ఒకతను. సంపత్ హృదయము భగ్గుమంది. తల్లి, మామ హెచ్చరికలు గుర్తుకు తెచ్చుకుని, కోపాన్ని దిగమింగాడు.

"ఎందుకు రాలేదంటే ఏం చెప్పను— రాలేదు "

"యెనభై శాతం వచ్చిన కాండిడేట్స్ ఉన్నారు. అది వేరే విషయము ."

"యెనభై శాతం రాలేదు, రప్పించుకున్నారని" యెలుగెత్తి చాటబోయాడు. అది సమయముకాదని గుర్తుకు వచ్చింది. తన నో తిరుగుబాటుదారుడుగా చిత్రీకరిస్తారు. యెందుకొచ్చిన గొడవ.

"మీరు యెప్పుడయినా జైలుకు వెళ్లారా?"

"లేదు."

మరొకతను ఒరిజనల్స్ పరీక్షించాడు.

"ప్రస్తుత పాలనను గూర్చి నీ అభిప్రాయము?"

"అందరికి ఉన్న అభిప్రాయమే."

"అంటే?" నాల్గు కంఠాలు ఒకేసారి ప్రశ్నించాయి.

"ప్రజాస్వామ్యము పేరుతో దోపిడి జరుగుతుందని .."

"ఇది అందరి అభిప్రాయమా?"

"ఒక్క పైక్లాసు వారిది తప్ప."

వాళ్లు యెందుకో నవ్వుకున్నారు.

"మీరిక వెళ్ళవచ్చు. ఫలితాలు మీ ఇంటికి ఉత్తరం ద్వారా పంపుతాము."

"థాంక్స్!"

బయటికి వచ్చాడు. తను ఖాళీచేసిన సీటుపై, తన క్లాసుమేటు శర్మను చూచి ఉలిక్కిపడ్డాడు. అతనే చనువుగాముందుకు వచ్చి. ఏం ప్రశ్నలు అడిగారంటూ మరో ఇంటర్‌వ్యూ కండక్టు చేసినంత పని చేశాడు.

"వారికి క్లాసే ముఖ్యమట. వెళ్ళు ... నీకు ఉద్యోగం రావటం ఖాయం ."

శర్మ ముఖం వెలవెలబోయింది.

"టేకిట్ ఈజీ!" మళ్ళీ తనే అనునయంగా అతని భుజం తట్టాడు. అతనికి ఏమడిగారో చెప్పి, బయటకు వచ్చాడు.

"ఒరేయ్! నేను వచ్చేవరకు ఉండరా."

"మంచిది." శర్మ అమాయకుడు. వాడి వెనకాలున్న దుష్ట శక్తుల కోసం వాడిని కోపగించటం న్యాయం కాదు, అనుకుని వెళ్ళి కాలేజి ముందున్న పూల మొక్కలవద్ద కూర్చున్నాడు అతని మనసు ఆశా, నిరాశల మధ్య ఊగిసలాడుతుంది. ఉద్యోగం రావచ్చు అనుకునే సమయానికి టక్కున గుర్తుకువస్తుంది.

"మీకు ఫస్ట్‌క్లాసు ఎందుకు రాలేదు?" అన్న ప్రశ్న. ఆ ప్రశ్న అతన్ని విరాళ పరుస్తుంది. ఫస్టుక్లాసు యెందుకు రాలేదో చెబితే వింటారా, విన్నా నమ్ముతారా!

"సంపత్! నీ ఇంటర్‌వ్యూ కాగానే నాకు ఫోన్ చెయ్యి. వారడిన ప్రశ్నలను బట్టి నీకు ఉద్యోగము వస్తుందోరాదో చెబుతాను" మిలమిలలాడే కళ్ళతో అర్ధించిన సునీతి గుర్తుకు వచ్చింది.

'పిచ్చిదానివి సునీతీ!' అనుకున్నాడు. 'న్యాయం కావాలని అర్థించి అన్యాయానికి గురియైనవాడి ఇంటర్‌వ్యూ ఫలితాలు ప్రశ్నలనుబట్టి తెలుసుకో నక్కర లేదు' అనుకుని నిట్టూర్చాడు. అతనికి ఎం. ఏ. ఆఖరు పరీక్ష రాసేనాటి సంగతి గుర్తుకు వచ్చింది.

క్వెశ్చన్ పేపర్‌ను చూచి చాలామంది తెల్లమొహాలు వేశారు. సంపత్, అతని ముఖ్యమైన స్నేహితులు మాత్రం ఉత్సాహంగా రాయటం మొదలు పెట్టారు. వారు చదివిందే ఉన్నది. కాసేపటికి అలసట తీర్చుకుందామని తలయెత్తాడు, ఒక రీడర్ గారు ఆన్సర్ పేపర్లు మార్పిడిచేస్తున్నారు. అది చూడగానే సంపత్ హృదయము కుతకుత లాడింది. సంవత్సరపు పొడవునా కష్టపడి చదివిన తనలాంటివారు ఏంకావాలి? వారిది గ్రంథాలనుండి యథాతథంగా రాసింది కాబట్టి పరిష్టంగా ఉంటుంది. ఈ అన్యాయాన్ని అరికట్టాలి.

"ఎక్స్క్యూజ్ మి సర్" అతను లేచి నిలబడగానే, ఆ రీడర్‌గారు వచ్చారు. ఏమిటన్నట్టు చూచారు.

"మీరు ఆన్సర్స్ చేయటం అన్యాయం సర్."

"వాట్ డూ యు మీన్?"

"ఆ ప్రక్కవారి కందరకు ఆన్సర్ రాపిస్తున్నారు."

"మైండ్ యువర్ బిజినెస్" అతను కొర కొర చూచాడు. శర్మ! అందివ్వవలసిన పేపర్లు అందించేశాడు.

"నో సర్! ఇట్ ఈజ్ నాట్ ఫేర్ మీకు కొందరి విద్యార్థులపట్ల ప్రత్యేకమై అభిమానముంటే వేరే రూమ్‌లో ఎగ్జామ్ కండక్ట్ చేస్తూ, డిక్టేట్ కాదు మీ... వ్రాయండి. మాకు అభ్యంతరము లేదు.'

"షటప్!"

అప్పటికే కొందరు సంపత్‌ను సపోర్ట్ చేశారు. అది చూచి ఆ రీడర్ మండిపడుతున్నాడు.

"మర్యాదగా మాట్లాడండి."

"నేను ఇలాగే మాట్లాడుతాను, మీ దిక్కున్నచోట చెప్పుకోండి" అన్నట్టు మాట్లాడి, నిర్భయంగా నిల్చున్నాడు. అతను సహాయముచేసిన విద్యార్థులు మామూలు వ్యక్తులుకారు. ఉన్నత అధికారుల కుమారులే. ఇక శర్మతండ్రి పెద్ద రిసోర్సుఫుల్ మాగ్నెట్. అధికారులను బోల్తా కొట్టించగల సమర్దుడు. శర్మ అతని కొడుకంటే యెవరు నమ్మరు.

కొందరు విద్యార్థులు చీఫ్ సూపరింటెండెంట్ దగ్గరకు వెళ్ళి రిపోర్టు చేశారు. అతను అంతా విన్నాడు. అందరూ ఆతృతగా అతని మాటలకు వేచి ఉన్నారు.

"చూడండీ! ఒకరిమీద ఒకరు నేరారోపణలు చేస్తూ కాలం వృధా చేయటం మంచిదికాదు. తనవారికి అతనేదో చెబు

తున్నాడని బాధ యెందుకు? మీకు అర్థం గావివి అడిగి తెలుసుకోండి. అల్ రైట్, చూడండి పదిహేను నిమిషాలు ఎక్స్ట్రా టైమివ్వండి." అతను చర చరా వెళ్ళిపోయాడు. వీరంతా గుడ్లు మిటకరిస్తూ ఉండిపోయారు. ఇది అన్యాయము? ఒక బాధ్యతగల వ్యక్తి, యూనివర్సిటీకి సంబంధించిన వ్యక్తి, యెంత నిర్లజ్జగా—యెంత బాహాటంగా చెప్పాడు. ఆవేశం చూపితే అనర్థం తప్పితే మిగిలేది ఏముందదు। ఆవేశం, కోపం దిగమింగి మళ్ళీ వ్రాయటం ప్రారంభించాడు. అరగంట గడిచింది. మోచేతి క్రింది పేపర్లు లాగినట్టు అయింది. వెనక్కు తిరిగి చూచాడు. ఇందాక ఆన్సర్స్ రాపిచ్చిన వ్యక్తి నిల్చున్నాడు.

"ఏమిటి?"

"మూడో ప్రశ్నకు జవాబు వ్రాశావా?"

"ఊ! రాశాను యెందుకు?" అసహనంగా అడిగాడు.

"కంగారు పడకు. పదిహేను నిమిషాల గ్రేస్ టైమిస్తాను "

"యెందుకు?"

"ఆ! అదే. ఆ మూడో ప్రశ్నకు జవాబు తయారు చేయలేదు, ఒక అర గంటలో తెచ్చిఇస్తాను."

"ఏమిటీ?"

"అర్థం కాలేదా?"

"మీ అభిప్రాయం అర్థం అయింది. నన్ను మీరు యెందుకు అర్థం చేసుకోవటం లేదన్నదే అర్థం కావటంలేదు."

"జవాబు వ్రాసిన పేపర్ ఇలా ఇవ్వు."

"నాకు ఆ కాగితాలు ఇవ్వాల్సిన పని లేదు." విసురుగా కాగితాలు బొత్తి పెట్టి మోచేతి క్రింద పెట్టుకున్నాడు. అతను హూంకరిస్తూ వెళ్ళిపోయాడు. మర్నాడు తన జోలికి రాకపోతే, తన విజయానికి నవ్వుకున్నాడు. ఆ విజయగర్వం అట్టే రోజులు నిలువలేదు. రిజల్ట్స్ పేపర్లో చూచి నీరుగారి పోయాడు. తనపేరు సెకెండ్ క్లాసులో అచ్చయి కూర్చుంది. తల్లి, సునీతి, బాబు బలవంతం చేస్తే తన పేపర్ రీవ్యాల్యుయేషన్ చేయించాడు. అనుమానము తీరక యెంతో ప్రయత్నం మీద తన పేపర్లు చూచుకున్నాడు. ఆఖరు షీటు లేనేలేదు అది కావాలని చేసినపని. పకడ్బందీగా చేశారు. నిట్టూర్చాడు. తన జీవితంలో ఇలాంటివి ఇంకా యెన్ని చూడాలో।

"ఉన్నావా? వెళ్ళిపోయావనుకున్నాను." శర్మ వచ్చాడు.

"ఏమడిగారు?"

"థాంక్ గాడ్ ప్రశ్నలతో నన్ను బాధ పెట్టలేదు. నా బయోడేటా చూచుకుని ఇక వెళ్ళవచ్చు నన్నారు."

"ఉద్యోగం నీకు రావటం ఖాయం."

"నీకెలా తెలుసు?"

"కొన్ని చాలా తేలికగా తెలుసుకోవచ్చు. నీకు ఫస్టుక్లాసుంది మీనాన్న రికమండేషన్ ఉంది. అంతకుమించి నీ అదృష్టం బావుంది."

"నీ మాటలు ఒక్కటీ అర్థంకావు."

"అలా అర్థంకాకుండా ఉంటేనే నయంరా, హాయిగా, ఫస్టుక్లాసులో పాసవ్వవచ్చు". లేచాడు.

"పోరా నేను కష్టపడి చదివి క్లాసు

తెచ్చునున్నాను."

"ఆమాట కాదని యెవరంటార్రా!"

ఇద్దరూ లేచి బయటికి వచ్చారు. ప్రక్కనే ఉన్న చిన్న రెస్టారెంట్‌లో టీ త్రాగి యెవరింటికి వారు బయలుదేరారు. శర్మ వెళ్ళిపోయాక సునీతిని చూసిపోవా లనిపించింది. తిన్నగా వారింటివైపు నడి చాడు!

## 2

సంపత్‌కుమార్ ఒక్కడే కొడుకు అవటము మూలాన చలపతి, అనసూయమ్మ చాలా గారాబంగా పెంచారు. అల్లారుముద్దుగా అంటారే అలా పెంచారు. చలపతి సేల్స్‌టాక్సు ఆఫీసరుగా పని చేశాడు. హోదా, డబ్బూ అన్నీ ఉండేవి ఒక రేపు అన్న ఆలోచన తప్ప. సంపత్‌కు పది సంవత్సరాలుండగా అక స్మాత్తుగా గుండెపోటుతో మరణించాడు. ఏకాకి అయిన అనసూయను ఆదుకున్న వాడు ఒక వ్యక్తి. అతను చలపతి స్నేహి తుడు శివరాజు. అనసూయకు ఏ సర్టిఫి కెట్లు లేవు మెట్రిక్‌లేషన్ తప్పగానే వివాహము చేశారు. చక్కగా పాడగలదు. శివరాజు ఆమెను లైటు మ్యూజిక్‌లో డిప్లమా చేయించేడు. ఇప్పుడు సంగీతము మాష్టరమ్మ అయినా సరే మినిమమ్‌మెట్రిక్ పాసయి ఉండాలని నియమము పెట్టారు. అప్పుడు అంత స్ట్రిక్ట్‌గా లేవు రూల్సు. అందుకే అనసూయకు తేలికగా ఉద్యోగం దొరికింది. ఆ అభిమానమే అనసూయను శివరాజు కుటుంబానికి దగ్గర చేసింది. శివ రాజు మామూలుగా చిన్న ఫ్యాన్సీకొట్టు పెట్టుకున్న వ్యాపారి. ఇప్పుడా వ్యాపారం




బాగా అభివృద్ధి చెందింది. పెద్దకొడుకును ఫారిన్ పంపాడు. ఆ తరువాత కూతురు అనితకు వివాహము చేశాడు. బి. ఏ. ఆఖరు సంవత్సరము చదువుతున్న సునీతి, పబ్లిక్ స్కూల్లో పదవ తరగతి చదువుతున్న కొడుకులు ఉన్నారు. సునీతిని సంపత్‌కిస్తారని అందరు అనుకుంటు న్నారు. కాదని ఇరువైపులవారు అనలేదు.

సంపత్‌కు సునీతి అంటే చాలా అభి మానము. ఆ అమ్మాయి చురుకుతనానికి ముగ్ధుడవుతుంటాడు. ఒకే కుటుంబము వ్యక్తుల్లా అమరికలు లేకుండా బ్రతికారు.

సంపత్ వెళ్ళేసరికి సునీతి మొక్కలకు పాదులు చేస్తుంది. అతన్ని చూచి చేతులు దులుపుకుని వచ్చింది.

"నీకు బుద్ధి ఉందా?"

"లేనట్టుంది. ఉంటే నీలాంటిదాని స్నేహం చేస్తానా?"

"నాకేమయిందమ్మా! బంగారు తల్లిని"

"అరే నిజమా! మా రామనాధం బావయ్య ఇరవై కాసుల బంగారం ఏడితేగాని కొడుకు పెళ్ళికాదని దిగులు పడుతున్నాడు."

"షటప్!"

"థాంక్యూ."

"నేనేం చెప్పాను? అటు ఇంటర్వ్యూ కాగానే ఇటు ఫోన్‌చెయ్యాలని చెప్ప లేదూ?"

"ఫోన్ చెయ్యడ మెందుకని, అటు ఇంటర్వ్యూ కాగానే నేనే స్వయంగా వచ్చాను."

"కొయ్ . కొయ్ పది గంటలకు ఇంటర్వ్యూ అయితే, అయిదు గంట లకు వచ్చి"

"మేడమ్ సునీతీ, ఇంటర్వ్యూ కమి టిలో మీనాన్నగారులేరు, పదింటికి హాజరు కమ్మని, పన్నెండింటికి ప్రారంభిం గారు. ముగ్గుర్ని ఇంటర్వ్యూ చెయ్యగానే లంచ్ అవర్"

"ఓ పాపం, ప్రొద్దున అత్తయ్య పెట్టిన అన్నం మెతుకులేనన్నమాట . రా మొదట టిఫిన్ చెయ్యి తరువాత మాట్లాడుకుందాము." అతని చెయ్యిపట్టు కుని లాక్కుపోయింది.

"వదులు. నేను రానన్నానేమిటి?"

"నువ్వు రానంటే ఊరుకునేదెవ రట"

వంటింట్లో సావిత్రమ్మ పని చేసు కుంటుంది. సునీతి తమ్ములు ట్యూషన్ మాష్టారు దగ్గర చదువుకుంటున్నారేమో, బయటి గదిలో అలజడి వినిపిస్తుంది.

అతనికా ఇల్లు క్రొత్తకాదు. పెళ్ళి జేసిన్ దగ్గర చేతులు కడుక్కొని వచ్చాడు. అతను బల్లదగ్గర కూర్చోగానే - సునీతి కారప్పూస, బిస్కట్లు తెచ్చి ముందు పెట్టింది.

"నువ్వూ రాకూడదూ?"

"జంటగా తినే రోజులు ముందు న్నాయి కానిచ్చేయి త్వరగా."

"యెవరమ్మా సునీతీ!" సావిత్రమ్మ ముఖం తుడుచుకుంటూ బయటికి వచ్చింది.

"నేనే అత్తయ్యా బావున్నారా?"

"ఏం బాగు నాయనా! మూడు రోజు లుగా కాళ్ళ నొప్పులు ఒళ్లంతా తిమ్మి రెక్కినట్టు ఉంటుంది."

"డాక్టర్ దగ్గరకు వెళ్ళలేదా?"

"ఏం డాక్టర్లో ఏమో, రోగం కని పెట్టరు. మీ మామయ్యకా నా సంగతి పట్టదు. నాఖర్మ యింతే బాబూ" ఆవిడ కంఠము బొంగురు పోయింది. ఒక్క విషయము ఈ నాటికి సంపత్‌కు అర్ధంకాదు యెందుకు సావిత్రమ్మ బాధ పడుతుంది? అని చాలాసార్లు ప్రశ్నించు కున్నాడు. జవాబు దొరకదు. ఆవిడ బయ టికి వెళ్ళింది సునీతి కాఫీ తీసుకువచ్చింది.

"ఫలహారంతోపాటు మౌనము భోజ నము చేస్తున్నావా?

"లేదు. అత్తయ్య గురించి ఆలోచిస్తు న్నాను."

"సరి... బాగుపడ్డట్టే మిస్టర్ సంపత్ నా దొక్క మనవి. కొన్ని విషయాలు ఆలోచించక పోవటం చాలా మంచిపని. అందులో మా అమ్మను గూర్చి."

"యెందుకో!"

"యెందుకా? అదే పనిగా ఆలోచిస్తే మెంటల్ హాస్పత్రికి పోవాలి గనక." అన్నది నవ్వుతూ.

"సునీ " బయటనుండి కేక విని పించింది.

"వస్తున్నాడాడీ డాడీ " సునీతి పరుగెత్తింది. మరునిముషమే ఇద్దరూ డైనింగ్ హాల్లోకి వచ్చారు

"ఏమిటి విశేషాలు?" సంపత్ నమస్కారం అందుకుని అడిగాడు.

ఇంటర్‌వ్యూ సంగతి చెప్పాడు అతను వచ్చి సంపత్ ప్రక్కన కూర్చున్నాడు.

"ఊఁ కాలమే మారిపోయింది. విషయము చెబుతున్నా పారము చెప్పటానికి క్లాసుకు సంబంధం ఏమిటి?"

"ఫస్టుక్లాసు తెలివితేటలువల్ల వస్తుందని వారి భావమేమోనండీ " కాఫీ కప్పు దూరం పెట్టాడు.

"వారి తలకాయ." కూతురు తెచ్చిన ఫలహారముపై దండయాత్ర సాగించాడు.

"ఈ ఉద్యోగము నీకు రాదని కచ్చితంగా తెలుసా?"

"అనే నా నమ్మకము" అన్నాడు.

"పోనిలే. మరో దానికి అప్లయిచేయి" అన్నది ఓదార్పుగా. అతని కాఫీ అయ్యాక అందరూ డ్రాయింగు రూమ్‌లోకి వచ్చారు. సావిత్రమ్మ పేపర్లు సర్దుతున్నది.

"సునీతి! ఇక నేను వెడతాను అమ్మ యెదురు చూస్తుంది" చెప్పులు వేసుకున్నాడు.

"నేను ఆ పార్కు వరకు వస్తాను పద. అక్కడ సవిత దగ్గర పుస్తకం తెచ్చుకోవాలి. అయిదు నిమిషాల్లో వస్తాను డాడీ."

"త్వరగా వచ్చేయమ్మా. రోజూ పేపర్లో యెన్నో ఘోరాలు జరుగుతున్నాయని చదువుతున్నాము. మన వీధిలో జరుగుతుందని కాదు విషయము చెబుతున్నా "

"విషయము చెబుతున్నా" అన్నప్పుడల్లా సంపత్ ముసి ముసిగా నవ్వటం, సునీతి కొర కొర చూడటం మామూలుగా జరిగే విషయమే

ఇద్దరూ జంటగా నడుస్తున్నారు సునీతి తన క్లాసు మేట్స్ కబుర్లు చెబుతుంది. అతను విన్నట్లు నటిస్తున్నా అతని మనసు యెన్నో విషయాలు ఆలోచిస్తుంది అతని తల్లి సమస్యల రాపిడికి పూర్తిగా నలిగి పోయింది అభిమానము. అసహాయత వల్ల ఉద్యోగం చేస్తుందే తప్ప. ఒంట్లో రక్త మాంసాలు మచ్చుకయినా లేవు. ఆమె స్వభావము పూర్తిగా సావిత్రమ్మ స్వభావానికి విరుద్ధం. యెంతటి కష్టమయినా చిరునవ్వుతో భరిస్తుంది. కనిపించిన వారిదగ్గరంతా, తన కష్టాలు ఏకరువు పెట్టుకోదు.

"ఎయ్ బుద్ధావతారం! ఏమిటా ఆఁ ఊఁలు" సునీతి మోచేత్తో పొడిచింది.

"ఆఁ ఏమిటి?" గాభరాగా చూచాడు.

"నేను అప్పటినుండి వాగింది ఏం వినిపించలేదా?"

"సారీ సునీ "

"సారీలు, ధోవతులగురించి కాదు. మన గురించి మాట్లాడు."

"నాదంటూ, నాకో ఉద్యోగముంటే,

మనదంటూ ఆలోచించేవాడిని ''

''ఉద్యోగం దొరికేవరకు నన్ను గుర్తు చేసుకోవన్నమాట ''

''గుర్తు చేసుకోవాల్సిన అవసరం ఏముంది! నువ్వెప్పుడూ ''

''ఊఁ చెప్పు ...''

''నువ్వు మరీ బరితెగించావు '' అన్నాడు చిరుకోపం ప్రదర్శిస్తూ.

''నువ్వు ఆడపిల్లవయితే '' పక్కన నవ్వింది సునీతి.

''అలాంటప్పుడు నువ్వు మొగపిల్లాడి వయితే '' అంటూ క్రింద నీదో వెతక సాగేడు

''ఏమిటి నడుస్తూ వెతుకుతున్నావు? బుర్రగాని పారేసుకోలేదుకదా ''

''అబ్బే లేదు. ఇందాక ఒకరు పక పక నవ్వారు ముత్యాలజల్లు కురిసింది. ఆ జల్లులో ఈ బుర్ర కూడా పడిందేమో నని '' సుతారంగా ఆమె తలమీద మొట్టాడు.

''ఛీ నడిరోడ్డు సిగ్గులేదూ?''

''సిగ్గుపడితే ఆడపిల్ల అంటావు ''

''అది కాదు సంపత్ అమ్మకేమో నన్ను త్వరగా ఓ ఇంటిదాన్ని చేయాలని ఉంది ''

''ఇంతకీ నువ్వు బయటిదానివా?''

''చాల్లే పరిహాసము.''

''చాలించాను ''

''అబ్బ! ఒక్క నిమిషం నామాట వినవు కదా?''

''వింటాను చెప్పు '' ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. అప్రయత్నంగా వారు పార్కులోకి దారి తీశారు. ఇద్దరూ పచ్చగడ్డిపై కూర్చున్నారు.

''నాన్నగారు చాలా మారిపోతున్నారు సంపత్ ''

''మార్పులేని మానవుడంటూ ఉంటాడా? అలా ఉన్నవాడు విగ్రహమే సునీతి రికమండేషనులు అంటే ఎలర్జీ అనేవాడిని ఒక్కసారికే నీరసపడి పోయాను. మరో ఇంటర్వ్యూకు పిలుపు వస్తే మీనాన్నగారి పరపతి ఉపయోగించు కోవాలి అనుకుంటూ మీ ఇంటికి వచ్చాను.''

''అది వేరే విషయము. మా నాన్న గారి దృష్టిలో డబ్బులేనివాడు యెందుకు కొరగాని దద్దమ్మ ''

అతను చిన్నగా నవ్వాడు తన చేతిలో ఉన్న ఆమె చేతిని తన ఒడిలో పెట్టు కున్నాడు.

''ఒక్క మీనాన్నగారే కాదు ప్రపంచ ములో నూటికి తొంబయి తొమ్మిదిమంది అదే కోవకు చెందినవారు. మనిషి విలువ అతని ప్రవర్తనతోకాదు. అతని డబ్బుతో పెరుగుతుంది" అన్నాడు.

ఆమె తలయెత్తి అతని వంక చూచింది. ఆ కళ్ళలో అనుభవం తాలూకు ఛాయలు ఎల్లెడ పరుచుకున్నాయన్నట్టు భ్రమపడింది.

''త్వరగా ఉద్యోగం చూచుకో వెంటనే మనము '' ఆగి తల వంచుకుంది.

''ఊఁ .. వెంటనే చెప్పు సునీతీ''

''ఛ పో '' నవ్వుతూ మోకాళ్ళ మధ్య తల దాచుకుంది

వంగిన ఆమె తలపై చేయివేశాడు.

''సునీ! నా చిరకాల స్వప్నం ఏమిటో తెలుసా?''

"ఉహూఁ " అన్నది తల యెత్త కుండానే.

"నాకు మేడలు, కార్లు, పాష్ లొక్యాలటీలో నివాసం కావాలని లేదు సునీతి. మనుషుల్లా, మామూలు మనుషుల్లా, మధ్యతరగతి మనుషుల్లా, రెండు పూటలు తినగలిగితే చాలు. అమ్మ! నా కోసం జీవిస్తున్న అమ్మకోసము జీవిస్తాను. ఆమెకు కావాల్సింది నా సంపాదన, నా సేవలు కావు నేను తృప్తిగా జీవించడం "

"ఆవేశపడుతున్నావ్ సంపత్." తన తలమీదున్న అతని చేతిని ఆప్యాయంగా నిమిరింది.

"ఆవేశం కాదు సునీత్, ఆశయము. మనిద్దరము చిన్న ఉద్యోగాలుచేస్తూ, అమ్మను చూచుకుని బ్రతికితే చాలు...."

"తప్పక బ్రతుకుతాం సంపత్. నీ కోసం మా నాన్ననే కాదు. ఈ ప్రపంచాన్నే యెదిరిస్తాను."

అతను నవ్వాడు. ఆమె తల పైకి యెత్తాడు. ఆమె కళ్ళు వాలిపోతున్నాయి.

"నన్ను ఆవేశం అని నువ్వు చేస్తున్న పనేమిటో!"

"అబ్బా! చీకటి పడింది. డాడి యెదురు చూస్తారు" చటుక్కున లేచింది. అతనికి తెలుసు, తనలో కల్గిన ఆనందతరంగాలకు ఆనకట్ట వేయాలనే ఆమె లేచిందని, అతను లేచాడు. ఇద్దరూ మాటలు కరువయినట్టు గేటువరకు నడిచారు ఆమె చెయ్యి మాత్రం ఊపి చక-చకా ముందుకు వెళ్ళిపోయింది. అతను వెనుతిరిగి, నేలను కొలుస్తున్నట్టు ఒక్కొక్క అడుగే వేస్తూ ఇంటిదారి పట్టాడు.

## 3

"ఇంత బ్రతుకు బ్రతికి ఇదా నువ్వు చేసే నిర్వాకం!" రామనాథం కంఠము కరుకుగా వినిపించింది. అతను, బాబు ఓ చిన్న రేకుల షెడ్డు ముందు నిల్చు న్నారు. బాబు మరెవరోకాదు, అతని కొడుకే. అతని పూర్తి పేరు వీరాంజనేయ వరప్రసాదరావు ఆ పేరుతో యెవరూ పిలువరు. అంతా బాబనే పిలుస్తారు.

" ...."

"మాట్లాడవేంరా?"

బాబు తలయెత్తి చూచి మళ్ళీ దించాడు.

"మన జాతేమిటి, నీతేమిటి? కోళ్ళ పార్మ్ పెడతా ననుకోటానికి సిగ్గెలా లేక పోయింది?"

" "

"ఒరేయ్! తల్లి లేని పిల్లాడివని గారా బంచేసి పాడుచేశాన్రా!"

" "

"ఈ పౌల్ట్రీఫామ్ పెడితే నేను ఏదయినా త్రాగి ఛస్తాను. ఆఁ .. గుర్తుంచుకో."

అనసూయమ్మ వాకిట్లో నిలబడి అంతా వింటుంది. బాబు సంగతి ఆమెకు బాగా తెలుసు. తనకు సుముఖంగా లేని విషయాలకు ఒక్కనాడు జవాబు ఇవ్వడు.

"ఒరేయ్ వెధవా! నీకోసం రా నీ కోసం, ఈ యాతనంతా పడుతున్నాను. ఒక్కనాడయినా కడుపునిండుగా భోజనం చేశానా? కంటి నిండుగా నిదురపోయానా? చెప్పురా, చెప్పు!" బాబు జుట్టు చేతిలోకి తీసుకుని అటు ఇటు ఊపాడు విసురుగా. బాబు తండ్రి వంక కొరకొర చూచాడు. ఒక్కసారి తల విదిలించి వేశాడు. రామనాథం పడబోయి నిలద్రొక్కుకున్నాడు.

"ఒరేయ్! నీకు నీకు రోగం రానీ. నీ తలపై పడగళ్ళుపడి చావు! నన్ను ... నన్ను పడదోస్తావురా " రామనాథం శివమెత్తినట్టు అరుస్తూ అటు ఇటు చూచాడు. అతనికి మండిపోతుంది. కొడుకును యెంత ప్రేమగా పెంచాడని .. స్కూల్‌మాష్టారుగా చేసినవారు ఎవరి ఇల్లు కట్టారని. తనకొచ్చే జీతం కాక మూడు వాటాలవారు, నూటయాభై రూపాయలు ఇస్తారు. దానా దీనా యెంతపోయినా నెలకు అయిదువందలు తన సంపాదన. చిల్లికాని సంపాదించని కొడుక్కి అంత పొగరా! తనను ఏమనుకుంటున్నాడో!

అనసూయమ్మ ఏమీ అనలేక చూస్తూ నిల్చుంది. యెవరికి చెప్పినా కష్టమే. వారు ఒక్కసారి నెడితే చాలు, అంత దూరంలో పడుతుంది. రామనాథం వెతికి తెచ్చిన కర్ర చూచి హడలిపోయింది.

"చావరా చావు " కసిగా కర్ర యెత్తాడు. (సశేషం)

"ఏం కావాల్సార్?" సర్వరడిగేడు.

"ఏంవుంది వేడిగా?"

"అన్నీ వేడిగానే ఉన్నాయ్ సార్. ఇడ్లీ, వడా, దోశా, కాదోశా, ప్మా, పెసరట్, మిన్పట్, ఊతప్పా, బజ్జీ, బోండా, బిర్యానీ—" అరగుక్కలో లిస్టంత వొప్పగించేసి, "చెప్పాల్సరేం కావాలో—" అన్నాడు మిగతా గుక్కతో.

నేను ఉక్కిరి బిక్కిరై, గుక్క తిరక్క, ఒక గుటక వేసేను- ఇడ్లీ, వడ...తర్వాతేం చెప్పాడో తెలీక.

"ఏరా విశ్శిగా! చెప్పేం తిందాం?" అన్నాను. సమాధానం రాలేదు. పక్కకి చూసేను. విశ్వనాధం లేడు

అటూ యిటూ వెతకగా—అల్లంత దూరంలో - వాష్‌బేసిన్ పక్క నిలువుటద్దంలో వెఱ్ఱిగా చూసేసు కుంటున్నాడు తనని తాను ఎగాదిగా.

హోటల్లో చాలామంది వాణ్ణే చూ(సే)స్తున్నారు ఎగాదిగా.

"రేయ్!" అని పిల్చేను గట్టిగా, కాస్త కోపంగానూ.

వినపళ్ళేదో, వినిపించుకోలేదో-విశ్వనాధం చూళ్ళేదు.

విసురుగా వెళ్ళి, "వెఱ్ఱా, పిచ్చా?-రా-రా-" అన్చెప్పి తీసుకొచ్చేను.

"ఏరా రాజూ! నేను నిజంగానే యింత సన్నంగా ఉంటానా, లేక, ఈ అద్దం మంచిది కాదా?" అనడిగేడు విశ్వనాధం కూర్చుంటూ.

"ఛచ్చా. అది పావలా-కానీ అద్దం, నువ్వేమీ అంత సన్నం కాదు" అన్నాను.

"నిజంగానే?"

"ఆc"

"నా మీదొట్టే?"

"ఊc."

వెళ్ళిపోయిన సర్వర్ మళ్ళీ ఒచ్చేడు- ఏం కావాలంటూ.

నేను విశ్వనాధం కేసి చూసేను.

"ఇడ్లీ తిందాం" అన్నాడు

"సరేనని, సర్వర్‌కి ఆర్డరిచ్చేము.

"వెఱ్ఱిపీనుగా. మినువులు ఒంటికి బలం తెల్సా?" అన్నాడు విశ్వనాధం- సర్వర్ వెళ్ళేక.

* * *

భోంచేసి, సిగరెట్టు కాల్చుకుంటున్నాను.



కరంటు లేదు.

విశ్వనాధం బైటికెళ్లేడు.

ఏం తోచడం లేదు

"ఏ దివిలో విసిరిన పా-రిజా..తమో.."
కాకి కావ్ కావ్ మన్నట్టు పాడేను

పాటాప్పేసి, సిగరెట్టు దమ్ము లాగు తుంటే చెప్పుల చప్పుడైంది.

"ఎవరు, విశ్వనాధం?"

"ఊఁ."

విశ్వనాధం లోపలికొచ్చేడు.

కరంటొచ్చింది.

"సరిగ్గా నువ్వొచ్చేవ్, కరంటూ ఒచ్చింది" అనబోయి, వాడిచేతిలో పొట్లం చూసి-

"పకోడీ త్తెచ్చే వేవిట్రా? ఎంత ప్రేమురా నేనంటే నీకూ!" అన్నాను ఆశగా.

"పకోడీలూ కాదు, పెసరపుణుకులూ కాదు-నోరూరించుకోకు, శెనగలివి."

"శనగలా? ఎందుకురా? శనగ లెందుకూ?"

"నానబెట్టి తినడానికి."

"?"

"అలా చూస్తావేట్రా? శనగలు నానేసుకుని, రోజూ ప్రొద్దున్నే తింటే ఎంత బలవోఁ తెల్సా? సర్లే, నీకేం తెల్సులే." అని, శనగల పొట్లం విప్పి, చారెడు శనగలు స్టీలు గిన్నెలో వేసి, నీళ్లు పోసి నానేసి, గిన్నెమీద మూత పెట్టొచ్చేడు.

ఆ మర్నాడు పొద్దున్న లేచి చూసే సరికి-విశ్వనాధం ఒబ్బిడిగా కూచుని, ఒళ్లో శనగల గిన్ని పెట్టుకుని-చెట్టుమీద కోతి పండు తింటున్నట్టు తింటున్నాడు శనగలు.

* * *

పచ్చగా-పొడుగ్గా-సన్నంగా ఉంటాడు విశ్వనాధం. పచ్చగా, పొడుగ్గా, సన్నంగా ఉంటే అందంగా ఉంటారు కొందరు. విశ్వనాధం అందంగా ఉంటాడు. కాని పైన చెప్పిన మూడు"గా"ల్లోనూ మూడోగా ఉండడం విశ్వనాధాని కిష్టంగా ఉండదు. లావుగా ఉండాలని వాడి కోరిక. ఆ కోరిక తీరకపోడం చేత-తీరిక దొరికినప్పుడల్లా వెక్కి వెక్కి వెర్రి రాగాలు పెట్టేస్తూం టాడు.

'నేనెంత సన్నంగా ఉంటానో!'-

'ఇహ యింతేనా?'-

'లావెక్కనా?'-అని.

లావెక్కాలని విశ్వనాధానికి కోరికే కాదు. కోరికా, బాధా, సమస్యాను. వెరపి బెంగానున్ను.

'విశ్వనాధం అస్థిపంజరం'-

'విశ్వనాధం రవణారెడ్డి'-

'విశ్వనాధం గెడకఱ్ఱ'-

'విశ్వనాధం ఎలక్ట్రిక్ పోల్'-

'విశ్వనాధం కొంగ'-

ఇలా యిలా ప్రజలు అనేసుకుంటున్నా రేమో అనుకుని, "అనేసుకుంటున్నా" రని-విశ్వనాధం మనసు ఎలక రూపంలో ఒచ్చి అతన్ని దొలిచేస్తుంది.

ఒక్కోసారి అర్ధరాత్రి ఏపన్నెండు గంటలప్పుడో లేచి, లైటేసి, అద్దంలో వివిధ కోణాల్లో చూసుకుని ఏకాంతంగా బాధపడి పోతూంటాడు.

పాపం ఉట్టుట్టిగా బాధపడేసి ఊరుకోడు. లావెక్కడానికి ఎప్పుడూ ఏదో ఒక హడావిడిలాంటి ప్రయత్నం చేస్తూనే ఉంటాడు. 'బ్రహ్మర్షి' అనిపించుకోడానికి విశ్వా

మిత్రుడికి ఎంత పట్టుదలుందో 'లావెక్కాను' అనిపించుకోడానికి విశ్వనాధానికి అంత పట్టుదలా ఉంది.

కొన్నాళ్ళపాటు అరటిపళ్ళు తిన్నాడు.

ఎవరో గోధుమరొట్టు తినమని సలహా యిచ్చేరు. తిన్నాడు.

పచ్చి శనగలు తిన్నాడు-పన్నురుగుతుందన్నారు. తిన్నాడు.

పళ్లు తినమన్నారు.

పచ్చిలు తినమన్నారు.




మందులు తాగమన్నారు.

తేనె నాకమన్నారు.

ఏదో మన్నారు.

నవ్వమన్నారు.

ఇంకా చాలామన్నారు.

వీడు అన్నీ ఓపిగ్గా చేసేడు.

బాతే - ఎంత చేసినా, ఎన్ని తిన్నా-ఒక్కటీ అక్కరకు రాకుండా పోయేయి-శరీరం సన్నంగానే ఉంది.

'లావెక్కాలని ఉంది' అనే కోరిక అలానే ఉంది.

ఒక అంగుళం లావెక్కినట్టు ఎప్పుడేనా వాడికి అనుమానం వస్తే-"నేనీ మధ్య కాస్త లావెక్కాను కదట్రా" అనడుగుతూంటాడు-గుండెల మీద చేత్తో తడువుకుంటూనో, చేయి మడిచి కండ చూసుకుంటూనో.

"అవున్రా ఈ మధ్య కాస్త బాగానే ఉన్నావ్" అంటే చాలు బుడగలా ఉబ్బిపోతాడు. కాని అదేం జాతకమో వాడిది. ఆ లావు ఆట్టేకాలం నిలబడదు

హటాత్తుగా మంచం ఎక్కేసి — నాలుగో, పదో లంఖణాలు చేసేసి — పరిస్థితులు ఉల్టాసీదా అయి-తలప్రాణం తోకకొచ్చి-తోకప్రాణం లేచి మళ్ళీ తలకొచ్చి-చావు తప్పి, కన్ను లొట్టపోయి-పాత కిలోన్నర పెర్సనాల్టీనీ కొత్తగా వచ్చిన పది గ్రాముల పెర్సనాల్టీనీ కలిపి రోగం ఎత్తుకుపోగా-ఒర్రి మనిషి మిగుల్తాడు.

మళ్లీ బెంగ

అద్దం ఒద్దళ్లు.

అసలు వాడు అద్దాన్ని చేత్తో మోసి మోసి సగం చిక్కుంటాడని నా అనుమానం

"పోనీ దాన్ని మెడకు కట్టేసుకోరా-ముష్టాడి మెళ్ళో బిళ్ళలా ఉంటుంది చక్కగా" అంటే బుస్సు మంటాడు.

"ఏదో ఏడుస్తాలే నువ్వేమీ ఎకసెక్కాలు

చెయ్యక్కర్లేదు'' అంటాడు. అప్పు డప్పుడు "ఈ మధ్య నా బుగ్గలు కొంచెం ఉబ్బేయి కదరా?'' అంటాడు-పళ్లు కనబడ కుండా, పెదాల్ని జలగల్లా సాచి, చప్పి దవళ్ళుచూపిస్తూ.

"ఏరా విశ్వనాథం! ఇది నీ ఖర్మా, నా ఖర్మా?'' అని చాలాసార్లు అడగబోయి మానేసేను మా స్నేహం విడిపోడం యిష్టంలేక.

* * *

కళ్లు తెరిచి కిటికీలోంచి బైటికి చూసేను. ఇప్పుడిప్పుడే తెల్లవారుతోంది. ఇళ్లూ, చెట్లూ, అన్నీ పూర్తిగా మంచులో మునిగిపోయి ఉన్నాయి. రగ్గూ, దుప్పటీ జోడించి కప్పుకున్నాను. ఐనా చలి ఒంటిని కొరికేస్తోంది. ఇంకో దుప్పటి తలకిం దుంది. అది కూడా తీసి కప్పుకుంటే బావుణ్ణు. మనసు గారం గుడిపింది-

"పడుక్కుందూ-కదిల్తే నాకు చలే స్తుందీ!'' అని.

చిన్నగా చప్పుడు వినిపించి పక్కకి చూసేను.

పూనకం పూనిన వాడిలా-గుంజీలు తీసే స్తున్నాడు విశ్వనాథం.

ఒంటిమీద డ్రాయరు తప్ప బట్టల్లేవు.

గుంజీలు తీస్తుంటే టెర్లిన్ చొక్కా లాంటి వాడి పల్చటి చర్మంలోంచి యము కలు లెక్కపెట్టిచ్చన్నట్టు కనిపిస్తున్నాయి.

వట్టుమని పాతిగ్గుంజీలు తీసేసి, దబ్బు మని చాపమీద నిటారుగా పడిపోయి-ఒగ ర్చేస్తున్నాడు.

ఆనక-ఆయాసం తగ్గేక, లేచి కూచు న్నాడు.

ఓ కోడిగుడ్డు బద్దలుకొట్టి - గడగడా తాగేసేడు.

అద్దంలో అటూ యిటూ చూసుకుంటు న్నాడు-ఆవేశంగా, ఆనందంగా, బాధగా, బెంగగా.

వెర్రి పీనుగ.

పాపం కుర్ర పీనుగ.

కష్టపడి పోతున్నాడు.

ప్చ్.

'ప్చ్' అనుకుంటూనే-చలికి తట్టుకో లేక, తలకింద దుప్పటి తీసి పైన జోడించు కుంటూనే-విశ్వనాథంతో అన్నాను-"రేయ్ విశ్వనాథం! ఎందుకురా ఈ చలిలో అలా కిటికీ తలుపులు తెరిచేసి, చొక్కా విప్పేసి, గుంజీలూ, దండీలూ తీసేసి, అద్దంలో చూసేసుకుని, బెంగపడిపోయి, ఆవేశ పడి పోయి ..ఎందుకురా అంత కష్టపడ్తావ్? లావు గురించి నీకెందుకురా యింత తాప త్రయం? ఇప్పుడు నీకేం తక్కువైందిరా?"

విశ్వనాథం ఇమ్మీడియెట్‌గా ఇన్‌సల్టయి పోయి, కోప్పడిపోయి అద్దంలో చూసు కుంటూనే ఆవేశంగా అన్నాడు-"నవ్విన నాపచేనే పండుతుందిరా. నెల్లాళ్ళ టైమియ్ నాకు. సరిగ్గా మళ్ళా నెల ఈ తారీఖ్కి చూడు నన్ను. గుండెలు బాదుకుని ఆశ్చర్యపోతావ్ నా పెర్సనాలిటీ చూసి. వీధుల్లో నేన్నడు స్తుంటే రోడ్డు అదుర్తుంది ఆఁ''

"ఐ బాబోబో యై బాబోయ్! ఎలాగరా విశ్వనాథం ఆ ఘోరం చూడ్డం?''

"ఏమో ఎలా చూస్తావో-అది మాత్రం ఖాయం.''

"నే తర్వాచ్చూస్తా గానీ-ముందా కిటికీ తలుపులు మూసెయ్-నాకు చలేస్తోంది.''

* * *






నెల్లాళ్ళు పోయేక చూసేను.

విశ్వనాథం లావెక్కలేదు.

విశ్వనాథం నడుస్తుంటే రోడు అదర లేదు.

విశ్వనాథం బెదరలేదు

మానవ ప్రయత్నం మానలేదు.

బెంగని ఒదల్లేదు.

పట్టువదలని విక్రమార్కుడు

* * *

ఆ రోజు-నాకు కడప ట్రాన్స్‌ఫరైన రోజు. చాలా బాధేసింది విశ్వనాథాన్నీ, భాగ్యనగరాన్నీ వొదిలి వెళ్ళడానికి.

విశ్వనాథం బస్టాండు కొచ్చేడు నాకు టాటా చెప్పడానికి.

కాసేపు మా పాత ముచ్చట్లు మాట్లాడుకున్నాం.

ఇద్దరం చెరో లీటరు కన్నీళ్ళతోటే గుండెల్ని తడుపుకున్నాం.

తర్వాత విశ్వనాథం అక్కడున్న వెయింగ్ మిషన్ మీద బరువు తూచుకున్నాడు.

అరకేజీ బరువు తగ్గేనని బాధపడ్డాడు.

జీవితం చాలా విలువైనదనీ-దాన్ని అందంగా అనుభవించమనీ-అంతే కానీ 'లావెక్కడం', 'సన్నబడ్డం' లాంటి చిన్న చిన్న విషయాల గురించి పదే పదే ఆలోచించి-బుర్ర చెడగొట్టుకుని - బాధపడి - మరేమో .బెంగపడి - చిక్కి - శల్యమై-

అమూల్యమైన కాలాన్ని వృధా చేసుకో వద్దనీ, సన్నంగా ఉండడంలో ఉండే అందమూ, లాభాలూ, సుఖాలూ ఎరగమనీ- అవనీ, ఇవనీ-అలాగనీ-ఇలాగనీ-ఏవేవో నాకు తోచిన ఉచిత సలహాలు కొన్ని చెప్పి, 'ఉత్తరాలు రాస్తూండు-మర్చిపోకు' అనీ చెప్పి, బస్సెక్కే-సేను

బస్సు కదిలేక అనుకున్నాను-చాలా అనవసరంగా చెప్పేనేమో, వాడు చిన్న బుచ్చుకున్నాడేమో అని.

(ఆ తర్వాత మళ్ళీ విశ్వనాధాన్ని చూడ్డం కుదర్లేదు నాకు. వాడి పెళ్ళికి కూడా వెళ్ళలేక పోయేను.)

* * *

నాలుగేళ్ళ తర్వాత-చిన్న పని తగిలి హైద్రాబాదు వెళ్లేను బస్సు దిగి విశ్వనాధం కోసం వెదుకుతున్నాను,

''టెలిగ్రాం అందలేదా ఏవిటి? వీడు రానేలేదు'' అనుకుంటుండగా

''వొరేయ్, ఒరేయ్, రాజూ! హరి! మారిపోయేవురోయ్'' అంటూ ఆయాసంగా నా దగ్గరికి పరిగెత్తు కొచ్చేడు విశ్వనాధం.

ఆశ్చర్య పోయేను.

అప్పుడంత సన్నంగా ఉండే విశ్వనాధం ఏనుగులా తయారయ్యేడు.

చిన్నగుమ్మిడికాయంత తలా.

బంగినపల్లి మావిడిపండు చెంపల్లా-ఉబ్బిన బుగ్గలూ.

లావుపాటి జబ్బలూ.

మెడకీ, గడ్డానికీ మధ్య వేలాడుతున్న కండా,

చిరుబొజ్జా

గుర్తు తెలియనంతగా మారిపోయేడు.

''ఔరా! ఔరా! విశ్వనాధం, నువ్వేరా యీ మనిషివి?''

''ఔ(ను)రా ఏవిటలా ఆశ్చర్య పోతావ్? పద పోదాం.''

నాకు చాలా ఆనందం వేసింది. జీవితంలో వాడి తాలూకు పెద్ద కోరిక తీరినందుకు.

మాటల మధ్యలో అడిగేను-''ఎలా అయ్యేవురా నువ్వింత లావు?'' అని.

''ఏమోరా, ఈ మధ్య యిలా ఊరిపోయేను నీళ్ళలో శవంలాగ'' భళ్ళుమని నవ్వేడు-బాల్చీ జారి నూతిలో పడ్డట్టు.

రాత్రి నేను, విశ్వనాధం ఏదో హరికధ చెప్పుకుంటూండగా - విశ్వనాధం పెళ్ళాం భోజనానికి లేవమంది నన్ను.

లేచేను.

విశ్వనాధం లేవలేదు.

''ఏరా లేవవేం?'' అన్నాను.

విశ్వనాధం మొహమాటం మార్కు-మొహంతో నవ్వేడు.

విశ్వనాధం పెళ్ళాం కిసకిసా నవ్వుతూ చెప్పింది-''ఆయనకీమధ్య బెంగ (బెంగ) పట్టుకుంది లెండి-బాగా లావై పోతున్నారని. అందుకని ఈ మధ్య ఒక పూటే భోజనం చేస్తున్నారు.''

★




"చేయెత్తి కొట్టరా తెలుగోడా!" అంటూ వాటేసుకున్నాడు అప్పారావు ప్లేన్ దిగీ దిగగానే.

"కొట్టను" అంటూ వాడి జేబులోని పార్కర్ పెన్ను నాణ్యం పరీక్షించటంలో మునిగిపోయేను.

"ఆ పెన్ను నీ కోసమే తెచ్చానులే! తర్వాత తీరిగ్గా శల్య పరీక్ష చేద్దువుగాని, ముందు నన్ను చూడు, నిన్ను చూడనీ! అన్నట్టు మన సుబ్రావ్, రామ్రావ్, గోవింద్రావ్, వెంకట్రావ్, మాబాయమ్మ, షుజాతారాణి అందరూ కులాసా! అందరూ ఈ అయిత్రాబాద్‌లోనే ఉన్నార్టగదా?" అన్నాడు అప్రావు.

వాడూ, నేనూ, వాళ్ళూ అందరం ఆరో క్లాసులో దోస్తులం. అప్రావు మాత్రం ఏడో క్లాసు చదివేందుకు వాళ్ళ ఫాదర్తోపాటు ఆఫ్రికా వెళ్లి అక్కడే సెటిలయిపోయేడు. అక్కడే దో గనిలో పని చేస్తున్నాడని విన్నాను

మాచిన్నప్పుడు అప్రావ్ బామ్మగారు సాయంత్రంపూట మాకు కథలు చెపుతూ "మా అప్రావ్ బాబు ఆఫ్రికాలో ఏడో క్లాసు చదివేస్తున్నాడు. ఆఫ్రికా చాలా బాగుంటుందిట. మా వాడి స్కూలు పద్దెనిమిది అంతస్తుల మేడ. అసలు అక్కడ ఇళ్ళన్నీ బంగారపు పెంకుటింట్లో ఉందట. మావాడి ఏడో క్లాసు ఏడో అంతస్తులో ఉందిట" అని చెప్పేది.

"అయితే, బామ్మగారూ, పద్దెనిమిదో అంతస్తులో ఎన్నో క్లాసు ఉంటుందండీ?" అనడిగేనోసారి!

"ఓరి బుల్లోడా! ఏడో అంతస్తులో ఏడో క్లాసుంటే, పద్దెనిమిదో అంతస్తులో పద్దెనిమిదో క్లాసుంటుంది. ఆమాత్రం తెలీదురా! బోడి చదువులూ, మీరునూ. అయినా మన దేశంలో చదువులు ఇంతేలే. ఆఫ్రికా చాలా గొప్పదేశం సుమా! అక్కడ ఎక్కడ చూసినా బంగారమేనట. నువ్వు ఆఫ్రికా వెళ్లావనుకో. నువ్వూ మా అప్పిగాడూ గోలీలాడుకునేందుకు గొయ్యి తవ్వితే అందులో బంగారం దొరికి తీరుతుంది" అనేవారు బామ్మగారు.

నిజమో, కాదోగానీ మా అప్రావ్ ఫాదర్ మాత్రం అక్కడో ఇల్లు కట్టుకుని సెటిలయిపోయాడు. అప్రావ్ క్రిందటేడాది ఇక్కడే మా అగ్రహార ప్పిల్లని పెళ్ళిచేసేసుకుని ప్లేనెక్కి ఆఫ్రికాకు మళ్ళీ వెళ్ళిపోయాడు.

మావాడు ఆఫ్రికా గనుల్లో ఏవో పరి

శోధనలుచేసి "బంగారాన్ని బంగారం తోనే చేయవలెను. ఇత్తడితో చేయుట సాధ్యంగాదు" అని ఓ థీరీ రాసి డాక్టరేటు కొట్టేశాట్ట. ఆ సంగతి బి.బి.సి. వారు రేడియోలో ఘనంగా బ్రాడ్‌కాస్ట్ చేయగా విని మన ప్రపంచ తెలుగు సభల వాళ్ళు "చేయెత్తి జైకొట్టెదము తెలుగోడా! రా రమ్ము, చేసెదము నీకు సన్మానమ్ము" అని ఉత్తరం రాసి పిలిపించేరు మావాణ్ణి.

పోయేదేముంది! ఈ వెర్రి బాగుల వాళ్ళ ఖర్చుతో చుట్టపక్కాల్నందర్నీ చూసొద్దాం అనుకుని మావాడూ ప్లేనెక్కి హైదరాబాదులో దిగేడు.

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ!" అని ఊరికే అనలేదురా పెద్దలు. స్వంత ఊరు వచ్చినట్లే ఉంది సుమా!" అంటూ పొంగిపోయేడు అప్రావు, ఏర్‌పోర్ట్ నుండి బయటకు రాగానే

"సరేగానీ, హైదరాబాద్ ఏమిటీ? తెలుగు పేరులా లేదే!" అని సందేహం వెలిబుచ్చేడు.

"అబ్బే! అది తెలుగు పేరే' పూర్వం తెలుగు దేశాన్ని ఆ పేరుగల కోనసీమ బ్రాహ్మడొకడు పాలించేడులే!" అని డబాయించేను.

"ఓహో!"

ఇద్దరం టాక్సీకేసి నడిచేం.

"సైదాబాద్ కాలనీకి వస్తావుటయ్యా?" అనడిగేను డ్రైవర్ని.

"ఢేడ్ రూప్యా ఎక్‌స్ట్రా సార్" అన్నాడు వాడు ఎక్కక చస్తారా అన్నట్టు ధీమాగా.

"ఏమిటీ వీడు అంటున్నది?" అని ఇంగ్లీషులో ప్రశ్నించేడు అప్రావు.

"మరేంలేదు. మన తెలుగు చాలా గొప్ప భాష! ఏ సంకరాన్నయినా సహిస్తుంది. మనతెల్గూస్ కూడా గొప్ప వాళ్ళు. వీళ్ళు తెల్గూ తప్ప అన్నీ చక్కగా మాట్లాడగలరు! గర్వించరా ఆఫ్రికన్ తెలుగోడా!" అన్నాన్నేను. కాస్తదూరం పోయాక పెట్రోల్ బంకు దగ్గర ఆగింది టాక్సీ.

అప్రావు దూరాన కనబడుతున్న బోర్డు కేసి చూపించి బెదురుతూ అడిగేడు

"వాట్ ఈజిట్?"

ఆ బోర్డు ఓ పెద్ద హోటలు వాళ్ళది. "మా హోటల్లో రుచికరమైన "శాకకారము, మాంసహారములు లభించును" అని ఉందందులో.

"మాంసహారములు అంటే అదో స్పెషల్ లే. ఆఫ్రికాలో ఉంటున్న వాడివి ఆమాత్రం తెలీదురా" అన్నాను.

"సరే! మన గోలీకాయల ఫ్రెండ్సునందర్నీ ఓసారి చూడాలిగదా! ఎవరెవరు ఉన్నారీ అయిదురాబాద్‌లో, ఎప్పుడు చూద్దాం?" అనడిగేడు అప్పారావు.

"సుబ్రావ్‌గాడు బజార్ ఘాట్‌లో ఉంటున్నాడు. వాడి ఆఫీసు బషీర్‌బాగ్‌లో, రామ్రావ్ ఆఫీసు బర్కత్‌పురంలో. ఇల్లు మెహిదీపట్నంలో, గోవింద్రావ్ ఆఫీసు ఖైరతాబాద్‌లో, ఇల్లు మలకపేటలో. చూబాయామ్మ ఇల్లు మసాబ్ టాంక్‌లో, ఆవిడ మొగుడు పని చేసేది హిమాయత్ నగర్‌లో. షుజాతారాణి ఆఫీసు ఆబిడ్స్‌రోడ్‌లోని

చిరాగలీ లేన్‌లో ఉంది. ఇల్లేమో బేగంపేటలో" అంటూ అప్రావు కేసి చూసేను.

వాడు సీట్లో జారగిలబడి మూర్ఛ పోయిన వాడిలా పడున్నాడు.

దార్లో ఓ హోటల్ దగ్గిర టాక్సీ ఆపించి చల్లని నీళ్ళు తెప్పించి వాడి మొహం కడిగాక కాస్త తేరుకున్నాడు.

"అయితే ఇంతకీ మనం ఉన్నది తెలుగుదేశపు రాజధానిలోనా? లేక పాకిస్తాన్‌లోనా?" అని బెదురుతూ, బెదురుతూ ప్రశ్నించేడు.

"భయపడకు! ఈ టాక్సీవాడు పాకిస్తాన్ ఏజంటు కాదులే. మన తెలుగు వాళ్ళ హృదయాలు ఆఫ్రికన్ సరస్సుల్లా సువిశాలం. ఉర్దూనీ, పారశీనీ కూడా మాతృ భాషలాగే ప్రేమించగలరు" అని ఓదార్చేను.

ఆ తర్వాత అప్రావు హోటల్లోకి వెళ్ళి తెలుగు మహాసభల వాళ్ళకు ఫోన్ చేసేడు.

"అయ్యా నేను వచ్చేనూ!" అని చెప్పటం కోసం.

రింగ్ చేయగానే అవతల్నించి జవాబొచ్చింది,

"యస్! ది సీజ్ ఆఫీస్ ఆఫ్ వరల్డ్ తెలుగూ కాన్ఫరెన్స్, వాడ్డూయూ వాంట్?" అని గద్దించిందో అధికార కంఠం.

అప్రావు మరోసారి మూర్ఛపోబోయేడు. కానీ, ఓసారి అనుభవం అయి ఉండటాన్నేమో, తట్టుకున్నాడు.

"అయ్యా! మై నేమీజ్ అప్రావ్! ఐకేం ఫ్రం ది గ్రేట్ ఆఫ్రికా! మీరు సన్మానం చేస్తాం రమ్మన్నారని వచ్చాను. నాకు సన్మానం ఎప్పుడు? ఎక్కడ?" అని సవినయంగా అడిగేడు అప్రావు ఫోనులో.

అవతలి వాడు మరుక్షణం మర్యాదస్తుడయిపోయేడు. "వాట్! వాట్! ఆఫ్రికానుండే – అప్రావ్ గారే! చాలా చాలా సంతోషం అప్రావ్ గారూ! మీకు సన్మానం ఫతే మైదాన్‌లో జరుగును. వివరములకు మీరు రవీంద్ర భారతిలోని మా ఆఫీసుకు దయచేయగలరు!" అని ఫోన్ పెట్టేశాడు.

"రవీంద్రభారతి ఎక్కడ్రా?" అనడిగేడు అప్రావు నన్ను.

"అదా! సైఫాబాద్‌లో ఉంది."

"అదెక్కడ?"

"లకిడికాపూల్ ప్రక్కన."

"అదెక్కడ?".

"ఖైరతాబాద్‌ను ఆనుకొని."

"అదెక్కడ?"

"అమీర్‌పేట్ వెళ్ళే దారిలో"

"ఆపాపు!" అరిచేడు అప్రావు. "ఇది తెలుగు దేశమా? ఉర్దూ దేశమా?" అని ఏడుపు మొహం పెట్టేడు. టాక్సీవాడు బెదిరిపోయినట్టున్నాడు. టాక్సీ ఆపేసి గడ్డం నిమురుకుంటూ తలుపు తీసి "చెడింది సాబ్!" అన్నాడు.

చేసేదిలేక దిగి బస్‌స్టాప్ కేసి నడిచేం.

ఓ బస్ వచ్చింది. "అదేంటి?" అనడిగేడు అప్రావు బస్సు మీది బోర్డు కేసి చూపుతూ. దాని మీద "దిల్‌సుకునగర్ టు శకరపేట్" అని ఉంది.

"అది తెలుగులే. మనది అంతర్జాతీయ భాష. దిల్‌సుఖనగర్ నుండి శక్రపేట

యట్ వు ఈ బస్సు పరుగెత్తును అని దానర్థం" అన్నాను.

ఇంతలో మా కాలనీ బస్సు వచ్చింది. "ఇదేంటీ" అనడిగేడు అప్రావు మళ్ళీ బెదిరిపోతూనూ బస్సు బోర్డు కేసి చూపుతూ "యస్. బి. యల్. యల్. సి. హెచ్. కాలనీ టు ఉస్మాన్స్ కాలేజ్" అని ఉందా బోర్డు మీద.

"అదీ తెలుగే. అధికార భాష అంటారు దాన్ని. సైదాబాద్ లో కోస్ట్ హౌసింగ్ కాలనీ నుండి ఆడంగుల కళాశాలకు అని దానర్థం" అన్నాన్నేను లింగ్విస్టిక్స్ ప్రొఫెసర్లా ఫోజు పెట్టి.

అప్రావు కూలబడ్డాడు. మళ్ళీ ఠక్కీమని లేచి "అదేంటీ?" అనడిగేడు ఓ చిన్న బోర్డు కేసి చూపుతూ. దానిపై "మెడ మీద టైపు చేయబడును" అని ఉంది.

"అద్భుతం. మనవాళ్ళు చాలాచాలా క్రొత్త ప్రయోగాలు చేసి సాధించినట్లున్నారు. మెడ మీద ఎలా టైపు చేస్తారబ్బా! పోయి చూసొద్దామా?" అనడిగేడు వాడు.

"కాదు! టైపు ఇన్స్టిట్యూట్ మేడ మీద ఉంది. దాని అర్థం వేరులే" అని ఆపేను.

ఇంతలో మా కాలనీ బస్ కదలబోతే వాణ్ణి అందులోకి తోసేసి నేనూ ఎక్కాను.

(వచ్చే నెల అప్రావ్ సన్మాన విశేషాలు చెప్పుకుందాం.) ★



'ఏయ్! రాణి   ఏ రూములో ఉంది?''

''రాణీయా! ఎవరుసార్? ఆ పేరుతో
వరూ రూము తీసుకోలేదే!''

''ఇక్కడగాకపోతే   యింకెక్కడుం
ంది-మీ మేనేజరుగాడెక్కడ   కోమటి
క్కలు వేస్తున్నాడా? దానితోనేగా మీ
ునేజరు సంపాదించింది   నేనే ఎంతో
యిచ్చాను ప్రతి సారీ పాతిక. అది అత
డికి మామూలు ఎక్కడుందో చెప్పు,దాన్ని
ఉంచుకొని సంవత్సరం అయ్యింది.
ఎన్నాళ్ళనుండో వెతుకుతున్నా... రోజు
రోజుకు బాగుండేది అది  నీకు ఎప్పుడూ
తగల్లేదా  పంతులూ, మీ ప్రొప్రయిటరు
...రమణయ్య ..డాఫరుగాడు ఎక్కడుం

టున్నాడు. ఎంత సంపాదించాడో తెలుసా అంతా గుఱ్ఱాలమీద పెట్టాడటగా...పాపం సొమ్ము ఉంటుందా? ఈ గుఱ్ఱాలమీద సంపాదించాడు ఆ గుఱ్ఱాలమీద పెట్టాడు. పాపం వాడ్ని చూస్తే జాలేస్తుంది .వాడి పెళ్ళాం వాడ్ని చేరనివ్వదు. వాడికి దేనితోనో సంబంధం ఉందని వాడ్నియింట్లో తంతుంది. ఎవరి బిజినెస్ వాళ్ళదేలే నాకెందుకులే వాళ్ళ గొడవ . రాణి ఎక్కడుందో చెప్పు. నీ మామూలు నీకు ఇస్తాలే. నే నొస్తే పంపవద్దని చెప్పిందా? "ఎందుకు రాణీ! నీకీబ్రతుకు నాతో వచ్చేయి అని ఎన్నిసార్లు చెప్పానో వింటేనా! నేనంటే దానికి భయంలే నాతో వచ్చేయిమంటానని ...యింతకూ రాణీ "

"ఏమిటండీ— యీ గొడవ— కస్టమర్సుకు డిస్టర్బెన్సు."

"డిస్టర్బెన్సా! నేనూ కస్టమర్ నేగా అయామ్ యువర్ ఓల్డు కస్టమర్‌ను ఆ మేనేజరుగాడు నన్ను, దాన్ని గుల్లచేసాడు. ఇంతకీ అది ఎక్కడుందో చెప్పు-మామూలు మామూలే చెప్పు దాన్ని చూసేవరకు నేను వదలను. చెప్పకపోయావా? నా సంగతి తెలుసో లేదో—విన్నా నీ హోటల్ని—

"ఏమిటండీ—తాగి గొడవ యిక్కడ —మీరు వెళ్ళక పోతే— పోలీసులకు రిపోర్టు చేయవలసివస్తుంది."

ఏదీ— పిలువు— పోలీసులను పిలువు పంతులూ— నీ హోటల్లో జరిగే వ్యాపారం బయటపడుతుంది. పోలీసులు నన్ను కొట్లో పడేస్తారు అంతేనా మీ వ్యాపారం గోవిందా! మీ ప్రొప్రయిటరుకు యిన్‌కమ్ ఉండదు—మీమేనేజరుకు మామూళ్ళు పోతాయి— పిలువు పోలీసులను పిలుస్తావా? పిలువు—అప్పుడు గాని అందరకూ తెలియదు—యీ హోటల్-మీ ప్రొప్రయిటరు భార్య సంపాదనని—అది నా ఓల్డు ఫ్రండులే—యింతకూ పెద్ద మొత్తానికి —దాన్ని ఏదైనా కంపెనీ మేనేజింగు డైరెక్టరు బంగాళాకు పంపేరా?"

* * *

"ఏమిటండీ—ఆ గొడవ—ఎవడో తాగుబోతులా గున్నాడు—"

"ఏమీలేదు—ఈ హోటల్లో— ఒక అమ్మాయి ఉందట — ఆ అమ్మాయి కోసం.

"అతగాడికి చుట్టమా?"

"కాదు—"

"ఎవరో—అమ్మాయితో— వీడికేం పని,"

"ఆ అమ్మాయితో —వీళ్ళ — బిజినెస్ .."

"అయితే. . ఎవడయితే ఏం?—దానికి కావలసినది డబ్బేగా—యీ గొడవంతా ఎందుకూ? భలేహోటలు దొరికిందిలే మనకు..."

"యిష్టాయిష్టాలతో పనిలేదా? ...ఆ అమ్మాయికీ మనస్సుంది "

"డబ్బుకు వొళ్ళు అమ్ముకునేదానికి యిష్టాలూ మనస్సూ .. బాగా ఉంది వేదాంతం "

"ఒక స్త్రీ తోటి స్త్రీని గురించి అలా తేలికగా అసహ్యంగా ..మాట్లాడటం. ."

* * *

"రాణీ...రాణీ.. తలుపు తియ్యి..."

"ఎవరూ?...వీలుపడదు..."

"పోలీసులు వస్తున్నారు... ఎవడో బయట నిన్ను గురించి గొడవచేస్తున్నాడు

కష్టమర్. ఎవరో పోలీసులకు ఫోన్ చేసాడు. . తొందరగా.''

''పోలీసులా...వస్తున్న ''

''ఎవరూ . బాత్ రూములో ఉంచావా? ఓ మీరా . ఆ ఆఫీసరుగారా? , మాంచి ఖాతాలు దొరికి ఉండాలి.. ఆఫీసులో బయటకు ఆఫీసుపని మీద బయటకువెళ్ళినట్టు ఉంటుంది. .ఇంటిదగ్గర .మీ భార్య, భారతనారి .. తమరు శ్రీరామచంద్రులను కుంటూ ఉంటుంది.. సరే .. పోలీసులు వస్తున్నారు ,, మీరు యీామె మీ భార్య అని చెప్పాలి లేక పోతే...''

''భార్య . అనా!''

''కాదా? . మీ డిగ్నిటీకి భంగమా .. సార్... యిప్పటికివరకూ ..''

''గొడవచేయకు బాబూ. . ఎంత కావాలో ..''

''నీలాంటి వాళ్ళే. . ఆ వచ్చే పోలీసు వాళ్లకూడ వాళ్ళతో బేరమాడు ఆఫీసులో ఫైళ్ళు అనుకున్నారా? ''

"నీ కాళ్ళు పట్టుకుంటాను ఉద్యోగం."

''నీవు దులుపుకుపోతావ్ . పెద్దమనిషిగానే చెలామణి అవుతావు ..అదే పాపి .. దాన్ని కొట్టి కొట్లో పడేస్తారు ఛీ . నీవుంటే ప్రమాదంకూడాను . పో .''

''రాణి . తొందరగా. . నీ పెట్టెలో. మంగళసూత్రంతీసి కట్టుకో నేను నీ మొగుడ్నని చెప్పు . నేనూ అలాగే చెబుతా. పాతకేసు కాదుగదా?''

''కాదు .''

''అయితే . ఫర్వాలేదు తొందరగా . సూత్రం కట్టుకో యీపెట్టె . యిక్కడ బోయిదిలే నాదని చెప్పు .''

''మీరు ''

''నేనెవరినైతే ఏం? సూత్రం.. నీవేకట్టుకున్నావుగా ..నీవు నాకు తెలుసు. నేను నీకు గుర్తుండకపోవటం... సహజమేగా ..

''మీరు అలా అనకండి''

''అయితే చెబుతా విను నెలరోజుల నాడు ... మరొక హోటల్లో. ,నీమకాం... అప్పుడు కలుసుకున్నాం . . నేనొక పెద్ద కంపెనీ మేనేజరునని. నెలకొకసారి సిటీకి ఆఫీస్ పనిమీదవస్తూ ఉంటాననీ వచ్చినప్పుడల్లా . రెండు మూడు రోజులుంటాననీ చెప్పాను ఇంటి ఖర్చులన్నీ నేనే పెట్టుకొని ఖర్చులకు నీకు నెలకు 500 రూపాయిలు యిచ్చేటట్టూ నేను లేనప్పుడు నీ బిజినెస్ నీదేననీ, ఒప్పుకుంటావా అని అడిగాను నీవు ఎగిరి గంతేశావ్ ఖర్చులకూ, హోటల్ ప్రొప్రయిటరును వదిలించుకుంటానికీ ముందుగా, నాలుగువేలు అడిగావు సరే నన్నాను కూడాను ఆ రాత్రి ఎవరినీ పంపవద్దని మేనేజరుకు చెప్పావు నన్ను వదిలిపెట్టలేదు నీవు డబ్బుకూడా తీసుకోలేదు ఇప్పుడయినా గుర్తు వచ్చిందా? పాపం అంతా నమ్మి ఉంటావ్ నీకోసం నేను అలా అబద్ధాలాడాను నేను దిక్కూ మొక్కూ లేని ఒక గుమస్తాగాడ్ని నీవు యిక్కడున్నావని తెలిసింది క్షమార్పణ కోరాలని వచ్చాను. బయిట గొడవ అంతా విన్నాను ఎవరో వస్తున్నట్టుంది. నేను పడుకుంటాను నీవు స్నానం చేస్తూ ఉండు. ఈ రూము ఎవరి పేరుతో బుక్కు అయ్యి ఉంది?''

''రామారావు అండు ఫ్యామిలీ''

''సరే నా పేరూ రామారావే.'' ★

# పెళ్ళికాబోయే యువతులకు ప్రత్యేకం!



అబ్బూరి ఛాయాదేవి

# ఎవర్ని చేసుకోను?

## డాక్టరుగారి భార్య

పెళ్ళికొడుకు హౌస్ సర్జన్ అని విని సంబరపడ్డాను. హౌస్ సర్జన్‌కి హౌస్ వైఫ్‌ని అవటం నా అదృష్టం అని మురిసి పోయాను. అయితే, నా చదువు మధ్యలో ఆపటానికి వీల్లేదు బి. యె. పూ
చేయించమని పెళ్ళికొడుకు పట్టు పడ
తున్నాడనీ, నా చదువు పూర్తయేసరి
తను ప్రాక్టీసుపెట్టి స్థిరపడటానికి వీలవ

తుందని అన్నాడనీ విని కొంత నిరుత్సాహ పడ్డాను. సంబంధం కుదిరిందనగానే చదువుకి టాటా చెప్పేసి హాయిగా ప్రణయ లోకాల్లో విహరిద్దామని ఊహించుకుని ఉయ్యాల లూగుతున్న నేను ఒక్క ఊపుకి నేలమీద పడ్డట్లు బాధపడ్డాను. అంతలోనే నన్ను నేను సమాధాన పరుచుకున్నాను. డాక్టరుభార్య కావటం అంటే సామాన్యమా? ఎంత దర్జా! ఎంత హోదా! ఆయనకి తగినట్లుగా నేనుకూడా బాగా పెద్ద చదువులు చదివి ఆయనముందు రాణించవద్దా మరి! అనుకుని చదువులో నిమగ్నం కావటానికి ప్రయత్నించాను లగ్నం పెట్టేవరకూ.

పెళ్ళయాక విడిదిలోకి వెడుతున్నప్పుడు ఆయన్ని నా చెయ్యి పట్టుకుని ముందుకి నడవమన్నారు. ఆయన నా చెయ్యి పట్టుకున్న తీరుచూసి మా తమ్ముడు పక పకా నవ్వుతూ "ఏమిటండోయ్ బావగారూ, మా అక్కయ్య నాడి చూస్తున్నారా!" అన్నాడు ఆయన చిరునవ్వు నవ్వి నా చిటికెనవేలు పట్టుకున్నా రప్పుడు

ఆ రాత్రి ఆయన ప్రవర్తన చూస్తే నా కన్యాత్వానికి శస్త్రచికిత్స చేసినట్లని పించింది గాని, కథల్లోనూ కావ్యాల్లోనూ వర్ణించినట్లు సంభోగలీలగా అనిపించలేదు అంతా అయాక, "ఇట్ విల్ బి ఒ. కె డోన్ట్‌వర్రీ" అన్నారు నా చీర మోకాళ్ళ కిందికీ, దుప్పటి గుండెలమీదికీ లాగుతూ "థాంక్యూ డాక్టర్" అన్నాను పళ్ళు బిగించి

ఆయన డిస్పెన్సరీ ఇంట్లోనే పెట్టుకున్నారు ఇంటికి ముందు భాగంలో ఆయన డిస్పెన్సరీ, వెనకభాగంలో మా కాపురం. ఇంట్లో ఉన్నారన్న పేరేగాని డిస్పెన్సరీలో కాలు పెట్టారంటే ఇంకి ఇల్లూ ఇల్లాలూ ఆయనకి గుర్తుండరు. ఒక వేళాపాళా లేదు ఆ రోగులికి 'డాక్టరుగారూ' అనీ 'బాబుగారూ' అనీ ఎవరన్నా రోగిగాని రోగితాలూకు మనిషి గాని పిలవటం తడువు "పిలిచిం జెప్పడు" అన్నట్లుగా పరుగెత్తుతారు. పొద్దుటినుంచి రాత్రిదాకా ఆయన కోసం నిరీక్షించటమే నా ఉద్యోగమయిపోయింది

పెళ్ళికాని క్రితం పొద్దున్నే తొమ్మిదింటి లోపల భోజనం చెయ్యటం మళ్ళీ మధ్యాహ్నం లంచ్, రాత్రి డిన్నరూ రోజుకి మూడుసార్లు అన్నం తినటం అలవాటయింది పెళ్ళయిం తరవాత ఈ అలవాటులో మార్పు వచ్చేసరికి ఒడ్డున పడ్డ చేపలా గిలగిల్లాడాను ఆయినకి పొద్దున్నే బోయిల్డ్ ఎగ్గూ, ఒకగ్లాసు పాలూ వాటితోబాటు బిస్కట్లూ ఏదో పండూ తినటం అలవాటు. నాకు ఆ పాలంటేదోకు. అదిచూ ఆయనకిషాకు. నేను పొద్దున్నే ఒకకప్పు స్ట్రాంగ్ కాఫీ తాగుతాను. కాఫీతాగిన తరవాత ఆయనతో బాటు పళ్లు తిన బుద్ధి వేసేదికాదు. రెండో మూడో బిస్కట్లు తింటే ఏ మూలకి? కోడిగుడ్డు నేను జన్మలో ముట్టుకుని ఎరగను పని కుర్రవాడే ఉడకపెట్టి ఇచ్చేవాడు ఆయనకి

"బొత్తిగా ప్రొటీన్స్‌లేవు నువ్వు తినే ఆహారంలో పాలూ కోడిగుడ్డూ లేక పోతే ఆరోగ్యంగా ఎలా ఉంటావ్?" అని ఉపన్యసించేవారు

"ఏమో, నాకు పుట్టినప్పటినుంచీ మా వాళ్ళు కోడిగుడ్డు పెట్టలేదు స్మండీ.

హాయిగా ఆవకాయ, గిడ్డ పెరుగూ వేసు కుని చద్దెన్నం తినటం అలవాటు నాకు. ఏం. ఇప్పుడు నాకేం లోటువచ్చిందని!'' అని వాదించాను

''అదీ! అందుకే అంత పేల్‌గా ఉంటావు'' అన్నారు నా కంటిదగ్గర చర్మం క్రిందికి లాగి కంటిలోపలికి చూస్తూ.

ఆయన మరీ బలవంతం చేసిన మీదట ఒకరోజు పాలు తాగిచూశాను భొళ్ళున డోకొచ్చినంత పనయింది

''పోనీ, యాపిల్ అయినా తిను రోజూ'' అన్నారు.

''వద్దు బాబూ, ఇట్ కీప్స్ మై డాక్టర్ ఎవే!'' అన్నాను

నా ఒక్కర్తె కోసం పొద్దున్నే ప్రత్యే కం టిఫిను ఎక్కడ చేసుకుని తిన్నని చెప్పి బ్రెడ్ తెప్పించుకుని తినేదాన్ని. అలవాటు లేక ఆకలి తీరక కడుపు నక నకలాడి పోయేది. మధ్యాహ్నం భోజనం వేళకి ఆయన జనానికి ఒక వేళకి అంటూ రారు ఓరోజు ఒంటిగంట ఓరోజు రెండు, ఓరోజు రెండున్నర-ఆ రోగుల సంఖ్యను బట్టీ రోగాల తీవ్రతని బట్టీ ఆయన భోజనంవేళ మారుతూ ఉండేది పని హడావిడిలో ఉండటంవల్ల ఆయనకి ఆకలి తెలిసేదికాదు. ఊరికే కూర్చునే సరికి నా ప్రాణాలు పోతున్నట్లుగా ఉండేవి

అప్పుడప్పుడూ విసుక్కునేదాన్ని ''ఏమిటి బాబూ, తిండికి మొహం వాచే ట్లు చేస్తున్నారు'' అని పోనీ అలాం టప్పుడైనా ''నువ్వు తినేసి కూర్చోరాదూ'' అని మాట వరసకైనా అనే వారుకాదు. పాతివ్రత్యం పేరుతో ఆయన మాట జవ దాట కూడదని తినేసి కూర్చునే దాన్నే! కాని, నాతో కలిసి భోంచెయ్యాలని అను కునేవారు కాబోలు పోనీ ఆ మాట పైకి అంటే ఎంత మురిసి పోదును! అలా కాకుండా, ''అందుకే పొద్దున్నే నాతో బాటు కోడిగుడ్లూ పాలూ పళ్లూ తీసుకో మంటాను శరీరంలో దారుఢ్యం ఉండద్దా. నువ్వు తినేదాంట్లో ఏముంది? బలం రమ్మంటే ఎక్కణ్ణించి వస్తుంది! అలా ఈదురో దేవుడా అంటూ కూర్చోకపోతే పొద్దున్నే బలమైన పదార్థాలు తినరాదూ ఆరోగ్యం బాగుపడటంతో బాటు ఆకలి కూడా తీరుతుంది'' అనేవారు

మధ్యాహ్నం భోజనంచేసి కాసేపు నాతో కబుర్లు చెబుతూ విశ్రాంతి తీసుకో వాలని ఆయనకి తోచేదికాదు ఒకవేళ నేను కబుర్లలోకి దించినా ఎవడో రోగి వచ్చి ఆయన్ని గద్దలా తన్నుకు పోయే వాడు. నేను వెర్రిమొహం వేసుకుని ఒక్కర్తెనీ కూర్చునేదాన్ని.

సాయంకాలం పూట ఎక్కడికైనా షికారుగా వెడదామనుకుంటే ఆయన మెడికల్ జర్నల్స్, బుక్సు ముందు వేసుకుని చదువుతూ కూర్చునేవారు రాత్రి నిద్రపోయేముందు కాస్సేపు నన్ను ముద్దుచేసి, ఆటుపైన కుటుంబ నియం త్రణ పద్ధతి ప్రకారం ప్రణయ వ్యవ హారం సాగించి, తరవాత గ్లాసుడు పాలు తాగి తేన్చి పడుకునేవారు నాకు ఒళ్ళు మండుకొచ్చేది ఆ వ్యవహారం చూస్తూం టేనే నాకు జుగుప్స కలిగి ఆఖరికి ప్రణయం అంటేనే విరక్తి పుట్టడం ప్రారంభించింది ఛీ, డాక్టరుని ఎందుకు

పెళ్ళి చేసుకున్నానా అని విచారించాను కూడా ఒక్కొక్కప్పుడు. సాటి డాక్టర్ల భార్యల్ని తలుచుకుని కొంత ఊరడి పొందాను.

కానీ, క్రమంగా నా సహనం సన్న గిల్లటం ప్రారంభించింది. అప్పుడప్పుడు ఆయనతో దెబ్బలాడేదాన్ని నన్ను బొత్తిగా లక్ష్యపెట్టటం లేదని. ఆయన మాత్రం విసుక్కుని నాతో సమానంగా వాదించే అసలు విషయం తప్పించి విటమిన్లమాట ఎత్తుతా రెందుకు?'' అని రెట్టించేదాన్ని.

నా గోల చెవిటివాడిముందు శంఖం ఊదినట్లుగానే ఉండేది. ఒకసారి సిగ్గు విడిచి కోపంలో అనేశాను ''మీ వ్యవహారం నాకేం నచ్చట్లేదు. నాకు పిల్లలు కావాలి'' అని.

''అప్పుడే?'' అని ఆశ్చర్యపోయారు.

''అప్పుడే ఏమిటీ? నేనింకా చంటిపిల్ల



వారు కాదు. నా ఉద్దేశం చూసి, ''నీకు బలహీనత ఎక్కువవుతోంది. పాలుతాగమంటే తాగవు. ''బి'' విటమిన్ వేసుకోమంటే వేసుకోవు రెగ్యులర్‌గా. ఎన్నిసార్లు చెప్పినా వినవు'' అనేవారు తాపీగా.

''వెధవ ''బి'' విటమిను మాత్రలు నేను మింగలేను. కంపు. అయినా ననుకుంటున్నారా?'' అన్నాను.

ఏ కళన ఉన్నారో, ఒప్పుకున్నారు. కానీ, మనం అనుకున్నంతనే సరిపోతుందా? ఆ భగవంతుడికి మూడ్ కుదరద్దూ? ఎన్ని తంటాలు పడ్డా ఏమీ కాలేదు. నేను నిరుత్సాహ పడ్డాను. బాధపడ్డాను. కానీ ఆయన చాలా నిర్లిప్తంగా తీసుకున్నారు.

''మన దేశంలో పెళ్లి అనేది కెమెరా లాంటిది. శారీరకంగా మనం క్లిక్ కాలేదు - దట్సాల్'' అన్నారు.

సమానాంతర రేఖల్లా మా జీవితాలు కొనసాగాయి కలుసుకోనూ లేక విడిపోనూ లేక-ఎవరిత్రోవని వారు పోతూనే బండిని లాక్కొస్తున్నాం.

రోగులూ రోగాలూ తప్ప ఆయనకి మరో ధ్యాస లేదు నేను కాలక్షేపం లేక గిలగిల్లాడిపోయేదాన్ని అంతకంతకి నాకు అసహనం, అసంతృప్తి అధికమైపోయాయి

ఓరోజు సాయంకాలం ఎవరింటికో పార్టీకి వెళ్లాల్సి వచ్చింది ఇద్దరం తయారై వెళ్ళబోతూంటే ఏదో ఎమర్జన్సీ కేసొచ్చింది.

''నువ్వొక్కర్తివీ వెళ్ళిరాకూడదూ'' అన్నారు నాతో. నాకు కోపం, దుఃఖం ముంచుకొచ్చాయి

''మీకు ఆపేషెంటే ముఖ్యం పెళ్ళాం ఎలాపోయినా పరవాలేదు మీకు'' అన్నాను గాద్గదికంగా

''నో! యూ ఆర్ మై డియరెస్టు పేషంట్!'' అన్నారాయన పోనీ అలా అంటున్నప్పుడైనా నన్ను తమ బాహువుల్లో బంధిస్తారని నా తనువు తహతహలాడింది బాగ్‌లో చకచకా కావలసిన పరికరాలూ మందులూ సర్దుకుని చరాచరా బయటికి వెళ్ళిపోయారు.

నేను తలనొప్పి అని బాధపడటం, మధ్య మధ్య అరవటం, కేకలెయ్యటం ఏడవటం—ఇవన్నీ పరీక్షించి బ్లడ్‌ప్రషర్ అని తేల్చారు. బాధ తక్కువగా ఉండి నిద్రపట్టకపోతే ''పోర్‌స్టాల్'' మరీ బాధగా ఉండి గిలగిల్లాడుతూంటే ''ఈక్విట్రామ్'' ఇస్తూండేవారు ఏదో విధంగా నిద్రపట్టటం ముఖ్యం కాబట్టి ఆయన ప్రణయ రహితంగా ఇచ్చినా ప్రేమ భరితంగా ఇస్తున్నారని మనస్సుకి నచ్చచెప్పుకుని మందులు పుచ్చుకుంటూండేదాన్ని.

వయస్సు ముదురుతున్నకొద్దీ వ్యాధులు కూడా ముదురుతాయి కొత్త కొత్త వ్యాధులు సంక్రమిస్తాయి నాకేదైనా కొత్త కొత్త కంప్లెయింట్ వస్తేచాలు—అరటిపెట్టుకి కొత్తపిలక వేస్తే సంబరపడినట్లుగా ఆయన నూతనోత్సాహంతో నన్ను ట్రీట్ చేసేవారు నామీద మరింత జాలిపడిమరింత ఆప్యాయంగా బజారులో కొచ్చిన సరికొత్తమందుల్నీ ఎంతో ఖరీదైనమందుల్నీ నాకోసం వాడేవారు

నాకు మందులు మింగటం అంటే డోకు అనీ, చిన్నప్పుడు మా అమ్మనీ నాన్నగారినీ మోసగించి మందులు తాగకుండా మెల్లిగా తూములో పారబోసే దాన్ననీ పెళ్ళయిన కొత్తలో ఓసారి నవ్వుతూ సరదాగా చెప్పాను ఆయనతో. ఆ విషయం గుర్తుపెట్టుకుని ఆయన స్వయంగా మాత్ర నా నోటిలో పెట్టి మంచినీళ్ళ గ్లాసు నోటికి అందించి గుటక వేసేదాకా నాకేసి జాగ్రత్తగా పరీక్షగా చూస్తారు. నాచేత మందులు మింగించటం ఆయనకి వినోదక్రీడలా ఉంటుంది. నేను ఎంత గోలచేసినా వినుకోర్దు. పైగా నేను మారాం చేసినకొద్దీ ఆయనకి ప్రేమ ఎక్కువవుతుంది నామీద నాచేత మందులు మింగిస్తే ఆయన విజయం సాధించినట్లు

ఆనందిస్తారు.

ఈమధ్య ఆయన ఒక కొత్తపాట మొదలుపెట్టారు. నేను తలనొప్పి అని మూలిగినా, చిరాకుపడి ఆయనమీద విసుక్కున్నా, అరిచినా, ఏడ్చినా, "నాకు తెలుసు, ఇవన్నీ ఆ మెనోపాజ్ లక్షణాలే!" అంటున్నారు. నేను అనుక్షణం ఆయన ప్రత్యేక పర్యవేక్షణలో ఉన్నా నిప్పుడు.

* * *

ఆవిడ చెప్పిందంతా విన్నతరవాత డాక్టరుగారంటే నాకున్న గౌరవం మరింత ఇనుమడించింది. ఆవిడకి పిల్లలుంటే అంత ఒంటరితనం అనుభవించి ఉండేది కాదు. మంచి డాక్టర్లు ఎవరైనాసరే రోగుల మీద శ్రద్ధ చూపిస్తారు ఇంటిని అశ్రద్ధ చెయ్యవలసి వచ్చినాసరే. కానీ డాక్టర్లని చూస్తే పితృభావం కలుగుతుంది నాకు. పెళ్ళిచేసుకోవాలంటే డాక్టరువైపు మనస్సు మొగ్గటంలేదు. మొదటినుంచీ దాదాపు మా నాన్నగారి వయస్సులో ఉన్న డాక్టర్లతో పరిచయం ఉండటం వల్లకావచ్చు ఏమైనా డాక్టర్ని డాక్టరు స్థానంలోనే ఉంచటం ఉభయత్రా శ్రేయస్కరం. కానీ, అందరూ నాకు మల్లే ఆలోచిస్తే ఆ డాక్టర్లకి పెళ్ళిళ్ళవద్దూ! సర్లే, వాళ్ళబాధేదోవాళ్ళు పడతారు. మధ్య నాకెందుకు అనుకుని ముందుకి సాగాను నా పథకం ప్రకారం.

ఆ రోజు ఆట్టేదూరం వెళ్ళదలుచుకోలేదు. మా ఇంటి వెనకనే ఒక కవిగారి కుటుంబం ఉంది. నిజానికి కవిని చేసుకోవాలనే ప్రత్యేకమయిన అభిలాష నాకేం లేదు. ఆ కవిగారి ఉద్యోగం కేవలం కవిత్వం రాయటం మాత్రమేకాదు, వేరే ఏదో ఉద్యోగం చేస్తున్నాడు. ఆయన భార్య అప్పుడప్పుడు మా ఇంటికి పేరంటానికీ చిన్నచిన్న అప్పులికీ వస్తూవుంటుంది. వచ్చినప్పుడల్లా కాస్సేపు కూర్చుని మావదినతోనూ నాతోనూ కబుర్లు చెప్పి వెడుతూ ఉంటుంది. ఆ చనువుకొద్దీ ఆవిడ సంసారం ఎలాసాగుతోందో చూద్దామన్న కుతూహలంతో మాత్రమే వెళ్ళాలనుకున్నాను. ఒకవేళ నచ్చితే కవిని చేసుకోవటానికికూడా నాకు అభ్యంతరం లేదు.

వాళ్ళింటికి వెళ్ళగానే ఆవిడ జంతికలు ప్లేట్లోపెట్టి ఇచ్చింది. "చాలా బాగా చేశారండీ" అన్నాను కరకరలాడుతూ వాముఘాటుతో ఉన్న జంతికలు తింటూ.

"ఈపిండివంట ఒక్కటే వచ్చునమ్మా నాకు! ఆయనకి జంతికలు పటుకూ పటుకూ నములుతూ పద్యాలు రాయటం అలవాటు. సిగరెట్లకన్న ఇవేనయం లెమ్మని ఎప్పుడూ చేసి ఉంచుతూ ఉంటాను" అంది

"ఏమండీ రాజేశ్వరిగారూ, కవిని పెళ్ళి చేసుకుంటే కాపురం ఆనందదాయకంగా ఉంటుందంటారా?" అని అడిగాను యధాలాపంగా అడిగినట్లు. నే వెళ్ళినపని ఏమిటో వివరంగా ఆవిడతో చెప్పలేదు నా ప్రశ్న వినగానే ఆవిడకళ్లు మిలమిల మెరిశాయి. ఆవిడ ఆనందాతిశయంలో ఉండటంవల్ల అలా మెరిశాయో, లేక తన గుండెల్లో గూడుకట్టుకున్న బాధ వినటానికి ఇన్నాళ్ళకో సహృదయం కనిపించిందన్న ఉత్సాహంవల్ల మెరిశాయో తెలియలేదు నాకు. అయినా నాకుమాత్రం తృప్తి కలిగింది ఆవిడ మనస్సు విప్పి అన్నీ నాతో చెప్పేస్థితిలో ఉన్నందుకు. నేను మరోప్రశ్న వెయ్యకుండానే ఆవిడ అందుకుంది.

కవికదా అని కాదు నేను ఆయన్ని చేసుకున్నది. అసలు ఆయన చేసే ఉద్యోగం వేరు. ఎలెక్ట్రిసిటీ డిపార్టుమెంటులో స్టోర్స్ సూపర్ వైజరు. కథా రచయితగానూ కవిగానూ ఆయనకి పెళ్ళి నాటికే కాస్త పేరుంది. భుక్తికోసం ఉద్యోగం ఎలెక్ట్రిసిటీ డిపార్ట్ మెంటులో చేస్తున్నారన్న మాటేగాని ఆయన మనస్సంతా కథలమీదా కవిత్వంమీదా ఉంటుంది. ఆయన కోసం ఇంటికొచ్చే స్నేహితులు కూడా అందరూ సాహిత్యకారులే. అంచేత కవిగారి భార్యగానే చలామణీ అవుతున్నాన్నేను.

పెళ్ళయిన క్రొత్తలో కథలే ఎక్కువగా రాస్తూ ఉండేవారాయన. మరీ ఉద్రేకం పట్టలేనప్పుడు తప్ప కవిత్వం రాసేవారు కాదు. ఒక విధంగా కవిత్వం రాయమనీ కథలు రాయటం తగ్గించమనీ ప్రోత్సహించినది నేనే. కవిత్వంమీద మోజు కొద్దీ కాదుస్మండీ.

ఆయన రాసే కథల్ని ఎరగని వాళ్లు మెచ్చుకునేవారు. ఆయన్ని ఎరుగున్న వాళ్ళు మాత్రం కథలు చదివాక ఎడమొహం పెడమొహం పెట్టడం ప్రారంభించేవాళ్ళు. అవును మరి, పరిచయమైన ప్రతివాళ్ళమీదా ఓ కథరాసి పారేస్తూంటే వాళ్ళని నడివీధిలోకి ఈడ్చినట్లుగా బాధపడరూ! బాధపడి మాతో స్నేహాన్ని తగ్గించేసేవారు. పోనీ ఏదో హాస్యంగా రాస్తే వాళ్ళూనవ్వి ఊరుకుంటారు. కానీ ఈయన వాళ్లని దుయ్యపడుతున్నట్లుగా సంఘ పంస్కర్తలా రాసేవారు.

ఇంటి కెవరైనా నా స్నేహితురాలుగానీ పక్కింటావిడ గానీ రావటం తడువు ఈయన పదిసార్లు ఏదో వంకపెట్టుకుని మేము కూర్చున్నవైపుకి రావటం, మా సంభాషణలు చెవులు నిక్కబొడుచుకుని వినటం చేసేవారు. పోనీ, విని ఊరుకుంటారా అంటే-మర్నాడు ఆ సంభాషణలు ఆయన కథల్లోకి చొరబడేవి. ఆయన కథలు చాలా వాస్తవికంగా ఉంటాయని ఎరగనివాళ్ళు మెచ్చుకునేవారు. ఎరుగున్న వాళ్ళ ముందు నేను మాత్రం తలెత్తుకుని తిరగలేక పోయేదాన్ని.

"పేరు ప్రఖ్యాతుల మాట దేముడెరుగు. మీరు కథలు రాశారంటే ఊరుకునేది లేదు—కావాలంటే కవిత్వం రాసుకోండి" అన్నాను.

ఒకసారి ఈ విషయంమీదే మేం ధడామడా వాదించుకున్నాం. చివరికి ఆయనకి కోపంవచ్చి తలుపు ధడాలున వేసి ఇంట్లోంచి వెళ్ళిపోయారు రాత్రి తొమ్మిదిదాటినా కొంపకి రాకపోయేసరికి భయంవేసింది.

"పాపిష్టిదాన్ని, అనవసరంగా ఆయన్ని ఆడిపోసుకున్నాను. కథలు రాయటం అంటే మాటలా! పక్కింటి వాళ్ళమీద అయితే మాత్రం ఆయన రాసినట్లుగా వెయ్యి జన్మలెత్తినా నేను రాయగలనా? ఇంకెప్పుడూ ఆయనని పల్లెత్తు మాటనను, భగవంతుడా, ఆయనకి కోపం తెప్పించను. ఆయన త్వరగా ఇంటికొచ్చేటట్లు చెయ్యి" అని ప్రార్థించాను.

ఆయన పది అవుతూంటే వచ్చారు ఇంటికి. వస్తూనే తలవంచుకుని సూటిగా

బల్ల దగ్గర వెళ్ళి కుర్చీల కూర్చుని చక చకా రాయటం మొదలుపెట్టారు. అర గంటదాకా ఆయన్ని పలకరించటానికి జంకాను. ఆయన స్పీడు తగ్గిం తరవాత కొంచెం ధైర్యంచేసి "అన్నం వడ్డించాను రండి" అన్నాను

"ఇలారాముందు" అన్నారు. ప్రేమంగానే పిలిచినా బిక్కుబిక్కుమంటూ సమీపించాను. ఆయన రాసిన పద్యాలు చూపించారు. చదివాక సిగ్గుతో ముసిముసినవ్వులు నవ్వాను. నామీద అపరిమితమైన అనురాగాన్ని వెల్లడిస్తూ రాశారు.




"నామీద కోపం పోయిందా?" అన్నాను మురిపెంగా.

"నీమీద నాకు కోపం ఏమిటే!
నీవే నా జీవన జ్యోతివి
నా వనమెల్ల చెరిచి పోతివి"
అంటూ నా చెవి మెలిపెట్టారు.

అప్పటి నుంచి ఆయన కథలు రాయటం తగ్గించి కవిత్వం రాయటం హెచ్చించారు కాగితాల ఖర్చు తగ్గింది. స్నేహితులతో గొడవలు తగ్గాయి అని సంబరపడ్డాను.

ఓసారి నెలాఖరు రోజున ఎవరో స్నేహితులింటికి వాళ్ళపిల్ల పుట్టినరోజు పండక్కి వెళ్ళాల్సి వచ్చింది. చేతిలో డబ్బులేదు - ఏదైనా బహుమతి కొని తీసుకువెళ్ళటానికి మర్నాడు జీతం వస్తుంది కదా అని ఎలాగో నెట్టుకొస్తూంటే ఆ పార్టీ ఒక టొచ్చి పడింది.

ఉత్తచేతుల్తో వెళ్ళటం ఎలాగని నేను బాధపడుతూంటే ఆయన నిశ్చింతగా పద్యాలు రాస్తూ కూర్చున్నారు. నాకు మండుకొచ్చింది. "నేను రాను. మీరు వెళ్ళిరండి కావాలంటే" అన్నాను.

"పిచ్చిదానా. బహుమతి కొనటానికి

దబ్బుల్లేవనేగా నీబెంగ! అంతకన్న అమూల్యమైన కానుక సిద్ధంచేశాను చూడు!'' అంటూ ఆయన రాసిన పద్యాలు చూపించారు. చదివాను. ఆ స్నేహితుడి కూతుర్ని ఆశీర్వదిస్తూ రాసినపద్యాలవి. ఆ పిల్లకి మూడో ఏడొచ్చింది.

''ముచ్చటగా మూడు'' అని మూడు పద్యాలు రాశారు - ముత్యాల్లాంటి మాట లతో. నేను కృతజ్ఞతా పూర్వకంగా చూశాను ఆయనకేసి.

పార్టీలో ఆ పిల్లకి వచ్చిన బహుమతు లన్నిటిలోకీ మావారు ఇచ్చినదే అందర్నీ ఆకర్షించింది. హర్షధ్వానాలు చేశారు పద్యాలు విని.

అప్పటినుంచీ ఈ పద్ధతే బాగుందను కున్నారు ఆయన - నయాపైసా ఖర్చు లేకుండా నాణ్యమయిన బహుమతి ఇవ్వటం!

''ముచ్చటగా మూడు'' తరవాత ''పంచవర్ణాలు'', ''సప్తస్వరాలు'', ''నవ రత్నాలు'' అంటూ పద్యాలు క్రమంగా సంఖ్య హెచ్చించుకుంటూపోయి వాటిని పెళ్ళిళ్లలోకూడా గొప్పగా బహూకరిం చటం ప్రారంభించారు.

కొత్తలో ఒకటి రెండుసార్లు శభాష్ అనిపించుకున్నారు. కవిగారి భార్యనని నాకూ సన్మానం జరిగింది. గానీ, ప్రశం సలతోబాటు ఆయన పద్యాల సంఖ్య కూడా పెరిగిపోతున్న కొద్దీ ఆయన్ని పెళ్ళిపందిట్లో చూడగానే జనం జంకటం మొదలుపెట్టారు.

''నూరువరహాలు'' అంటూ ఓపెళ్లిలో ఆశీర్వచన గానం లంకించుకునే సరికి ఆయన్ని ఎలా ఆపాలో ఎవరికీ అర్థం కాలేదు. భజంత్రీలవి ఆపండి ఆపండి అని అరిచినట్లుగా పురోహితుడు ఈయన కేసి చూసి, ''అయ్యా, బాబుగారూ, వివాహ కార్యక్రమం ఇంకా పూర్తికాలేదు—అవ తల పెళ్లివారికి భోజనాలకి వేళయిపోయింది తమరు ఆ కాగితాలేవో వధూవరులికి అందించేస్తే వారే చదువుకుంటారు. ఆనక'' అన్నాడు పిలక ముడించి ముడి వేసుకుంటూ. చుట్టుపక్కలవాళ్లంతా గొల్లు మని నవ్వారు. నా తల కొట్టేసినట్లయింది.

ఇంటికొచ్చిన తరవాత నేను చాలాసేపు ఆయనతో మాట్లాడలేదు. ఆయనకూడా మౌనంగా పడుకున్నారు. ఇక నేనే ఉండబట్టలేకపోయాను.

''పోనీ, ఆ ఇచ్చేదేదో నాలుగు అక్షిం తలు వాళ్లనెత్తిన పడేసి ఆ కాయితాలు వాళ్ల చేతుల్లో పెట్టేసివస్తేపోలే! ఎందుకా కంఠశోష! నలుగురిలోనూ నవ్వులపాలు కావటానికి కాకపోతే! అయినా, సరదాగా ఏదో నాలుగైదు పద్యాలు రాస్తే ముచ్చటగా ఉంటుంది గాని వానాకాలం వరదలాగ వందలకొద్దీ పద్యాలురాసి చదివితే వినేటపిక ఉండొద్దా! అందులోనూ అటువంటి గందర గోళంలో!'' అంటూ ఉపదేశించాను ఆయనకి జ్ఞానోదయం అవాలని.

''నా కంఠ మాధుర్యాన్ని ఆనం దించలేకపోతే అది వాళ్ళ కర్మ! గాడిద కేం తెలుసు గంధం వాసన అన్నట్లు నా కవితాగాన మాధుర్యం నీకేం అర్థమ తుందిలే!'' అన్నారు.

''అవును లెండి! నాకు మీ కవితాగాన

తలకి నీళ్ళోసుగునీ - కుర్లార బోసుగునీ
నిల్చుంటవే.. అహా నువ్ నిల్చుంటవే




ాధుర్యం అర్థంకాదు! ఈసారి వంద
ాదు, వెయ్యి మాటపదహార్లు పాడి విని
ంచండి-ఎవరిని గాడిదంటారో తెలు
స్తుంది!'' అన్నాను ఉక్రోషంతో.

*　　*　　*

ఇంటికి వస్తూనే ''వదినా, వదినా''
ంటూ అరిచాను. ఏమిటోనని కంగారు
డుతూ వచ్చింది.

''నువ్వెప్పుడైనా మన వెనకింటి కవి
రి పద్యాలు విన్నావా?'' అన్నాను నవ్వు
ఖంతో.

''ఏం, బాబోయ్! ఇప్పుడాయన మనింటి
స్తున్నాడా?'' అంది వదిన అమా
కంగా,

నేను పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వాను
''ఏమిటే, ఆడపిల్లవి కాదూ! ఆ విరగ
నవ్వటమేమిటి?'' అని అమ్మ వచ్చి
ప్లేసేవరకూ నవ్వాగలేదు.

ఆ మర్నాడు మధ్యాహ్నం వీధిలోకి
ోతూంటే, ''మళ్ళీ వరాన్వేషణ
కేనా!'' అంది వదిన. ''ఊఁ'' అంటూ
చెప్పులేసుకుంటున్నాను.

''నాకేమీ తోచటంలేదు ఇట్లో
కూర్చుందూ ఇవ్వాళటికి'' అంది.

''నీకేమమ్మా వదినా పెళ్ళిచేసుకుని
చిలకలా కులుకుతూ కూర్చున్నావ్! నా
తంటాలేవో నేను పడి ఓ ఇంటిదాన్ని
కావద్దూ! నీతో బాటు కూచుంటే ఎలా
కుదురుతుంది! వస్తా. టా, టా'' అంటూ
నవ్వుతూనే వదినని వదిలించుకున్నాను

ఆ రోజున అనుకున్న ప్రకారం
కామేశ్వరరావుగారింటికి వెళ్ళాను. ఆయన
కస్టమ్స్ ఆఫీసరు. పాలంలో పని. నిజా
ముద్దీన్‌లో ఉంటున్నారు వాళ్ళు ఆయన
భార్య చాలా అందంగా ఉంటుంది. అందా
నికి తగ్గట్టు చక్కగా ముస్తాబు చేసుకుం
టుంది. ఆవిడ చెల్లెలు నా క్లాస్‌మేట్
ఎప్పుడూ ''మా కస్టమ్స్ బావ ఇవి తెచ్చాడు,
మా కస్టమ్స్‌బావ అవి తెచ్చాడు'' అంటూ
గొప్పగా చెబుతూ ఉంటుంది. బావను

చూసి మరదలే అంత మురిసిపోతూంటే భార్య ఇంకెంత బడాయిలు చెప్పుకుం టుందోననీ, ఆవిడ ఎంత ఆనందంగా ఉందో విందామనీ కుతూహలం కలిగింది. వాళ్లింటికి రమ్మని ఎన్నోసార్లు పిలిచింది నా క్లాస్‌మేట్. తను వాళ్ళక్కయ్య దగ్గరే ఉండి చదువుకుంటోంది. సరేకదా, ఇహం పరం రెండూ కలిసొస్తాయన్నట్లు, తన కోరిక చెల్లించినట్లూ అవుతుంది. వాళ్ళ క్కయ్యని వివరాలడగటానికి నాకు అవ కాశమూ వస్తుందని బయలుదేరాను.

నేను వెళ్ళేసరికి మా క్లాస్‌మేట్ ఇంట్లో లేదు షాపింగుకి వెళ్ళిందిట ఒకవిధంగా సంతోషించాను లోలోపల పైకి బాధ పడుతున్నట్లు నటించి, వాళ్లక్కయ్యతో కబుర్లు చెప్పటం ప్రారంభించాను. కబుర్ల మధ్య అమాయకంగా అడిగాను. "ఏ మండీ, అక్కయ్యగారూ, కస్టమ్స్ ఆఫీసరు జీవితం ఎలా ఉంటుందండీ? మోస్ట్ ఎక్సైటింగ్‌గా ఉంటుందనుకుంటాను, అవునా?" అని.

"ఆ, మొగవాళ్ళకి ఎక్సైటింగ్‌గానే ఉండొచ్చు" అంది.

"అంటే, మీ మాటేమిటి? మీ కెలా ఉంటోంది. ఆయన్ని పెళ్ళి చేసుకోవటం వల్ల? నాకూ ఈమధ్య ఇలాంటి సంబం ధమే వచ్చిందిలెండి అందుకని అడుగు తున్నాను" అని చిన్న అబద్ధమాడాను అసలు సంగతి రాబట్టాలని

ఆవిడ అర్ధనిమీలిత నేత్రాలతో శూన్యం లోకి చూస్తూ చెప్పటం మొదలుపెట్టింది.

## కస్టమ్స్ ఆఫీసరుగారి భార్య

అసలు మనవైపు చాలామందికి కస్టమ్స్ ఆఫీషియల్ అంటే వివరంగా ఎవరికీ తెలియదు.

"మీ ఆయన కష్టాలాఫీసరుటకదే! ఏం కష్టాలు తీరుస్తాడే అమ్మాయ్" అంది మా బామ్మగుండు మీద కొంగు సరిచేసు కుంటూ.

"కష్టాలుకాదు బామ్మా, "కస్టమ్స్"— అది ఇంగ్లీషుమాట" అన్నాను

"అదేమిటే! ఇంగ్లీషువాళ్ళకికూడా కష్టాలుంటాయా'టే!" అని ఆశ్చర్య పోయింది.

"అబ్బబ్బ! అదికాదు బామ "కస్టమ్స్" అంటే అర్థం దిగుమతి ఎ.. మతి వస్తువులమీద వేసే పన్నులు అన్న మాట. విదేశాలనుంచి ఏవైనా వస్తువులు తీసుకొస్తూంటారుకదా జనం. నియమిం చిన దానికన్నా ఏమాత్రం ఎక్కువ తీసు కొచ్చినా అదినేరం కాబట్టి ఆ తీసుకొచ్చిన వస్తువులమీద పన్నువిధించటమో, ఒక్కొ క్కప్పుడు ఆ తెచ్చిన వస్తువుల్ని స్వాధీనం చేసుకోవటమో చేస్తుంది మన ప్రభుత్వం. అలాంటి వస్తువుల్ని తణిఖీ చెయ్యటమే మా ఆయన పని" అని ఆవిడకి అర్థమయేట్లుగా వివరించి చెప్పాను.

"ఇదేదో కొత్త ఉద్యోగంలా ఉందేవు అమ్మాయి! మా కాలంలో ఇట్టాంటి ఉద్యో గాలు ఉండేవి కావుస్మీ! ఏదో కరణీకం, తాసిల్దారూ, మాస్టరు గిరీ, ప్లీడరూ,డాక్టరూ, ఇలా చెప్పకోవటమేగాని ఈ కష్టాలా ఫీసరు గురించి ఎప్పుడూ వినలేదే అమ్మాయి" అంది.

ఇంకా ఏం ప్రశ్న లేస్తుందోనని

అక్కణ్ణించి చల్లగా పక్కకి తప్పు కున్నాను.

కాపరానికి వెళ్ళేదాకా నాకూ తెలియదు అన్ని వివరాలూ. పెళ్ళయిన కొత్తల్లో ఎన్నో ఇంపోర్టెడ్ చీరలూ, సెంట్లూ, పౌండర్లూ, లిప్‌స్టిక్‌లూ - రకరకాల వస్తువులు తెచ్చిపెడుతూండేవారు ఆ జపాన్ నైలాన్ చీరలూ, క్రిస్టీన్‌డయోర్ సెంట్లూ, మాక్సఫాక్టర్ మేకప్‌సామానూ అవీ చూసి మూర్ఛపోయాను ఆనందంతో.

కాశీమజిలీ కథల్లో రాజకుమారుడి కథల్లాగ. నేనూ ఆ రాజకుమారుడితో కలిసి మాయ తివాసీమీద కూర్చుని ఆకాశవీధిలో విహ రిస్తున్నట్లు ఆనందించాను.

నెలరోజులు దాటే సరికి దభీమని ఒక్కసారిగా ఈభూమి మీదికి వచ్చిపడ్డట్లు భావన కలిగింది.

ఆయనకి నైట్‌షిఫ్ట్ ఆరంభమయింది. అంతవరకూ స్పెషల్‌గా పగలు డ్యూటీ వేయించుకున్నారుట. ఇకముందు వంతుల



"ఇవన్నీ ఎంతకి కొన్నారండీ?" అని అడిగాను. నామీద ఆయన చూపిస్తున్న ప్రేమకి అదిరిపోతూ.

"కొనలేదు. కస్టమ్స్‌లో కొట్టేసినవి!" అన్నారు విజయగర్వంతో. కస్టమ్స్‌వాళ్లు ప్రయాణీకుల్ని పన్నులపేరుతో బెదర కొట్టేసి వాళ్ళుతెచ్చుకున్న విదేశీసరుకులు ఎలా కొట్టేస్తూంటారో కథల్లా చెప్పారు

వారీగా రాత్రి డ్యూటీ చెయ్యాలని చెప్పే సరికి నాగుండె గుభేలుమంది. రాత్రంతా ఒక్కర్తెనీ ఉండటం ఎలాగని బెంగ పట్టుకుంది. ఆ బెంగ కన్న బాధకలిగించిన విషయం ఏమిటంటే ఆ నైట్ డ్యూటీ చేసొచ్చిన మర్నాడు రోజంతా కుంభకర్ణు డిలా నిద్రపోయేవారు. మొక్కుబడిగా తినటం, మళ్లీ పడుకోవటం. నాకు పిచ్చెత్తి

పోయేది. రాత్రి ఒక్క రైనే పడుకోవటమే కాక, పగలు ఈ చిత్రహింసః కదిపితే చాలు కస్సుమనే వారు. పగలు డ్యూటీ వచ్చేవరకూ ప్రాణం గిజగిజలాడిపోయేది నాకు.

మధ్యమధ్య రెండేళ్లకోసారి ఎప్పుడో అమెరికా, ఇంగ్లండూ, ఫ్రాన్సూ, జర్మనీ అవీ వెళ్లి చూసివస్తూండేవారు. ఆయనతో నేనూ వెళ్లాలంటే మొదట్లో చూలింత, బాలింత — ఈ గొడవలలో సరిపోయింది. పిల్లలిప్పుడు కాస్త ఎదిగారు - అనుకుంటే ఆయన నన్ను తనతో తీసుకువెళ్లటానికి సవాలక్ష అడ్డంకులు చెప్పుతారు!

"అక్కడ చలి నువ్వు భరించలేవు. ఇక్కడ చలికే పాదాలు వాచిపోయాయో అంటూ గోలపెడుతూంటావ్! అదీకాక, అక్కడకొచ్చి బంగాళదుంపల వేపుడు కావాలి, ముక్కలపులుసు కావాలి అనుకుంటే దొరకవు నువ్వు కోడిగుడ్డు తింటావా, చికెన్ తింటావా, చేపలు తింటావా, ఆవుమాంసం తింటావా, పందిమాంసం తింటావా! తీసి కెళ్లిన మర్నాటి నుంచీ "ఏమండీ, ఇంటికెళ్ళిపోదాం" అంటూ నా ప్రాణాలు తీస్తావు" అంటారు.

పోనీ, ఆయన తెచ్చే జపాను నైలెక్సు, వూలీ నైలాన్ చీరలూ, ఫ్రెంచి అత్తర్లూ చూసి మురిసిపోదామా అనుకుంటే ఇప్పుడు "మీసా" ఒకటొచ్చి పడింది నా ప్రాణానికి.

"వెధవ నైలాన్ చీరలూ, సీకో వాచీలూ పేపురికార్డర్లూ లేకపోతే మానె, కష్కార్తి మాత్రం పడకండి, జైల్లో కూడా వేస్తారేమో కర్మ!" అని నేనే ఆయనకి ఉపదేశిస్తున్నాను. ఇంతకు ముందు ఆయన "కాష్టేపి" తెచ్చిన చీరలు కట్టుకోవటానిక్కూడా హడలిచస్తున్నానిప్పుడు.

అయితే, ఒక బాధ తప్పింది. మ వైపుకి వెళ్లినప్పుడు చుట్టాలందరు "మీ ఆయనతో చెప్పి ఓ మిక్స తెప్పించిపెట్టమనీ, ఓ వాచీ తెప్పించి పెట్ట మనీ, మెల్‌మేక్ కప్పులు తెప్పించి పెట్ట మనీ అడగటం మానేశారిప్పుడు. మాట్లాడితే "మీసా" అంటున్నాను!

* * *

ఆ భ్రమకూడా తొలిగిపోయింది నాకు ఆవిడ కథ విన్న తరవాత. "నా కన్నంలో వేలుపెడితే నేను కుట్టనా!" అందిట చీమ. ఆ కష్టమ్స్‌వాణ్ణి పెళ్ళిచేసుకోవట మెందుకు! ఆ కష్టాలన్నీ కొనితెచ్చుకోవట మెందుకు! నా లిస్టులోంచి అతన్ని కొట్టిపారేశాను అప్పటికప్పుడు. కొంత బరువు తీరినట్లయింది

బస్సులో తిరిగి వస్తూంటే వాల్‌పోస్టర్ ఎడ్వర్‌టైజ్‌మెంట్ కనిపించింది ఒక చోట. ఆయిఫాక్స్‌లో చంద్రమోహన్ చిత్రాలు వన్‌మాన్ ఎగ్జిబిషన్ ఉందిట. అతను ఎగ్జిబిషన్‌లో బిజీగా ఉండి ఉంటాడు. అతని భార్య ఇంట్లోనే ఉండి ఉంటుంది. బస్సులోంచి మధ్యలో దిగిపోయి బెంగాలీ మార్కెట్ వైపు నడిచి వెళ్లాను చంద్రమోహన్ మా వదిన వైపు చుట్టం. అప్పుడప్పుడు వదినతో కలిసి వాళ్లింటికివెళ్లాను ఆ ధైర్యంతోఒక్కరైనీ వెళ్లివాళ్ల తలుపు తట్టాను. నా అదృష్టం

కొద్దీ ఆవిడ ఇంట్లోనే ఉంది ఇలాంటి సుందరి భార్యగా లభించటంవల్లనే అతను ఆర్టిస్టు అయాడేమో ననిపించింది ఆవిణ్ణి చూడగానే. కళ్లు చెదిరే అందంకాదావిడది. కలువపువ్వులా ఉంటుంది నన్ను ఆద రంగా లోపలికి ఆహ్వానించింది.

వాళ్ళ ఇల్లు సింపుల్‌గా ఉన్నా ఎంతో కళాత్మకంగా ఉంది. ఉన్న వస్తువులన్నీ ఆర్టిస్టిక్‌గా ఉన్నాయి. యాష్‌ట్రే దగ్గర నుంచి ప్రతివస్తువూ విశిష్టంగా ఉంది. మానస సరోవరంలో ప్రవేశించినట్లుగా ఉంది మనస్సుకి హాయిగా. లైట్‌గా టీ తయారుచేసి ఇచ్చింది, మొహమాటపడు తూనే తీసుకున్నాను.

"మీవారి చిత్రప్రదర్శనకి మీరు వెళ్ల లేదే!"అన్నాను సంభాషణకి ఉపక్రమిస్తూ.

''మొదటి రోజున వెళ్లాను ఆయనతో కలిసి ఇవ్వాళ మూడో రోజు రోజూ ఎందుకూ ఆ వచ్చేపోయే వాళ్లమధ్య!'' అంది.

నా మనస్సులో మాట ఎలా బయట పెట్టాలో తెలియలేదు. ఆవిడ దగ్గర అంత చనువులేదు నాకు, మొండిగా వచ్చాను గాని ఎలా మొదలుపెట్టాలో అర్థంకాలేదు.

ఆవిడే ఏం తోచక అడిగింది, "చదు వయాక ఏం చేస్తావ్?'' అని.

మునిగిపోయేవాడికి పడవ దొరికినట్ల యింది నాకు. సిగ్గుపడుతూ చెప్పాను "మావాళ్లు పెళ్ళి చేసెయ్యాలని శతవిధాల ప్రయత్నిస్తున్నారు. నాకు రిసెర్చి చెయ్యా లని ఉంది.'' అన్నాను.

"సంబంధాలు చూస్తున్నారా? ఏమన్నా కుదిరిందా?'' అంది.

"లేదండీ. మానాన్నగారు తెచ్చిన సంబంధం ఒక్కటీ నాకు నచ్చలేదు. నేనే వెతుక్కుంటున్నాను ఇప్పుడు'' అన్నాను చిరునవ్వు నవ్వుతూ.

నేను జోకు వేశాననుకుని ఆవిడ పక పకా నవ్వింది. నిజంగా వెతుక్కుంటున్నా నని చెప్పినా నమ్మేట్లు లేదావిడ. అసలు విషయానికి ఎలా రాను?

ఆలోచిస్తున్నాను. ఆవిడ కూడా మౌనంగా కూర్చుంది ఆలోచిస్తున్నట్లు.

"మా వాళ్ల కుర్రా డొక డున్నాడు. చూస్తావా?'' అంది ఉన్నట్టుండి.

"అతనూ మీ వారిలాగ చిత్రకారు డేనా?'' అన్నాను.

"అబ్బెబ్బే! కాదు. అతనిది విశేషం లాంటి బ్యాంక్ ఉద్యోగం!" అంది.

"అదేమిటండీ, ఆర్టిస్టు కేం లోటు! అందులోనూ మీలాంటి జోడీ దొరికిం దంటే!'' అన్నాను.

"అయ్యో, నీకింకా తెలియదల్లే ఉంది! ఆర్టిస్ట్ వేసే చిత్రాల్లా అందంగా ఉంటుం దనుకున్నావా అతని జీవితంకూడా? ఆర్టిస్ట్ మాట ఎలా ఉన్నా ఆర్టిస్టు భార్యకావటం మాత్రం అంత అదృష్టకరం ఏమీకాదు'' అంది.

"మీరు మరీ అన్యాయంగా మాట్లాడు తున్నారండీ'' అన్నాను ఆవిణ్ణి ఆ విధంగా రెచ్చగొడితే అసలు కథ బయటికొస్తుంది కదా అని, అనుకున్నంతా అయింది! ఇక నేను ఆపుదామన్నా ఆగేట్టులేదావిడ. ఆరం భించింది ఆవిడ అనుభవాలు చెప్పటం

[ఆర్టిస్టుగారి భార్య అనుభవాలు, మరి కొన్ని - వచ్చే సంచికలో]

# మధు మాసం

## (To Whomso ever it May concern)

'షటప్!' అని రోజూ నీకు చెప్పడం లేదూ?
రోజూ కాస్సేపు నీ స్వరం విననట్లే నటిస్తాను
నా కోసం కాదేమోనని పరాకు వహిస్తాను,
పోనీ, ఎక్కడున్నావోనని వెతకి పట్టుకొని
గట్టిగా నోరు మూసేద్దామంటే, ఆకారమే గుర్తుండదు,
కంటికి కనుపించవు, ఎటెటో ఎగిరిపోతుంటావు!

కాస్సేపు నిశ్శబ్దం— మరి వూరుకున్నావులే అనుకుంటే,
మళ్ళీ సన్నగా, వేణువు క్రింది పెదవిపై నొక్కిపట్టి
మంద్ర స్థాయిలో మొదలుపెడతావు!
ఏదో రొదలే, నా కెందుకు లెమ్మనుకుంటే
గొంతెత్తి, మధు మాధుర్యా లొలికిస్తావు!
అంత తీపి నా కిష్టంలేదనీ, బరువుగా
యీ కంఠాన దిగని మధురిమ నాకొద్దు పొమ్మని
చెబుదామంటే, కొసరి కొసరి విసిగిస్తావు!

'షటప్!' అంటే అర్థం కాదా? నీ పనే నీదా?
పోనీ చోటైనా మార్చి, నాకు వినిపించని దూరానికి
పారి పొమ్మంటే, వేరొక తావు లేదన్నట్లు
ఇంకే సెలవూ కుదరదన్నట్లు, నా దాపునే కాపురం పెట్టావు!

జీర లేని, శ్రుతి అటు యిటు తప్పిపోని
తేనె లెందుకు వృథాగా నా ముంగిట పారబోస్తావు?
నీ పలుకు పాతదే అయినా, నాలో వులుకు క్రొత్తది—
ఏటేటా నీ వొస్తున్నా— యీ ఏడు యిది రాక్షసం!

'షటప్! ప్లీజ్ షటప్!' నన్ను కరుణించి
దూరంగా వెళ్ళిపో! మరో ఆనందం, మరో రాక్షసం
ఈ జగంలో, యీ యుగంలో రాక మానవు!
అప్పటికిక భంగమైన గోళాల ధూళిలోనో,
నాకు ప్రియాతి ప్రియమైన వాని సన్నిధిలోనో
నే నున్నప్పుడు, నీ వెంత కవ్వించి పాడినా,
తీపిలో ముంచినా, తనివార పులకరిస్తానుగానీ—
యిప్పుడింక— యీ రోజు— యీ ఒక్క బ్రతుకు కాలం
పాట మానేయవూ? 'ప్లీజ్ షటప్!'

—జానకీరాణి

మే'నెల సంచికలో "రంగదాసు ప్రేమకథ"
ఈ నెల మినీకథ "ఎదురింటి కిటికీ"
లాంటి రచనల్ని పంపవల్సిందిగా
రచయిత[త్రు]ల్ని కోరుతున్నాం!
రచనలు ఒక అరరావు సైజు
మించకూడదు.

—ఎడిటర్,
జ్యోతి.

ప్రకాశం దగ్గర్నుంచి నిన్ననే ఉత్తరం వచ్చింది. ఈరోజు తను సాయం కాలం రైలుకు వస్తున్నట్టు. ఇక్కడే ఓ పది రోజులు ఉండటానికి కాదు ఆ వచ్చేది. 'ఈ వేళ సాయంకాలం మద్రాసుకెళ్ళే రైల్లో తను వస్తున్నట్టూ, స్టేషన్లో కలుసుకో వలసిందనీను' రాశాడు.

ప్రకాశం వస్తున్నాడంటే నాకెంతో సంతోషం కలిగింది అలా కలగడానికి రెండు కారణాలున్నాయి. వాడు నా చిన్న ప్పటి ఫ్రెండు. ఇద్దరం ఒకే కంచంలో తిని, ఒకే మంచంలో పడుకున్నవాళ్ళం. అంటే మాకిద్దరికీ కంచాలూ, మంచాలూ తక్కువయీ కాదు, కొనుక్కునే స్తోమత లేకాకాదు మా ఇద్దరి స్నేహం అంతటి దని చెప్పడానికే ఈ విషయం చెప్పాను.

వాడు రాసిన ఉత్తరం తీసి మరోసారి చదువుకున్నాను.

' ఈరోజు నీకో ముఖ్యవిషయం చెప్తాను నా జీవితంలో ఉన్న సమస్య తీరిపోయింది '

అని రాశాడు.

వాడి జీవితంలో సమస్య వున్నమాట నిజమే. సామాన్యంగా వాడి విషయాలేవీ నాకు తెలీకుండా ఉండవు అయితే వాడి జీవితంలో వున్న సమస్య ఎలా తీరి పోయిందన్నదే, నాకు అంతుబట్టనిదీ, కుతూహలం కలిగించేదీ!

ఉత్తరం వచ్చిందగ్గర్నుంచీ ఇప్పటి కెన్నిసార్లు చదివానో లెక్కలేదు ప్రకాశం వస్తున్నాడని వినగానే రెండు విధాల సంతోషం కలిగినా, మూడో విధంగా కుతూహలం, ఆత్రుతా కలిగాయి.

ఎప్పుడెప్పుడు ప్రకాశాన్ని కలవాలా అని మనసు తహతహ లాడుతూంది. ఇప్పుడింకా ఉదయం తొమ్మిది గంటలే అయింది.

ఇంతలోనే వంటింట్లోంచి శ్రీమతి పిలుపు వినిపించింది. వంటయింది భోజ నానికి రండంటూ! ఉత్తరం మడిచి జేబులో పెట్టుకుని, వంటింట్లోకి నడి చాను

"ఏమిటి! మీలో మీరే నవ్వుకుంటు న్నారు." కంచంముందు కూచుంటున్న నన్నడిగింది శ్రీమతి

"అబ్బే! ఏం లేదు. ప్రకాశం అని అప్పుడప్పుడూ చెబుతుంటాను చూడు. వాడు ఈరోజు సాయంకాలం మద్రాసు రైలుకు వస్తున్నాడట" అని చెప్పాను, అన్నం కలుపుకుంటూ.

శ్రీమతి నెయ్యి వడ్డించింది. వంకాయ కూర కలుపుకుంటున్నాను.

"మరి మీలో మీరే నవ్వుకుంటున్నా రేమిటి?" అడిగింది.

"అది నవ్వెన్ను వాడు ఒక సంగతి చెప్తానన్నాడు నాకూ తెలీదు. చిన్నప్పటి సంగతులు గుర్తుకొస్తే నవ్వొచ్చింది '

"అయితే రాత్రికి అతను మనింటికి వస్తాడన్న మాట!"

"అహ! ఇక్కడికి రాడు నన్ను స్టేషనుకు రమ్మన్నాడు. వాళ్ళ మేనమామ ఊరెళుతూ ఎలాగూ దారేకదా అని, చూసి పోడానికి రమ్మన్నాడు."

భోంచేసి ఆఫీసుకు వెళ్ళాను.

ఆఫీసులో చేయాల్సిన పని ఏమంతగా లేదు. నేనే సెక్షన్ ఆఫీసర్ని కాబట్టి,




పని చేయలేదేమని ఎవ్వడూ అడగడు కాబట్టి మనిష్టం. ఏదో పుస్తకం చేతికి తీసుకుని యథాలాపంగా చూస్తున్నాను. చేతిలో పుస్తకమున్నా మనసు ప్రకాశం దగ్గరికెళ్ళింది.

ప్రకాశం 'ఇంతప్పటి ంచీ' నాకు తెలుసు. ఆ సంగతి ముందే చెప్పాను. ఇద్దరం కలిపి చదువుకున్నవాళ్ళం. ఎటొచ్చీ మూడేళ్ళనుంచీ, మనుషులం కలవటంలేదు-ఉత్తరాల్లో తప్ప.

చిన్నప్పుడు — దుమ్ము రేపుకుంటూ బజార్లో రైలాట ఆడినవాళ్ళం. ఇద్దరం కలసే, లెక్కలు చేయకుండా, మాస్టారిచేత దెబ్బలు తిన్నవాళ్ళం ఇద్దరం నాయుడి గారి తోటకెళ్ళి, ఎవరికీ తెలీకుండా మామిడికాయలు కోసేవాళ్ళం. చెట్టుదిగి, దానికింద కూచుని, చాకుతో మామిడి కాయలుకోసి ఇంటినుంచి తెచ్చిన ఉప్పు

అద్దుకుని తినేవాళ్ళం.

అలా తింటుండగానే, ఒక రోజు నాయుడుగారమ్మాయిదమయంతి వచ్చింది. మమ్మల్నిచూసి కేకలేసింది మేం బ్రతిమాలాం-ఎవ్వరికీ చెప్పవద్దని. ఆ అమ్మాయికికూడా రెండు కాయలిచ్చాం. వాళ్ళ తోటలోవే.

దమయంతి అందంగా వుంటుంది. మా స్కూల్లోనే చదివేది. మాకంటే ఒక క్లాసు ఎక్కువ. అంతకుముందే ఆమె మాకు తెలుసు. దమయంతిని చూసిన మావాడు, ఆ అమ్మాయిమీద కన్నేశాడు. మెల్లిగా ఆమెతో స్నేహం కలిపాడు. ఆ అమ్మాయికూడా వీడితో బాగానే మాట్లాడేది.

ఇలా వుండగా ఒకరోజున మావాడు దమయంతికి ప్రేమలేఖ రాశాడు. ఖర్మకాలి, పొరపాటున అది వాళ్ళ నాన్నకంట పడింది. దాంతో అయన ప్రకాశాన్ని పిలిచి కేకలేశాడు. ఇంకెప్పుడూ - వాళ్ళమ్మాయితో మాట్లాడవద్దనీ, ఆయన కెప్పుడూ కనపడవద్దనీ.

ఆ తర్వాత ఆ అమ్మాయి వీడితో మాట్లాడటం మానేసింది. వీడు ఆమెతో మాట్లాడాలని ఎంతో ప్రయత్నించాడు. 'నా తప్పేమన్నావుంటే క్షమించు దమయంతీ' అని బ్రతిమాలాడు.

అయినా ఆ అమ్మాయి మాట్లాడలేదు దమయంతి ఎందుకలా చేస్తూందో వాడి కర్థంకాలేదు. ఎన్నోరకాలుగా ఆలోచించాడు. దమయంతిని చూడాలనీ, ఆమెతో మాట్లాడాలనీ, ఎంతగానో తపించిపోయాడు. అప్పుడే వాడు దమయంతిని నిజంగా ప్రేమించాడనుకుంటాన్నేను. తనను పెళ్ళికూడా చేసుకోవాలనుకున్నాడు.

వాళ్ళింటికి వెళ్ళి అడిగాడు. 'పోరా! కుర్రకుంకా! నీలాంటి పోరంబోకుకు మా అమ్మాయినివ్వం' అని వాళ్ళన్నారు.

దమయంతికి కూడా వీడంటే ఇష్టం లేనట్టే వుంది. కానీ వీడు చాలాసంవత్సరాలు ఆ అమ్మాయికోసం ప్రయత్నించాడు. వీడి గురించి చాలా మంచి, 'చాలా రకాలుగా' చెప్పుకున్నారు, నవ్వుకున్నారు.

ప్రకాశాన్ని కలిసి మూడు సంవత్సరాలయింది వాడు తన సమస్యకు పరిష్కారం దొరికిందన్నాడు. 'ఏమైవుంటుందబ్బా! దమయంతి వీడిని చేసుకోడానికి ఇష్టపడిందా?' అని అనుకుంటుండగా, ఫ్యాన్ పిలవడంతో ఆలోచనల్లోంచి బయటపడ్డాను.

విజయవాడ స్టేషను మామూలుగానే హడావిడిగా వుంది. రైలుకూడా కరెక్టు టైంకే వచ్చింది. ప్రకాశాన్ని చూడగానే నాలో ఉత్సాహం ఉరకలు వేసింది

మూడేళ్ళలోనూ జరిగిన ఎన్నో సంగతులు చెప్పుకున్నాం.

రైలు కూతేసింది, బయల్దేరడానికన్నట్టు.

"ఈరోజు నాకో ముఖ్య విషయం చెప్తానన్నావు, ఏమిట్రా అది?" అడిగాను.

"ఊహించలేవా?" నన్నే అడిగాడు.

"దమయంతి సంగతయుంటుంది. అవునా?"

"అవును"

"ఏమయింది?"

"దమయంతికి పెళ్ళయిపోయింది" వాడు చెప్పాడు.

రైలు కదిలింది.



# సోషలిస్టు

పి.వి.ఆర్.శివకుమార్



ఉదయం నిద్రనుంచి లేస్తూనే, ఈ నెలనించీ నేను వన్ పర్సెంటు జీతాన్ని 'బిచ్చగాళ్ళ' కోసం కేటాయిస్తున్నానని ప్రకటించి నప్పుడు మా ఆవిడ ముఖం చిల్లిగవ్వంతయిపోయింది.

అవును మరి, ఒకటికాదు - రెండు కాదు. నెలకు పదిరూపాయలు - ఆఫ్టరాల్ బిచ్చగాళ్ళకోసం - ప్రతీనెలా ఖర్చుపెడతా నన్నాను మరి!

"అదేవిటండీ? వున్నట్టుండి అలాంటి నిర్ణయం తీసుకుంటున్నారూ? అంతడబ్బు ఎక్కువై పోతే, ఆ పదితోనూ ఓ రికరింగు డిపాజిట్టు ఓపెన్ చెయ్యండి చంటాడి పేర్న! అంతేగానీ " అంది.

అవును, దానికంతే తెల్సు! షి డిజ్ లైక్స్ బెగ్గర్స్ ఆ 'యిది' నాకూ వుండేది మొన్నటిదాకా మొన్న సాయంత్రం ఆ సంఘటన జరిగేదాకా. .

* * *

నాకు నిమ్మస్తాయి మనుషులంటే అసహ్యం వాళ్ళ చేష్టలూ, లేకి ప్రవర్తనా అలాటి అసహ్యం నాలో కలిగిస్తాయి. (వాళ్ళ ఆ ప్రవర్తనకి కారణం మాత్రం ఎన్నడూ ఆలోచించలేదు నేను!) ఇహ బిచ్చగాళ్ళ సంగతి వేరే చెప్పే అవసరమే లేదు. మన ప్రభుత్వం ధర్మమా అని— డిస్కరేజ్ బెగ్గర్స్ అన్న ముక్కని నేను అక్షరాలా పాటిస్తాను.

తక్కువజాతి మనుషులు మన సరసన నిలవటానికూడా పనికిరారని నేనంత గట్టిగా అనటానిక్కీ, అనుకోవటానికీ మరో ముఖ్యకారణం మా సీతాలు!

సీతాల్ని చచ్చినట్టు 'మా సీతాలు' అంటూ సంబోధించాల్సిందే! కారణం అది మా పనిమనిషి పెళ్ళాన్ని సవ్యంగా చూడకపోయినా పర్లేదేమోగానీ, పనిమనిషిని సవ్యంగా చూడకపోతేమాత్రం మన పాట్లు వీధికుక్కలుగూడా పడవ్!

ఆ వూరొచ్చినప్పట్నుంచీ, సీతాలు కుదిరేదాకా మారిన అరడజనుమంది సర్వెంటు మెయిడ్సూ జమిలిగా నాకీ అనుభవంనేర్పి వెళ్లేరు! అంచేతే సీతాలు వచ్చిన దగ్గర్నుంచీ - దాని బిహేవియర్ నాకేమాత్రం నచ్చకపోయినా - దాని పనితనం మా ఆవిడకి బాగా నచ్చటంతో - దానితో మంచిగానే వుంటున్నాను నేను. (అబ్బే, మరేంలేదు. దాన్ని కసురుకోకుండా, అసలు మాట్లాడకుండా మన ధోరణిలో మన ముండటమే!)

సరే, యింతకీ సీతాలు మనసరసన్నిల బట్టానికూడా పనికిరాదని చెప్తున్నాను కదూ! అవును. ఎంచేతంటారా - మొదట అది సర్వెంటు. కాకపోయినా, కొందరు సర్వెంట్లయినాయజమాన్లకన్నా స్టయిలిష్‌గా ఫోజిచ్చేస్తారు ఐ లైక్ దేమ్ - ఇన్ ఫాక్ట్ డబ్బువుండే తీరక్కర్లేదు, రాజు కావటానికి! రాజయ్యే గుణమున్నవాడికి అదే పెద్ద సంపద!

కాన్నీ, మా సీతాలు ఫక్తుమనిషి. ఆ ముక్క దానికి నిద్దర్లోగూడా గుర్తుంటుం దనుకుంటాను. (మా ఆవిడకి తృప్తిగా నిద్రపట్టనినాడు, అదిగూడా మాగన్నుతోనే కునుకుతుందేమోనని నా అనుమానం!) పైగా, దానిబుద్ధులుగూడా అలాంటివేను!

నిజానికి అందరు పనిమనుషులంత పేద ముండ కాదది. దాని మొగుడు - మా ఆఫీసులోనే ప్యూన్! నెలకి నూటయాభై దాకా వస్తాయి వాడికి. అది మాకాలనీలో అధమం అయిదారిళ్ళలో పన్చేస్తోంది. అంటే, నెలకి అరవై డభ్భైదాకా సంపాదిస్తుందన్నమాట!

వాళ్ళ సంసారమూ అంత పెద్దదికాదు (ట!) ముగ్గురు పిల్లలూ, అత్తామామా! వాళ్ళూ ఏదో బుట్టలల్లీ, తట్టలల్లి సంపాయిస్తారు.

అయినా దీనిబుద్ధిమాత్రం దరిద్రపు బుద్ధే!

అలాగని అంత పిసినారిదీ కాదు మళ్లీ!

ఏవైనా పైపన్లు - పిండిరుబ్బటమో, మరపట్టించుకురావటమో, బియ్యం బాగు చెయ్యటమో లాటి అదనపు డ్యూటీలు - చేయించుకుని, మా ఆవిడ ఏ పావలో దాని చేతిలో పడెయ్యబోయినా మొగమాటపడి చచ్చేది మొదట్లో పుచ్చుకోవటానికి! కొంపలో ఎవ్వరమూ లేకుండా తాళాలు

దాని చేతికిచ్చి, బజార్లకీ, సినిమాలకీ వెళ్లిన రోజులున్నాయిగానీ, ఒక్క చీపురుపుల్ల గూడా స్థానం కదిలిన సంఘటనలేదు.

అంత నిజాయితీ, నిర్మలతా, మొగ మాటమూ వున్నదానికి ఆ 'కక్కుర్తి బుద్ధి' ఎందుకో మాత్రం నాకర్థం కాలేదు.

తిండిలేక, వస్తులు పరుండేవాళ్ళుగూడా చేయ (రని నేననుకునే) ని 'ఆపని' ఆదెందుకు చేస్తుందో నాకు వూహకందలేదు.

ప్రతిరోజూ పన్లోకి వచ్చేటప్పుడు ఆ అల్యూమినం బేసిన్ తెచ్చుకుంటుంది.

అంట్లు తీసుకోగానే, అందులో మిగిలిన అన్నమూ, కూరలూ - ఏవైనా సరే - అదిగాతీసి అందులో వేసుకుంటుంది.

అంతవరకూ ఫర్వాలేదు సహజంగా ప్రతిపని మొండికీ వుండే అలవాటే కానీ, గిన్నెల్లో వదిలిన అన్నమూ, కూరలేకాక, కంచాల్లో - నీళ్ల పోసయినాసరే - వదిలిన 'ఎంగిలి కూటి' కూడా కక్కుర్తి పడుతుందది!

ఒక్కసారి చూశాన్నేను, బాతురూం లోంచి వస్తూ! కంచాల్లో వదిలేసిన ఎంగిలి మెతుకులు తీసి, ఆ బేసిన్లో విడిగా పెట్టుకుంటోంది.

నామీద గొంగళి పురుగులు పాకినట్లయింది! లోపలికి వెళ్తూనే మా ఆవిణ్ణి కేకేశాను—

"ఏవిఁటోయ్, ఆ సీతాలు చేస్తున్న పని? దరిద్రంగా ఆ ఎంగిలి కూటికోసం కూడా ఏమిటా కక్కుర్తి? అందరి ఎంగిలీ తిని, ఏ రోగాలో తెచ్చుకుని ఆ రోగిష్ఠి వంటితో మన కొంపకి పన్లోకొస్తే ఛీ ఛీ .. డర్టీ బగ్గర్!

దానిచేత ఆ పనయినా మాన్పించు. లేదా మనపనయినా మాన్పించు

అయ్ కాంట్ టాలరేట్ సచ్ థింగ్స్'

అంటూ సివియర్ వార్నింగొకటి పారేశాను.

కానీ రెండూ జరగలేదు. సీతాలు మా యింటిపనీ, దాని అలవాటు పనీ, రెండూ చేస్తూనే వుంది! దాని బ్లడీ సిన్సియారిటీ ఎండ్ అలర్ట్‌నెస్‌లే దాన్ని కాపాడుతున్నాయి పనిపోకుండా! మా ఆవిడ, దాని విషయంలో నన్ను సైతం ఎదిరించింది.

'పోనివ్వండి, పనిముండ మనకేం పోయింది దాని కక్కుర్తివల్ల? ఆ ఒక్క కారణాన దాన్ని పనిమానిపిస్తే - తిర్వాత సరైన పనిమనిషి దొరక్క నే నిబ్బంది పడాలి' అంటూ

నే నూరుకోకతప్పలేదు.

కానీ, అప్పట్నుంచీ అదంటే నాకు పరమ అసహ్యం ఏర్పడింది.

(అంతకు ముందుదాకా అది నా గది తుడవటానికి వస్తే నాకో 'డర్టీ ఎట్రాక్షను'డేది వంగి, వంగి అది గదిలో మూల మూలలా తుడవటమూ, మధ్య మధ్య జారిపోయే పైట మార్చి, మార్చి సర్దుకుంటూ అవస్థపడటమూ, మంచి యవ్వనంలో వున్నదాని శరీరం నా కళ్ళకి విందు చేయటమూ, అదో మత్తయిన (దొంగ) అనుభవంగా వుండేది.

కానీ, యీ ఎంగిలి కూటి విషయం చూసినదగ్గర్నుంచీ, దాని వంట్లో ప్రవహించే రక్తమంతా ఎంగిలిదేమోననీ, దాని శరీరంలోని వంపులన్నీ ఎంగిలివేననీ, ఎంతో అసహ్యం కలగసాగింది.

దాన్ని చూడాలంటేనే అసహ్యం వేయటంతో, అది గది తుడవటానికి వస్తూనే, నేను రూములోంచి బయటకు వెళ్ళిపోసాగేను.)

* * *

సడెన్‌గా స్కూటర్ ట్రబులిచ్చింది.

ఉదయం వచ్చేటప్పుడు బాగానేవచ్చింది. సాయంత్రానికి మరి ఏం జబ్బుచేసిందో!

విసుక్కుంటూ దాన్ని అక్కడే వొదిలేసి, రోడ్డుమీది కొచ్చేను. ఒక్క ఆటో గూడాలేదు స్టాండ్‌లో! అవసరం కదా మరి - వుండవంతే! అనవసరంగా టాక్సీ ఎక్కడం యిష్టంలేకపోయింది ఒక్క మనిషి కోసం!

సరే, రిక్షా పిల్చాను. ఎక్కాను.

బడబడా వాగేస్తూ, హుడావిడిగా తొక్కేస్తున్నాడు - రిక్షావాడు. కుర్ర వెధవ, హుషారుగా వున్నాడు!

"అరె . అరె ఇదేం దారయ్యా? యిటు పోనిస్తున్నావ్?" అన్నాను, ఏదో ఎరగని సందులోకి మళ్లిస్తున్న వాడితో, కంగారుగా.

"ఫర్లేదుసార్ అడ్డదారే అయినా, దగ్గిరిదారి! అయిదే నిముషాల్లో యింటి దగ్గరుంటాం."

అంటూ పెడల్ వెయ్యసాగాడు.

ఆ వీధి ఎన్నడూ చూడలేదు నేను.

అవును, ఎలా చూస్తాను? అలాంటి వీధులు నాకసలు పడవు.

దేశంలోని దరిద్రానికి స్పెసిమెన్స్ ఆ వీధీ - ఆ మనుషులూ.

పూరిగుడిశెలు, రోడ్డుపక్కని బతుకులు, మనుషుల్లాటి శవాలు! అవయవాలన్నీ సక్రమంగా అమరని వికృతరూపులు: కుష్టు, బొల్లి యింకేవేవో పేర్లు తెలియని రోగాలతో, రసికారుతున్న పుళ్ళతో, చూడ శక్యంకాని మనుషులు!

బిచ్చగాళ్ళ గూడెమన్నమాట! అయితే, యిలాటి గూడేలుగూడా యిరవయ్యోశేళ్ళ తర్వాత యింకా వున్నాయన్నమాట!

కడుపులో దేవినట్లయి, కళ్ల మూసుకోబోయి, హఠాత్తుగా కనబడ్డ మరో దృశ్యంతో దడాలున ఆగిపోయాను.

అక్కడ అక్కడ కనబడ్డ వ్యక్తి - సీతాలు,!

అది చేస్తున్న పని నాకు మరింత భ్రాంతి కలిగించింది.

దాని అరచేత అక్షయ పాత్రలా అల్యూమినియం గిన్నె!

వరసగా కూర్చున్న బిచ్చగాళ్ళ ముందున్న పిల్చెల్లో ఆ 'ఎంగిలికూటిని' (అనుకుంటాను) తీసి వడ్డిస్తోంది! ఆబగా దాన్ని నాకేసి, మళ్ళీ జాపుతున్నారు ఆ మనుషులు (?)

చూస్తుండగానే దాని బేసిన్ ఖాళీ అయిపోయింది.

తిన్నవాళ్ళ దీవెనల్ని వినకుండానే, ఆ అన్నదాత, బేసిన్ తీసుకెళ్ళి దూరానవున్న కుంటలో తొలుస్తోంది!

"ఏటండి సూత్తన్నారు? దాన్నా- అది సీతాలనండి మహ దొడ్డమనిషి లెండి! రోజూ రెండుపూట్లా యిట్టాగే అన్ని యిళ్ళలోంచి కూడుతెచ్చి, సంతర్పణ సేస్తదండి! అది పనిమనిషిలెండి సాలామంది దొరబాబులయిళ్లలో! ఆళ్ల కేటండి! పారేత్తారు. అదే యీళ్లకి పరమాన్నం-

ఆనాడు మోహిని దేవతలకేంపంచిందో తెలవదుగానండి-ఇదిమాత్రం యీ దరిద్రులకి అమృతవే పంచుద్దండి! ఆళ్ళబతుకులకది అమృతవే లెండి!

రోజెట్టికూడే గాదండి-ఏడాదికోపాలి ఆళ్లకి బనీన్లుగూడా కుట్టిపంచుద్ది. అప్పుడప్పుడెవళ్ళయినా యిత్తే, గుడ్డలు గూడా తెచ్చిస్తది!

మా దొడ్డబుద్ధి

చెప్తున్నాడు రిక్షావాడు.

రిక్షా ఆ వీధిని దాటేసింది.

* * *

ఆరాత్రి పడుకున్నా నాకు నిద్రపట్టలేదు. కలగాపులగంగా పీడ (?) కలలు! పాడుదృశ్యాలూ!!

సంపాదించేది షెడ్లల్లోనైనా, వందల జీతగాళ్ళలా సీతాకోకచిలుకల్లా అలంకరించుకుతిరిగే (యిదివరకు మా యింట్లో పనిచేసిన) ఎందరో (పని)మనుషులు!

వందల్లో సంపాదిస్తూ కూడా, పేదగా-అతిసాదాగా బ్రతుకుతున్న సీతాలు!

గిన్నెలగిన్నెలు వొండుకుని, తిన్నంత తిని, తూముల్లోకి విసిరే యిల్లాళ్ళు—

కంచాల్లో నానిపోయిన ఎంగిలికూటిని తీసి, దాచి, గతిలేని బిచ్చగాళ్లకి అమృత రూపంలో పంచుతున్న సీతాలు!

దరిద్రాన్ని తరుముతామని స్లోగన్లు దంచుతూ, వోట్లడుగుతున్న నాయకులూ, నాయకీమణులు!

నోటమాట వెలువర్చకుండా - వున్నవాళ్లు పారేసినదాన్ని లేనివాళ్ల కడుపులకి పంచుతూ, సోదర మానవులపట్ల తన కర్తవ్యాన్ని (?) నెరవేర్చుకుంటున్న సీతాలు!

నలుగురికి పెట్టగలిగీ, నాలుగు బ్యాంకుల్లో అక్కవుంట్లు వోపెన్ చేసుకు వూరుకుంటున్న 'నేను'లు.

పాతబట్టలకొట్లో అమ్ముకోగలిగిన బట్టల్ని ఉచితంగా దానం చెయ్యటమేకాక, దాచుకున్న డబ్బులోంచి ఏటా దరిద్రులకి బనియను, కుట్టిపంచుతున్న సీతాలు—

మర్నాటి వుదయమేలేస్తూ, వన్ పర్సెంట్ డొనేషన్ నేను ప్రకటించటమూ, మా ఆవిడ ప్రొటెస్ట్ చెయ్యటమూ ఐనా నేను నా నిర్ణయం మార్చుకోకపోవటమూ జరిగాయి!

ఫస్ట్ వచ్చింది. పదినోటు తీసి, పక్క జేబులోకి తోశాను. అంతలో వచ్చేడు శంకర్రావ్.

"చూడండి, యీ మంత్ మీరో హండ్రెడ్ సర్దాలి నాకు. మా మిసెస్ డెలివరీ కదా! ఎన్ని ఖర్చులో "

తప్పలేదు. అతను నా కొలీగ్ ఇచ్చాను.

ఆ సాయంత్రం బడ్జెట్ లెక్కలు చూశాక, రెండో జేబులోని పది మళ్ళా మొదటి జేబులోకి చేరిపోయింది - ఆటోమేటిక్‌గా!

అవును, వున్నవాళ్ళూ, వున్నవాళ్ళూ ఒకటి! అయినా, బిచ్చగాళ్ల గురించి నాకెందుకూ బాధ? బెంగ? దేవుడే వాళ్ళనలా సృష్టించాడు.

కాకపోయినా—

దీనుల కాపాడుటకు దీనులే వున్నారు-సీతాలులాంటివాళ్లు.

కాదంటారా? *

# ఎదురింటి కిటికీ

అరుణ ఎందుకో తనగది కిటికీలోంచి వీధివైపుకు చూచింది. ఎదురింటి కిటికీలో నల్లకళ్లజోడు పెట్టుకున్న అబ్బాయి తనవైపే చూస్తూ కనిపించాడు. గిరుక్కున అరుణ కిటికీ దగ్గర్నుంచి ఇవతలకు వచ్చేసింది.

మరోసారి మరో నిముషం పోయాక ఎందుకో అప్రయత్నంగానే అరుణ మళ్లీ కిటికీ దగ్గరకు వెళ్ళి నుంచుంది అలాగే కిటికీలోంచి ఇటువైపు చూస్తున్నాడా అబ్బాయి.

"ఇడియట్!" అనుకుంది అక్కణ్ణుంచి తప్పుకుంటూ అరుణ ఆరుణ చాలా అందమైనది దానికి తగ్గట్టు అతిశయం-దురుసుతనంకూడా చాలా ఎక్కువే ఆమెకు అందుకనే కాలేజీలో సహితం అబ్బాయిలు ఆమె జోలికి రావటానికి జంకుతారు ఒకవేళ ఎవరైనా వచ్చినా వాడి పనయ్యిందన్నమాటే

తనొక హేమమాలినినీ - తనకు రాజేష్‌ఖన్నా లాంటివాడు కాని పనికిరాడనీ ఆమెకో గట్టి నమ్మకం. అందుకే ఆమె కంత పొగరు. ఆరోజుకి అరుణ ఇంకా ఆ కిటికీ దగ్గరకు వెళ్ళలేదు.

మర్నాడు ఉదయమే అతిసామాన్యంగా కిటికీ దగ్గరకు వెళ్ళి నుంచుంది. ఆ అబ్బాయి కిటికీ దగ్గర కూర్చుని ఉన్నాడు. "మొదలెట్టాడు మళ్లీ వెధవ గుడ్లగూబ చూపు వాడు-" అనుకుంది పళ్లు పిండు కుంటూ కాసేపుండి మళ్ళీ చూసింది ఇంకా అలాగే ఉన్నాడు.

"లాభంలేదు వాడికి బుద్ధిచెప్పాలి!" అనుకుంది.

చెప్పులు వేసుకుని గబగబా ఎదురింటి వైపు నడిచింది అరుణ చాలా పొగరుగా ...కోపంగా పళ్లు పిండుతుంటూ

స్వంత ఇంట్లోకి వెళ్తోనట్లు చకచకా హాల్లోకి ప్రవేశించి ఒకమాటు అటూ చూసి ఆ అబ్బాయి ఉన్న గదిలోకి అడుగు పెట్టింది ఆ గదిలో కిటికీకి దగ్గరగావేసిన మంచంమీదనుంచి వీధిలోకి చూస్తూ కూర్చుని ఉన్నాడా అబ్బాయి. అరుణ కాలిజోళ్ళ శబ్దం విని - 'ఎవరది?' అనడిగాడు. అరుణ ఏదో అనబోయింది ఇంత లోకే అతను - "అమ్మా! ఎవరో వచ్చి నట్లున్నాడు చూడు!" అన్నాడు గట్టిగా

అరుణకి పరిస్థితి అర్థం అవ్వటానికి అట్టేసేపు పట్టలేదు. లోపల్నించి ఒక ముసలామె వచ్చి - "ఎవరమ్మా! ఏం కావాలి?" అనడిగింది, అరుణ తడబడుతూనే- "ఆయన ఆయన .." అంది. తుంచి తుంచి ముసలామె నవ్వింది-దిగులుగా, "మా అబ్బాయమ్మా! చిన్నప్పుడు వచ్చిన మశూచికం రెండు కళ్లనూ రెండుకాళ్లనూ పట్టుకుని వెళ్లిపోయింది. వాడు చూడనూలేడూ - నడవనూ లేడు" అంది.

అరుణ మనసు చెదరిపోయింది,

"ఏం అమ్మా! ఇంతకూ ఏంకావాలి?" అనడుగుతున్న ముసలామె ప్రశ్నకు బదులివ్వకుండా అంతులేని పశ్చాత్తాపంతో ఇంటికొచ్చేసింది ఒక్కపరుగున!

—జ్యోతి